The Largest Circulated Telugu Monthly

# చతుర

ఫిబ్రవరి 1997 ❖ 7 రూపాయలు



## పేదపిల్ల

మొలకలపల్లి కోటేశ్వరరావు

# చతుర కథలు

## హేండ్సప్!

అదో నేషనలైజ్డ్ బేంక్ బ్రాంచ్. హైద్రాబాద్ లోని జనంతో కిక్కిరిసిన అనేక కాలనీలలో అదొకటి. ఆ కాలనిలోని నేషనలైజ్డ్ బ్రాంచి అది. కమర్షియల్ ఏరియా లోకల్ రెసిడెన్షియల్ ఏరియాలో వుండటంతో, ఆ కాలనీవాసులకి అనుకూలంగా వుండేలా ఆ బ్రాంచ్ 'తెరచేవేళల'ని నిర్ణయించారు.

డివిడెండ్ వారెంట్స్, మంచి క్రెడిట్ రేటింగ్గల లిమిటెడ్ కంపెనీల్లో ఫిక్సెడ్ డిపాజిట్ల తాలుకు ఇంటరెస్ట్ వారెంట్స్ యూనిట్ ట్రస్ట్ మంత్లీ ఇన్కం స్కీంలు... ఒక్కటేమిటి, ఆ మధ్యతరగతి కాలనివాసులకి నిత్యం బ్యాంక్‌తో పనే.

ఇలాంటి బేక్‌గ్రౌండ్‌గల ఆ బేంక్‌లో బుధవారం ఓ సంచలన సంఘటన జరిగింది.

అతని వయసు నలభైరెండుంటుంది.



ఉదయం ఎనిమిదిన్నరనించి పదిన్నరదాకా, సాయంత్రం అయిదున్నరనించి ఏడున్నరదాకా. ఆఫీసుకి వెళ్ళేవాళ్ళు కొందరు ఆదరాబాదరాగా ఆ టైంలో బేంక్‌కి వెళ్ళి, ఆఫీసు నించి ఇంటికి వెళుతూ మరి కొందరు బేంక్‌పనులని చేసుకొంటారు. దాంతో ఆ రెండు షిఫ్ట్‌ల పని వేళల్లో ఎప్పుడూ బేంక్ ప్రిమిసెస్ రద్దీగానే వుంటుంది.

రెసిడెన్షియల్ కాలని కాబట్టి ఆదివారం ఆ బేంక్ వర్క్‌చేస్తుంది. సోమవారం సెలవు. ఆదివారాల్లో పనిగంటల్లో ఆ బేంక్ ఇంకా రద్దీగా వుంటుంది.

సాయంత్రం ఆరుంపావుకి బేంక్‌లోకి ఎంటరయ్యాడు. చేతిలోని పిస్తోలుని వాచ్‌మేన్‌కి గురిపెట్టి చెప్పాడు.

"నీ తుపాకి ఇటివ్వు"

బేంక్ ఉద్యోగంకన్నా ప్రాణాలే ముఖ్యం అనుకున్నాడా ఎక్స్-సర్వీస్‌మేన్. పిస్తోలుధారి చెప్పినట్లు చేసాడు. వాచ్‌మేన్‌ని బేంక్ స్టాఫ్ లంచ్‌రూంలోకి తోసి బయట తలుపు గడియ పెట్టి అరిచాడతను, ఓసారి తుపాకి పేల్చి.

"ఎవరూ పిచ్చివేషాలు వేయకండి.

పుచ్చెలేచిపోతుంది''

సరాసరి కేషియర్ దగ్గరకి వెళ్లాడు. కేషియర్ అతగాడు కాదు ఆమె. ఆ లేడీ కేషియర్‌కి పిస్తోలు గురిపెట్టి కర్కశం చూపిస్తూ చెప్పాడు.

"దీపావళి పిస్తోలు కాదిది చెల్లెమ్మా. నేను ట్రిగ్గర్ నొక్కి దీంట్లోంచి గుండు బయటకివచ్చిందా, అది నీ గుండె పగిలి వీపులోంచి బయటకి వచ్చి క్షణంలో వెళ్ళి నీ వెనక కేబిన్‌ని భేదించుకుని గోడలోదిగుతుంది. అర్థమైందా చెల్లెమ్మా?"

"అర్థమైంది అన్నయ్యా'' సెంటిమెంటుతో బయట పడచ్చని చెప్పింది కేషియర్ రెండు చేతులూ పైకి ఎత్తి పట్టుకుని. పరిస్థితి గమనించి అప్పటికే బేంక్ మేనేజర్ పోలీసులకి ఫోన్ చేయడం గమనించలేదా పిస్తోలు శాల్తీ.

"చెల్లెమ్మా చేతులు ఎందుకు పైకి పెట్టావ్? దించు. దించి నాకు డబ్బివ్వు''

"అలాగే అన్నాయ్''

వణికే చేతులతో కేషియర్ అయిదు వందల రూపాయల కట్టలున్న డ్రాయర్‌ని బయటకి లాగింది. వాటిని తీసి పిస్తోలు శాల్తికిచ్చింది.

"ఎంత ఇది?" అడిగాడతడు

"లెక్కపెట్టలేదు''

"లెక్కపెట్టి ఇవ్వు. నలభై రెండు వేలు ఇవ్వు''

"నలభై రెండు వేలేనా అన్నాయ్?" విస్మయంగా చూస్తూ అడిగింది క్యాషియర్.

"అవును చెల్లెమ్మా''

ఆమె అతనివంక ఓ పిచ్చివాడివంక చూసినట్లు చూసింది. అతను పిస్తోలుని తోటి కస్టమర్స్‌వైపు తిప్పి అరిచాడు.

"దూరం... దూరం"

క్షణాల్లో అంతా వెనక్కెళ్ళి గోడకి అతుక్కుపోయారు. అతను నలభైరెండువేలు తీసుకుని తనతో తెచ్చిన జిప్‌బేగ్‌లో వుంచుకొన్నాడు. మఫ్టీలో వచ్చిన పోలీసులు అతని మీదకి సరిగ్గా ఆ సమయంలో లంఘించి బంధించారు.

"మూడు రోజులనుంచి లాకప్‌లన్నీ ఖాళీ. నా చేతి దురద, ఈ లాఠీల దురద తీర్చుకోడానికి ఎవ్వడు దొరుకుతాడా అని చూస్తున్నాం. నా లక్కొద్ది చిక్కావ్' తాచుపాము బుసలా వుంది ఎస్.ఐ. కంఠధ్వని.

అతన్ని లాక్కెళుతుంటే చెప్పాడు పిస్తోలు శాల్తి

"ఒక్కక్షణం. మీరు చెప్పేది బయట చేసుకొందాంగాని నాకింకా ఇక్కడొకక్షణం పనుంది. చేతులు వదలండి''

"వదలం"

"అయితే నాచొక్కా జేబులోని చెక్‌ని తీసి సేవింగ్స్‌బేంక్ కౌంటర్‌లో ఇవ్వండి. సరిగ్గా నేను తీసుకొన్న నలభైరెండువేలకి చెక్'

"చెక్కా? చెక్కేమిటి?" అన్నాడు ఎస్.ఐ.

"నాకిక్కడ అకౌంట్‌వుంది మహాప్రభో. నాలుగురోజులుగా ఈ డబ్బు విత్‌డ్రా చేయడానికి తిరుగుతున్నా పనికావటంలా. రేపు ఉదయం పదకొండుకల్లా ఈ డబ్బుని నేను ఫ్లాట్‌ని కొన్న బిల్డర్‌కి ఇవ్వకపోతే ఎల్లుండి నించి వడ్డీ తీసుకుంటానన్నాడు. ఎప్పుడొచ్చినా ఈ క్యూ కొన వంతు వచ్చేసరికి 'విండోక్లోజ్' బోర్డు పెడుతున్నారు కాబట్టి నాడబ్బు నాకు రావాలంటే... కదలకండి''

పిస్తోలుని పోలీసులకి గురిపెట్టాడతను అకస్మాత్తుగా. వాళ్ళంతా చేతులెత్తాక సేవింగ్స్ బేంక్ కౌంటర్‌లోని కుర్రాడితో చెప్పాడు క్రూరంగా చూస్తూ.

"ఇదిగో పాస్‌బుక్. ఎంట్రీలు వెంటనే వేసివ్వు. ఎప్పటిలా 'రేపురండి' అన్నావో గుండు గుండెలో దిగుతుంది జాగ్రత్త'

వాడు వణుకుతూ పిస్తోలు శాల్తీ పాస్‌బుక్‌ని అందుకున్నాడు.

-పృథ్వీరాజ్

---

ముఖపత్రం: వై. బాలయ్య

---

# ఓవర్‌టేక్

జోగినాధం ఆఫీసులో లోన్సు ఇస్తున్నారని మోపెడ్ కొనేశాడు. ఒక శుభముహూర్తాన మెకానిక్ డింగరీని పిలిచి డ్రైవింగ్ నేర్పమన్నాడు. జోగినాధాన్ని మోపెడ్‌మీద కూచోబెట్టుకుని మున్సిపల్ ప్లేగ్రౌండ్‌కి తీసికెళ్ళాడు డింగరి.

"సైకిల్‌లాగా మోపెడ్‌ని తొక్కే ప్రశ్నే వుండదు. బండిమీద కూచుని ఇంజన్ స్టార్ట్ చేస్తే చాలు. బంయ్‌మంటూ బండి అదే ముందుకు లాక్కుపోతుంది. మీరు చెయ్యాల్సిందల్లా బండిని బ్యాలెన్స్ చెయ్యడమే! నేను గొప్పలు చెప్పుకోవడం కాదుగానండీ, చిన్నప్పుడు చిరంజీవి నా దగ్గరే డ్రైవింగ్ నేర్చుకున్నాడు. ఇప్పుడు సినిమాల్లో మోటార్‌సైకిల్ ఛేజింగులు చేస్తూ పెద్ద స్టంట్ హీరోలా వెలిగిపోతున్నాడు. అంతేకాదు సార్! మీ ఆఫీసులో వాళ్ళందరూ నా దగ్గరే డ్రయివింగ్ నేర్చుకున్నారు. నా దగ్గర డ్రైవింగ్ నేర్చుకున్నవాళ్లెవరికీ చిన్న దెబ్బ కూడా తగల్లేదు. ఈ సిటీహోల్ మొత్తానికి నన్ను మించిన మెకానిక్ లేడు సార్! మీ బండికే ట్రబులొచ్చినా నన్నే పిలవాలి సార్" అన్నాడు డింగరీ.

"అలాగేలేవోయ్! ముందు నాకు డ్రయివింగ్ నేర్పు'' అన్నాడు జగన్నాథం.

"ఇది పెద్ద ప్లేగ్రౌండ్. ఇక్కడ మీకెవరూ అడ్డం రారు. ఇక్కడ మీ ఇష్టమొచ్చినన్నిసార్లు రౌండ్లు కొట్టవచ్చు. ఇదిగో ఇది బ్రేక్. ఇది నొక్కారనుకోండి బండి ఆగుతుంది. ఇది ఫ్రంట్‌బ్రేక్. దీన్ని మాత్రం నొక్కకండి. ఇది యాక్సిలరేటర్. దీన్ని రైజ్‌చేస్తే బండి స్పీడందుకుంటుంది. బ్రేకెయ్యాలన్నప్పుడు యాక్సిలరేటర్ డౌన్‌చేసి బ్రేకెయ్యండి. బండి ఆగిపోతుంది. తెలిసిందిగా. ఇప్పుడు మీరు బండిమీద కూర్చుని ఇంజన్ స్టార్ట్ చెయ్యండి. బండి స్పీడందుకుంటే యాక్సిలరేటర్ డౌన్ చెయ్యండి. బండి కుడిపక్కకి వాలిపోతుంటే హాండిల్‌బార్ ఎడమవేపు తిప్పండి. ఎడవేపుకి వాలితే కుడివేపు తిప్పండి. గుండె ధైర్యం తెచ్చుకోండి సార్! మీ ప్రాణానికి నా ప్రాణమడ్డు'' అని ధైర్యం చెప్పి జగన్నాధాన్ని బండిమీద కూర్చోబెట్టి ఎదరకు తోశాడు డింగరీ.

ఎలాగైతేనేం అతికష్టంమీద బండిని బ్యాలెన్స్ చేసుకుంటూ పది చక్కర్లు కొట్టాడు జగన్నాధం.

"చూశారా సార్! మీకు చాలా తేలిగ్గా డ్రైవింగొచ్చేసింది. ఇంక మీరు రోడ్డెక్కెయ్యచ్చు. రోడ్డెక్కేముందు మీకు కొన్ని రోడ్‌రూల్సు చెబుతాను. వాటిని పాటిస్తే మీకే ఇబ్బందీ వుండదు. రోడ్డుకెప్పుడూ ఎడంపక్కనే బండిని నడపాలి. ఇప్పుడు నేనో బస్‌ననీ, మీకెదురొస్తున్నాననీ అనుకుని నన్ను మీరు తప్పించుకెళ్ళాలి'' అంటూ డింగరీ జగన్నాధం నడుపుతున్న మోపెడ్‌కెదురు నడిచాడు.

జగన్నాధం జాగ్రత్తగా మోపెడ్‌ను ఎడంపక్కనే పోనిస్తూ డింగరీని దాటివెళ్లాడు.

"గుడ్! ఇప్పుడు నేను మీరు వెళ్తున్నవేపే వెళ్తున్న ఒక బస్‌ని అనుకోండి. నన్ను మీరు ఓవర్‌టేక్ చెయ్యాలి. అలా ఓవర్‌టేక్ చెయ్యాలంటే నా కుడిపక్కనించి ఓవర్‌టేక్ చెయ్యాలి. అలా చేసేటప్పుడు మీరు హారన్ మోగిస్తే మీకు నేను సైడ్ ఇస్తాను. మీరు నాపక్కనించెదరకెళ్తారు. ఏదీ ఒక్కసారి ట్రయలెయ్యండి'' అంటూ డింగరీ ఎదరకు నడవడం మొదలెట్టాడు.

జగన్నాధం డింగరీ వెనకగా మోపెడ్ మీదొచ్చి హారన్ మోగించగానే, డింగరీ సైడ్



ఇచ్చాడు. జగన్నాథం మోపెడ్‌మీద ఎదరకు దూసుకెళ్ళాడు.

అలా ఓ అరగంట రకరకాలుగా తిరిగాక అన్నాడు డింగరీ.

"మీకు డ్రయివింగొచ్చేసింది సార్! ఇక మీరు రోడ్డెక్కేసినాలుగైదు వీధులు తిరిగొచ్చెయ్యండి సార్. అప్పటిదాకా నేనిక్కడే వుంటాను'' అని ప్రోత్సహించి జగన్నాథాన్ని రోడ్డుమీదకి పంపాడు.

"ముందు హారన్ కొట్టలేదా మీరు? బస్‌వాడు సైడివ్వలేదా!" అడిగాడు డింగరీ.

"నేను బస్‌ని కాదు ఓవర్‌టేక్ చెయ్యాలనుకున్నది. గేదెల్ని. నువ్వు చెప్పినట్టుగానే వాటిని కుడిపక్కనించి ఓవర్‌టేక్ చెయ్యబోయి హారన్ కొట్టాను. అవి బెదిరి కుడిపక్కకొచ్చాయి. వాటికెడంపక్కనించెళ్లడం రోడ్డు రూలుకు వ్యతిరేకమని నేను మరింత కుడిపక్కకెళ్ళి ఓవర్‌టేక్ చెయ్యబోయాను.



అరగంటయినా జగన్నాథం రాకపోయేసరికి డింగరీ కంగారుపడి జగన్నాథాన్ని వెతకడానికెళ్ళాడు.

జగన్నాథం వొళ్లంతా దెబ్బలతో మోపెడ్‌ని ఈడవలేక ఈడుస్తూ ఎదురొచ్చాడు.

"ఏమయింది సార్" అన్నాడు కంగారుగా డింగరీ.

"నువ్వు కుడిపక్కనించి ఓవర్‌టేక్ చెయ్యాలన్నావు. అలాగే చేద్దామని ఎక్స్‌ట్రీమ్ రైట్‌సైడ్‌నుంచి ఓవర్‌టేక్ చెయ్యాలనుకున్నాను. కాని ఆ కుడిపక్కనున్న గోతిలో పడిపోయాను'' అన్నాడు బాధగా జగన్నాథం.

దాంతో ఇలాగైంది'' అన్నాడు జగన్నాథం బాధగా మూల్గుతూ.

"సార్! అవి గేదెలుకదా సార్! వాటికి రోడ్‌రూల్సు తెలీవు. లెఫ్టేదో, రైటేదో వాటికేం తెలుస్తుంది చెప్పండి సార్! అందుకోసం రోడ్ ట్రావెల్‌లో పందుల విషయంలోనూ, రోడ్డు రూల్సు పాటించకుండా నడిచే మనుష్యుల విషయంలోనూ మినహాయింపు వుంటుంది. బండి బాగా దెబ్బతింది. దీన్ని నేను బాగుచేసి తీసికొస్తాను. మీరు డాక్టరు దగ్గరకెళ్ళి ఇంజెక్షన్ చేయించుకుని రండి సార్?" అంటూ మోపెడ్ తీసుకుని వర్కుషాపుకెళ్ళాడు, డింగరీ.

-రాంరఖి

# 'రక్కసిపొదలు' పై సమీక్షలు

డిసెంబరు 'చతుర'లో ప్రచురితమైన గోపరాజు నాగేశ్వరరావు రచన 'రక్కసిపొదలు'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## నేటిసమాజం

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

'రక్కసిపొదలు' నవల నేటి సమాజంలోని వ్యక్తుల మనస్తత్వాలకు చక్కటి ప్రతిబింబంగా నిలిచిందనటంలో అతిశయోక్తిలేదు. ఇందులో నాకు బాగా నచ్చిన పాత్ర మార్కండేయులు. తాను నమ్మిన సిద్ధాంతాలను తూ.చ. తప్పకుండా ఆచరించి చూపిన వ్యక్తిగా మార్కండేయులు పాత్రను రచయిత మలిచిన తీరు ప్రశంశనీయం. కానీ, "ప్రతిఫలం ఆశించకుండా నేను వృధాగా భగవంతుడికి కూడా కనీసం ఒక నమస్కారం కూడా చేయన"న్న మార్కండేయులు, తన చెల్లెలు కిరణ్మయిని చూస్తేనే వెన్నెల్ని చూసినంత ఆనందం పొందిన మార్కండేయులు, కిరణ్మయి ముళ్ళపొద లాంటి జీవితంలోకి కోరి ప్రవేశించినపుడు కూడా తన అభిప్రాయాలకు అనుగుణంగానే మొండిగా ప్రవర్తించిన తీరు ఆశ్చర్యకరమైనా హర్షించదగినదే!

క్షణికంలో తీసుకున్న నిర్ణయాలవల్ల బతుకును బుగ్గిపాలుచేసుకున్న కిరణ్మయి పాత్రంటే పాఠకులకు సానుభూతి కలగక మానదు. అలాగే పవిత్రమైన వృత్తిలో ఉండి మానవసహజమైన ఈర్ష్యాద్వేషాలకులోనై సొంత చెల్లిలిని చంపిన 'మిథిల' పాత్ర అసహ్యం పుట్టించేలా ఉంది.

"ఒక వ్యక్తి గుణగణాలను చూడాలంటే అతనికి అధికారమిచ్చి చూడాలి'' అన్న అబ్రహ్మాంలింకన్ మాటలకు సాక్షిగా పరాత్పరం మిగిలిపోతాడు. మార్కండేయులును చూడగానే తన పిల్లవాడి నొసటి కుంకుమను రహస్యంగా చెరిపిన కరివేపాకు పాత్ర నేటి సమాజంలోని అధికశాతం నాస్తికుల ద్వంద్వ మనస్తత్వాలకు దర్పణం పడుతుంది. భువనేశ్వరీదేవి, కాత్యాయనిలాంటి పాత్రలు మనం నిత్యజీవితంలో రోజూ చూస్తున్నవే.

-యన్. అరుణకాంతి,
ఇరగవరం- 534217.

## తిమిరసంహారం

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

'రక్కసిపొద' ల్లాంటి కులాలని చూపి భయపెడుతూ, కొందరు స్వార్థపరులు అట్టడుగు వర్గాల సాయంతో పురోభివృద్ధి సాధిస్తారనీ, ఆ తర్వాత వారినే తృణీకరిస్తారనీ, అమాయకుల కన్నీళ్లనీ, కష్టాలనీ వారి అడుగులకు, మడుగులుగా వాడుకొంటారనీ రచయిత ఈ నవలలో హెచ్చరించారు.

'పరాత్పరం'లాంటి దుర్మార్గులు ఏ కులంలోనైనా వుంటారు. కాబట్టి మనిషికి కావల్సింది వర్ణపోరాటమూ, వర్గపోరాటము కాదు చైతన్య స్ఫూర్తి కావాలి. దానివల్ల మనసులో అలిమిన చీకట్లూ, చుట్టూ సమాజంలో వుండే తిమిర సంహారం జరుగుతుందని రచయిత ఆశించారు.

తనకుతాను నిమ్నజాతిగ భావిస్తూ, అగ్రవర్ణాలంటూ కొందరిని హేళన చేస్తూ మాట్లాడిన పరాత్పరం, అవకాశం కుదరగానే తన వాళ్లని పావులుగా వాడుకొని "మినిష్టర్"



అవుతాడు. ఆదర్శ వివాహాల వెనకాల నీచత్వాన్ని, పరిస్థితుల ప్రాబల్యంతో 'కిరణ్మయి'లాంటి యువతులు 'డ్రగ్‌ఎడిక్ట్'లా మారటాన్ని రచయిత తీవ్రంగా నిరసించారు.

నాస్తిక, ఆస్తిక వాదాలకన్న మనిషిలోని 'కాపట్యమే' కడుదుర్భరమైందనే నవలలోని వాదోపవాదాలు పాఠకుల్ని బాగా ఆకట్టుకుంటాయి. 'మతం' కూడా 'స్వామిజీలు, స్వాములు ప్రయోగించే అస్త్రాలని, వ్యవస్థమార్పుకు 'వ్యక్తి' పునరుద్ధరణకు మతానికీ ఏం సంబంధంలేదనే అంశం నన్ను బాగా అలరించింది. "పరిశీలనా, పరిశోధనా లేకుండా దేనినీ గుడ్డిగా నమ్మకు'' అనే నవలోని అంతర్లీన సందేశం బావుంది.

నవల అడుగడుగున ఉత్కంఠకు గురిచేస్తూ చివరివరకు చదివించింది. మొత్తంమీద నవల "బాగానే వుంది'' కాని రచయిత నవలని ఆశాజనకంగా ముగిస్తే బావుండేది అనే అభిప్రాయం కలిగించేదిలా వుంది.

-కె. ప్రభాత్‌కుమార్,
తణుకు -534211.

## ఏం ప్రయోజనం

**(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)**

రక్కసి పొదలు నవల మొదలు పెట్టగానే చాలా చక్కగా వున్నది అన్న అభిప్రాయం కలిగిందిగానీ రానురాను సంఘటనలు, పాత్రలు, సందర్భాలూ చాలా అసహజంగా వున్నాయనిపించింది.

కిరణ్మయి, ఆ వయసులో ప్రేమలోపడడం సహజమే అయినా ఆ పాత్రను అంతలా దిగజార్చవలసిన అవసరంలేదు. ఆమె అంత పతనం చెందనక్కర్లేదనిపిస్తుంది. ఆమె సాంప్రదాయం, కట్టుబాట్లు గల కుటుంబంలో భయభక్తులతో పెరిగినది కాబట్టి మంచి చెడులను ఆలోచించగల జ్ఞానం వుంటుంది. అంత సులువుగా మోసపోయే అవకాశం లేదు. కిరణ్మయి, గోపీకృష్ణల కలయికను చాలా అసహజంగా చిత్రించడంలో రచయిత అభిప్రాయమేమిటో అర్థం కాలేదు.

ఈ నవలలో మార్కండేయులుది మంచి పాత్రేకాని అలాటి గొప్ప వ్యక్తి చేసిన మంచి ఏమిటి? ఒక వున్నత వంశంలో పుట్టిన ఏ ఆడపడుచయినా చాలా స్వల్ప విషయానికి భూతమాంత్రికులతో మంతనాలు జరపడం జరుగుతుందా? ఇక ఒక బాధ్యతాయుతుడయిన కుటుంబ పెద్దగా మార్కండేయులు చేసిన నిర్వాకం ఏపాటిది? లాంటి ప్రశ్నలు ఉదయించకమానవు.

ఏదయినా సంఘటన జరిగినప్పుడు సమయమూ, జరిగే ప్రదేశం తాలూకూ పవిత్రతా కూడా పరిగణనలోకి వస్తుంది. సంగీతం నేర్చుకునే పవిత్ర స్థలంలో, నటరాజస్వామి సన్నిధిలో అంత అసభ్యంగా ప్రవర్తించడం విద్యావంతుడయిన గోపీకృష్ణకు అత్యాచారమనిపించకపోవడం, మన సాంప్రదాయాన్ని, సెంటుమెంటునీ దెబ్బతీస్తుంది. మిథిల ఒక డాక్టరయి వుండి తన చెల్లెలును చంపడం కూడా అలాంటిదే. ఇంక పరాత్పరం, భార్య, మామగారు, వీళ్ళకు కథతో సంబంధంలేదు. నవల చాలావరకు ఎబ్బెట్టుగా వుంది. ఏ పాత్రమీదా సానుభూతిగాని, సదభిప్రాయంగాని కలుగలేదు.

రచయిత ఏ ప్రయోజనమాసించి ఈ నవల వ్రాశారో అర్థంకాలేదు. ఒక మంచి నవల చదివామన్న భావన రాలేదు.

-డి. కమలాదేవి,
విశాఖపట్నం-530 027

## విషపుపొదలు

**(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)**

శ్రీ గోపరాజు నాగేశ్వరరావుగారి నవల "రక్కసిపొదలు'' మౌలికంగా విభిన్న మనస్తత్వాల విశ్లేషణలా గోచరించినప్పటికీ, అంతర్లీనంగా నిత్య మానవజీవితానికి సంబంధించి ఇమిడివున్న అనేక సున్నిత

 

మైన అంశాల కలయిక.

మానవాళి ప్రగతికి బలమైన ప్రతిబంధకాలుగా నిలిచిన కుల, మత, వర్గ వైషమ్యాలు, సామాజిక అసమానతలు, మూఢవిశ్వాసాలు, ఆస్తిక, నాస్తిక వాదాలు, నేటి కలుషిత రాజకీయవ్యవస్థ... వగైరాలు రచయిత స్పృశించిన ముఖ్యమైన అంశాలుగా పేర్కొనవచ్చు.

"వర్క్ ఈజ్ వర్షిప్!" అన్నట్లు, అన్ని రుగ్మతలకూ మందు కర్తవ్యాన్ని గుర్తెరిగి బాధ్యతాయుతంగా ప్రవర్తించవలసిన అవసరాన్ని మార్కండేయులు పాత్రద్వారా చెప్పించడంలో రచయిత కృతకృత్యులయ్యారు. నిజానికి ప్రతివ్యక్తీ ఆదర్శంగా తీసుకోవలసిన పాత్ర ఇది. ఈ పాత్ర నవలకే వన్నె తెచ్చింది.

ముఖ్యంగా దేశప్రగతికి అవరోధంగా నిలిచిన కుల, మతబేధాల అడ్డుగోడలపై శ్రీ నాగేశ్వరరావుగారి కలం వేసిన గునపపు దెబ్బగా కూడా ఈ నవలను అభివర్ణించవచ్చు.

"ఛేంజ్ ఈజ్ ది లా ఆఫ్ నేచర్!" అనే భౌతిక సత్యాన్ని నిజంచేస్తూ నవలాంతానికి వచ్చేటప్పటికి ఆయా పాత్రలలో వచ్చిన మార్పు బాగుంది. విచక్షణారహితంగా ప్రవర్తించిన 'కిరణ్మయి' పాత్ర నేటి మహిళలను జాగృతం చేసేదిగా వుంది.

నవలలో ఇమిడివున్న అనేక అంశాలను అనుసంధానం చేసుకుంటూ 'రక్కసిపొదల' విషకోరల్లో చిక్కుకోకుండా కర్తవ్యంవైపు ముందడుగు వేయవలసిన అవసరం ఎంతైనా వున్నదన్న వాస్తవమే ఈ నవల ఓ 'సమగ్ర నవల'గా రూపొందటానికి కారణం!

-బి.వి. నరసింహారావు
నరసరావుపేట -522 601

## సజీవ పాత్రలు సమకాలీన పరిస్థితులు

**(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)**

గగనంలో విహరిస్తున్నా ఆత్మీయతల్ని అనుబంధాల్ని మాత్రం మనిషి దాటలేడు. ఆకాశ హర్మ్యాల్ని నిర్మిస్తున్నా ఆశలసౌధాల్ని మించలేడు. సాగరాన్ని ఈదగలిగినా సంసార బంధాన్ని దాటలేడు. సాటిమనిషిపై చూపాల్సిన జాలి, దయ, ఈర్ష్య అసూయగా మారినప్పుడు తనకుతాను పతనమౌతూనే స్వర్గపుటంచులను చేరినట్లు భ్రమ పొందుతాడు. నవ్యత్వానికి, నాస్తికత్వానికి, వితండవాదానికి, విజ్ఞాన శాస్త్రానికి మధ్య పెరుగుతున్న విలువలను, అంతరాల్ని, ఫలితాలను తన సులభరచన ద్వారా సజీవపాత్రలకి జీవం పోశారు రచయిత. అనుకోని సుఖాలెన్ని ఎదురైనా చివరకి పట్టుదలతో కూడిన వేదాంతభావానికి ప్రతీకగా మార్కండేయులు పాత్ర బాగుంది. "ప్రపంచమే ఒక మాయ. ఏమీలేదు శూన్యం తప్ప'' అంటూనే పీఠాధిపత్యాలు, పాదపూజలు అందుకుంటూ అనుబంధాల్ని జయించలేకపోయిన 'బ్రహ్మంజీ' ఒక యధార్థజీవి.

ఎంతో విజ్ఞానాన్ని సంపాదించినా కొద్ది బలహీనతతో ముళ్లపొదలకి చిక్కిన గాలిపటంలా రాలిన కిరణ్మయి పాత్ర అశ్రువులు రాలింపజేసింది. తన తోబుట్టువే అయినా తన సవతిగా వస్తుందన్న భ్రమలో ఆకులు రాలిన మొక్కను వ్రేళ్ళతో పీకి స్త్రీ స్వభావాల్ని ప్రతిబింబచేసింది మిథిల.

మతాన్ని, కులాన్ని ఆయుధంగా మలచుకొని ఉన్నత శిఖరాలను పొంది సమత అంటూనే స్వసుఖం పొంది నవలను నడిపింపజేసింది 'పరాత్పరం' పాత్ర.

తల్లి ఆప్యాయతల్ని ఆత్మవేదనని ఇంకాస్త మలిస్తే బాగుండేది. క్షుద్రశక్తులకు దాసోహం అయ్యే జీవులకు చక్కని గుణపాఠం ఈ నవల. చతుర ఇలాంటి మరిన్ని ఉత్తమ నవలల్ని అందించాలని కోరుతూ, రచయితకు ధన్యవాదములతో...

-ఆర్. శ్రీనివాసశర్మ,
హైదరాబాద్-37



చతుర

సంపుటి:20 సంచిక:1 ఫిబ్రవరి 1997



పేదకుటుంబంలో పుట్టిన పాపానికి చిన్నతనంలోనే పెద్దరికాన్ని సంతరించుకుని, కూలి పనుల్లో తల్లికి చేదోడు వాదోడుగా వుండేది ఆ అమ్మాయి.

ఆదరణలో తనకి, అన్నయ్యకి మధ్య పక్షపాతాన్ని చూపే తల్లి స్వభావాన్ని అంగీకరించేదికాదు. పెద్దలకు ఆమోదయోగ్యం కాని ఆమె స్వతంత్రభావాలు మొగ్గలోనే వాడి పన్నెండేళ్ల వయసులోనే ఓ వ్యక్తికి భార్యగా వెళ్లిందామె.

అయితే అక్కడ ఎదురయిందీ ముళ్లపాన్పే. తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడంకోసం అత్తతో, భర్తతో అనుక్షణం ఆమె చేసిన పోరాటం... చివరకి ఆమెకు ఏం మిగిల్చింది?

రెండు పదులకే ముగ్గురు బిడ్డల తల్లి అయిన ఆ అమ్మాయి ఏనాడూ స్కూలుకి వెళ్లకపోయినా జీవితంలో నేర్చుకున్న విలువైన పాఠాలు ఎలాంటివి?

ఆధునిక యుగంలో ఇంకా అక్కడక్కడ తలెత్తుతున్న బాల్య వివాహాలు, వాటి పరిణామాలు, పురుషాధిక్యపు ప్రతాపాలను అక్షరరూపంలో విశ్లేషించిన **మొలకలపల్లి కోటేశ్వరరావు** రచన **పేదపిల్ల** ఈ నెల చతుర సమగ్ర నవల.

# పేదపిల్ల

—మొలకలపల్లి కోటేశ్వర రావు

"దాగుడు మూతా దండాకోర్
పిల్లీవచ్చే ఎలుకా భద్రం
అడుక్కో... బుడుక్కో...
ఎక్కడి దొంగల్ అక్కడే
గప్ చుప్ సాంబార్ బుడ్డీ"

వసంతరుతువు వెన్నెల ఆహ్లాదకరంగా, మనోహరంగా వుంది.

ఆ వెన్నెల్లో దాదాపు పదిమంది పిల్లలు కలసి దాగుడుమూతల ఆట ఆడుకుంటున్నారు.

పిల్లలు నవ్వుతూ, తుళ్ళుతూ, కేరింతలు కొడుతూ, పెద్దగా అరుచుకుంటూ, ఆనందంగా పరిగెత్తిపోయి దాక్కుంటూ సరదాగా ఆటాడుకుంటున్నారు.

వెన్నెల్లో పిల్లలు ఆడుకునే ఆటల్లో వాళ్ళకి ఎంతో ఇష్టమైనది దాగుడు మూతల ఆట.

ఆ పిల్లలకి 7 నించీ 11 సంవత్సరాలవరకూ వయస్సువుంటుంది.

ఆట మంచి రసపట్టులో వుంది.

"సుశీలా... ఏమే సుశీలా... ఇంటికి రావే... తొందరగా రా... రెండు బుంగల నీళ్ళు తీసుకురావాలి!" అని సుశీల వాళ్ళ అమ్మ కేకేసింది.

ఆమె పేరు రాగమ్మ. ఆమె ఇంట్లో పని చేసుకుంటూ ఆటలకి వెళ్ళిన కూతుర్ని చాలా సేపట్నించీ పిలుస్తోంది.

ఉత్సాహంగా ఆడుకుంటూ ఆటలో పూర్తిగా నిమగ్నమైపోయిన సుశీల తల్లి మాటల్ని వినిపించుకోలేదు.

ఆ అమ్మాయికి తొమ్మిదేళ్ళు.

రాగమ్మకి కూతుర్ని పిలిచీ పిలిచీ విసుగు పుట్టింది. ఎంత సేపట్నించీ పిలుస్తున్నా వెళ్ళకపోయె!

పొయ్యి దగ్గర కూర్చుని అన్నం వండుకుంటున్న ఆమె, అక్కడే వున్న కట్టెపుల్ల తీసుకుని లేచి ఆట దగ్గరకి వెళ్ళింది.

"సుశీలా... ఏమేయ్ సుశాయ్... ముండా... నిన్ను కదంటే పిలిచేదీ? ఎంత సేపు పిలవాలే నిన్నూ? పిలిచిన తరవాత వచ్చే పని లేదంటే? వళ్ళు బలిసి కొట్టుకుంటున్నావేమేయ్!" అని ఆమె కోపంగా సుశీల దగ్గరకి వచ్చింది.

ఆమె ఆగ్రహంగా రావడంతో సుశీల చిక్కకుండా తప్పించుకుని పరిగెత్తింది. ఆమె ఆ కట్టెపుల్ల తీసుకుని వెంటపడింది.

"చిక్కకుండా తప్పించుకుని ఎంతదూరం లగెత్తుతా... పో... ఎంత దూరం లగెత్తుతావో చూస్తా..." ఆమె పరిగెత్తిపోయి సుశీల జుట్టుపట్టుకుంది.

"మనిషి మాట అంటే లెక్కాజమా వుందంటే నీకు? ఎప్పుడైనా పిలిచిన తరువాత వస్తావా, రావా?" అని ఆమె సుశీలని వంగతీసి, వీపుమీద చేతిలోని కట్టెపుల్లతో రెండు దెబ్బలు వేసింది.

"తన్నవాకమ్మా... కొట్టవాకమ్మా... ఈసారి నువ్వు పిలిచినప్పుడే వస్తానమ్మా... కొట్టొద్దమ్మా..." అని పెద్దగా అరచింది సుశీల అదరగొట్టుకుంటూ.

"ఇంటో నీటిచుక్కలేదు. ఇంతమట్టుకి ఒక్కరు నీళ్ళుపోసుకోలా! మీ అయ్యా చేనికాడ్నించి వచ్చి నీళ్ళులేకపోతే ఇంత ఎత్తున లేస్తాడు. బోరింగ్ దగ్గరకి పోయి రెండు బుంగలు నీళ్ళు కొట్టుకొచ్చి పోస్తే ఏం చస్తా?"

"అన్నాయ్ నీళ్ళు తీసుకొచ్చి పోస్తే చస్తాడేంది? రోజూ నేనే నీళ్ళు తీసుకురావాలెట్టా? వాడు తీసుకురాకూడదేంది? అన్ని పనులూ నేనొక్కదాన్నే చేయాలెట్టా?"

"ఏం చేస్తున్నావే నువ్వు?"

"అన్నాయ్ ఏం చేస్తున్నాడేంది?"

"వాడు మగోడు. వాడితో నీకు వంతేంది.




మక్కెలిరక్కొడతా ఇంకెప్పుడైనా వాడితో వంతు పెట్టుకున్నావంటే? మాట మాట్టా డితే వాణ్ణి వంతుకు తీసుకొస్తావెందుకే నువ్వు? నోర్మూసుకుని పోయి చిన్న బుంగతో నాలుగు బుంగలు నీళ్ళు తీసు కొచ్చి గాబులో పొయ్యి" అంది రాగమ్మ.

సుశీల ఏడుస్తూ బుంగ తీసుకుని బోరింగ్ దగ్గరకి వెళ్ళింది నీళ్ళు తీసుకురావ డానికి.

పక్కన తోటి పిల్లలు సంతోషంగా ఆటా డుకుంటున్నారు. సుశీల ధ్యాస అంతా ఆట మీదనే వుంది.

బోరింగ్ దగ్గర జనం ఎవరూ లేరు. ఎప్పుడూ గుంపులు గుంపులు వుండే జనం ఆ సమయంలో లేకపోవడంతో సుశీల తొందరతొందరగా నీళ్ళు కొట్టి, ఆరు బుంగల నీళ్ళు తెచ్చి తొట్టిలో పోసింది.

పిల్లలు ఇంకా ఆటాడుకుంటూనే వున్నారు. సుశీల మళ్ళీ ఆట దగ్గరకి వెళ్ళింది.

రాగమ్మకి ఇంట్లో చేయాల్సిన పని చాలా వుంది. వీలైనంత ఎక్కువ పని చేసుకుని, వేకువజామునే మళ్ళీ కూలికి మిరపకాయల కోతకి వెళ్ళాలి.

మూడు మైళ్ళ దూరంలో వున్న ఆ మిర పకాయల చేనికి తెల్లవారేసరికి వెళ్ళి పనిలో వంగాలి. పొద్దుపొడిస్తే పొలం ఆసామి పనిలోనికి రానివ్వడు.

ఆ ఆసామి మహా కర్కోటకుడు. ఆరోజు ఉదయం ముగ్గురు కూలీలు పొద్దుపొడిచి బారెడెక్కిన వేళకి చేలోకి వచ్చారు. ఆ ఆసామి ఆ ముగ్గుర్నీ పనికి వద్దని నిర్దాక్షి ణ్యంగా వెనక్కి తిప్పి ఇంటికి పంపించాడు.

ఊళ్ళో ఆయన ఒక్కడే మూడు ఎకరాలు మిరపతోట వేసాడు. ఇతర రైతులు ఎవరూ ఆ పంట వేయలేదు.

ఆడ కూలీలకి బొత్తిగా పనులు లేని రోజులు. మిరపకాయల కోత ఒక్కటే పని. కూలీలు కూడా పనికోసం వెంపర్లాడటంతో ఆ ఆసామికి ఎదురు లేకుండాపోయింది.

ఆయన ఇష్టం! తక్కువ కూలి ఇస్తాడు, ఎక్కువ పని చేయించుకుంటాడు. ఎదురు లేకపోవటంతో ఆయన ఆడింది ఆటా, పాడింది పాటగా వుంది.

చుక్కపొడవకముందే లేచి, ఇంట్లో పని చేసుకుని, పిల్లల్ని సముదాయించుకుని, కేరి యర్‌లో అన్నం పెట్టుకుని వెళ్ళాలి.

రాత్రిపూటే దాదాపు అన్ని పనులూ చేసు కుంటే, వేకువజామున తేలికగా వుంటుం దనే ఉద్దేశంతో రాగమ్మ పనులు చేసుకుం టోంది.

సుశీల ఇలా ఆటలో వెళ్ళి కలిసిందో, లేదో వెంటనే మళ్ళీ తల్లి పిలుపు.

"సుశా... మళ్ళీ ఆటలకి పోయి చచ్చా! ఎప్పుడూ ఆటల రంధేనంటే నీకూ! తొంద రగా ఇంటికొచ్చి చావు!"

తొట్టికి నీళ్ళు తీసుకొచ్చిపోయడంతోనే తన పని అయిపోయిందనే వుద్దేశంతో సుశీల తల్లి మాటల్ని ఆలకించకుండా ఆటలో లీనమైపోయింది.

"ఈసారి కానీ నేను వచ్చానంటే నిన్ను పీక పిసికి చంపి అవతల పారేస్తా, పీడా వదిలిపోయిద్ది! దొంగముండా... ఇంటో బోలెడు పని వుంది. మళ్ళీ ఆటలకి పోయి చస్తే ఈ పని అంతా నీ మొగుడు ఎవుడు వచ్చి చేస్తాడనుకున్నావే? " అని ఆమె పొయ్యిదగ్గర కూర్చుని వంట చేసుకుం టూనే కూతుర్ని తిడుతూ పిలుస్తోంది.

సుశీల రాకపోవడంతో ఆమె లేచి మళ్ళీ ఆటదగ్గరకి వచ్చింది.

"ఏమ్మా... మీకేం పనీ పాటలూ లేవా? పొద్దున నిద్దర లేచిందగ్గర్నించీ, సందకాడ పడుకునేదాకా ఎప్పుడూ ఆటలేనా? పొండే

అమ్మలారా... ఇంటికి పోయి పనులు చేసుకోండే... పనుల్లేకపోతే కూడు తిని పడుకొండే!" అని ఆటాడుకుంటున్న ఇతర పిల్లలమీద కోపమూ, విసుగూ వెళ్ళగక్కి కూతురివైపు తిరిగి అంది. "నువ్వు చావ్వే ఇంటికి ముండా... నిన్ను పిలిచీ పిలిచీ నా దుంప తెగిపోతోంది. సందు దొరికితే ఆటలకి పరిగెత్తుకుని రావడమే! ఎప్పుడూ ఆటలమీద ధ్యాసేనంటే!" తిడుతూ కూతుర్ని ఇంటికి తరిమి అనుసరించింది రాగమ్మ.

"పొయ్యిదగ్గర కూర్చుని మంట పెట్టు, నాకు పనుంది కానీ..."

"ఏం పనేందీ?"

"కూరలోకి తిరగమాతకి నూనెలేదు. రంగిశెట్టి కొట్టుకిపోయి రెండు రూపాయలకి నూనె పోయించుకుని వస్తా! అటు నించి ఆదెయ్యగారింటికి కూడా పోయి రావాలి. మీ అయ్యకి రావాల్సిన కూలి డబ్బులకోసం పది రోజుల్నించీ తిప్పించుకుంటన్నాడు మారాజు! పోయి అడిగొస్తా... నువ్వు మళ్ళీ ఆటలకి పొయ్యేవు! పొయ్యి ఆరిపోయి కూడునవపాయ పడిద్ది!"

"సరే కానీ... అమామామా... నాకు పావలా ఇయ్యవే, సీట్లులు తెచ్చుకుంటానే" బతిమలాడుతూ అడిగింది సుశీల.

తల్లి కొట్టుకి వెళ్తుండటంతో ఆ అమ్మాయికి డబ్బు గుర్తొచ్చింది.

"పావలా లేదూ, గీవలా లేదు కానీ నోర్మూసుకుని పొయ్యికింద మంట పెట్టు. ఆ పొయ్యి ఆరిపోతంది!"

"అ మామామా... మా... మ్మా... పావలా... ఇయ్యవే..." గారంగా, ఒక్కొక్క మాటే ముద్దుముద్దుగా వత్తి పలుకుతూ అడిగింది.

"ఎహెపో" అని రాగమ్మ కసిరి, నూనెసీసాకోసం బయట నించి ఇంట్లోకి వెళ్ళింది.

"అమామామా... అంతే లేమ్మా... మొన్న ఇల్లూ, గోడలూ అలుక్కోవడానికి పేడ తీసుకొస్తే, ఉన్నప్పుడు పావలా ఇస్తానని చెప్పలా నువ్వు? పావలా ఇయ్యవే... సీట్లులు తెచ్చుకుంటానే!"

"నోటిమీద వాత పెడతా మాటిమాటికీ డబ్బులు అడిగావంటే!" కోపంగా అంది రాగమ్మ.

"ఎందుకు వాతపెడతావేంది, పావలా ఇయ్యమంటే! అన్నాయ్‌కి పొద్దున నువ్వు రూపాయి ఇయ్యలా?"

"నేను ఎప్పుడు ఇచ్చానే?"

"నాకేం అబద్ధాలు చెప్పవాకు? నువ్వు చేలోకి పోయిన తరువాత వాడు రూపాయ పెట్టి యేరుశనగ ముద్ద తెచ్చుకుని తినలా? నాకు తెలియదనుకోవాకు. నువ్వు ఇయ్యకపోతే అన్నాయ్‌కి ఎక్కడ్నించి వస్తయ్యేంది డబ్బులు?"

"ఏమో... ఎక్కడినించి వచ్చినయ్యో నాకేం తెలుసు?"

"నువ్వు డబ్బులు ఇచ్చి... నాకు తెలియకుండా ఎక్కడనించి వస్తయ్యంట! అన్నీ అబద్ధాలు! ఇంటో పనులు నేను చేయాలీ, డబ్బులు మాత్రం వాడికియ్యాలీ"

"ఏమేయ్... ఎదురు తిరిగి మాట్టాట్టం నేర్చుకున్నావూ? కదిలాడితే వాడ్ని వంతుకి తీసుకొస్తావెందుకు నువ్వు?"

"లేకపోతే ఏందీ? రోజూ వాడి ఒక్కడికే కొనిపెట్టాలెట్టా? వాడు ఎక్కువేందీ, నేను తక్కువేందీ? వాడు పుట్టినట్టు నేను పుట్టలేదెట్టా?"

"సరేలే నోర్ముయ్! మాటలు అయితే నేర్చావు. నా దగ్గిర చిల్లరలేదు కానీ, కొట్టుకి పోయి వచ్చి ఇస్తాలే! అన్నాయ్ వస్తే వాడికి నీళ్ళతోడి అన్నం పెట్టు" అని రాగమ్మ కొట్టుకి వెళ్ళిపోయింది.



రాగమ్మా, నాసరయ్యా భార్యాభర్తలు.





వాళ్ళకి నలుగురు పిల్లలు.

అందరికంటే పెద్ద నాగమణి. ఆ అమ్మా యికి పెళ్ళయి రెండు సంవత్సరాలైంది. పదకొండు సంవత్సరాల వయస్సులోనే పెళ్ళి చేసి, ఆ అమ్మాయిని అత్తవారింటికి పంపించారు.

తరువాత కొడుకు నాగార్జున. అతనికి 11 సంవత్సరాలు. హైస్కూల్‌లో ఆరవ తరగతి చదువుతున్నాడు.

నాగార్జున తరువాత సుశీల. తొమ్మిదేళ్ళు. అందరికంటే చిన్న గంగమ్మ, ఐదో ఏడు.

నాసరయ్య వాళ్ళకి ఒక ఎకరం మెట్ట పొలం వుంది. ఆ పొలంలో పంట అంతంత మాత్రంగానే వస్తుంది.

భార్యాభర్తలు ఇద్దరూ కూలిపనికి పోతుంటారు.

కొడుకుని ఆవూళ్ళో వున్న హైస్కూల్ చదువువరకూ చదివించాలనేది ఆ తల్లిదండ్రులకోరిక. అయితే చదువులో వాడు మహామొద్దు. ఆరో తరగతి చదువుతున్నాడంటే, చదువుతున్నాడనే కానీ వాడికి ఆరు అక్షరాలు రావు.

ఆ వూళ్ళో వున్న దిక్కుమాలిన ప్రభుత్వ పాఠశాలలో చదువుకుని, ఎలాగోలా వాడు ఆరో తరగతి గడప ఎక్కాడు.

సుశీల మాత్రం స్వతహాగా తెలివికలిగిన అమ్మాయి, మహా చురుకైనది' కూడా!

ఐదోఏటనే పగిలిపోయిన పలక ఒకటి తీసుకుని అన్నవెంట బడికి వెళ్ళేది. ఆడుతూ పాడుతూనే అక్షరాలు మొత్తం అతి తొందరగా నేర్చుకుంది.

వాళ్ళు చదువుకునే ఆ దిక్కుమాలిన స్కూల్లోనే నిర్మల అనే టీచరు వుంది. ఆవిడ చాలా మంచి మనిషి.

ఆవిడ ఆ వుద్యోగంలో చేరి అప్పటికి రెండు సంవత్సరాలే అయింది. పసిపిల్లలకి లాలనగా, ప్రేమగా అక్షరాలు నేర్పేది.

వాళ్ళకి చిన్నచిన్న కథలూ, పాటలూ కూడా నేర్పేది.

అక్షరాలు పలకలమీద రాయించకుండా, ముందుగా పిల్లలు అక్షరాలు మొత్తం గుర్తించేటట్లు చేసిందామె.

అక్షరాలు గుర్తింపు వచ్చిన తరువాతనే నేర్పేవిధానాన్ని అవలంబించేది.

ఆమె కృషివలనే చాలామంది పిల్లలకి త్వరగా అక్షరాలు రాయడం, చదవడం సులభంగా వచ్చేసింది.

సుశీలకి కూడా ఆ నిర్మల టీచరే అక్షరాలు నేర్పింది.

సుశీల చురుకుదనం, చొరవ, తెలివితేటలకి ఆవిడ ఎంతో ఆశ్చర్యపోయేది.

పిల్లలు గొడవ చేయకుండా ఉత్సాహంగా, సంతోషంగా బడికి రావడానికి ఆమె చాలా విధాలుగా ప్రయత్నించింది.

అయితే సుశీల చదువు ఎంతోకాలం సాగలేదు. ఏడోఏడు వచ్చిందో, లేదో చిట్టి చెల్లెలి పెంపకం సుశీల నెత్తిమీద పడింది.

అమ్మ కూలికో, తమ పొలంలో పనికో పోతే గంగమ్మని ఎత్తుకుని ఆడిస్తూ ఆ అమ్మాయి సంరక్షణ చేయాల్సి వచ్చింది.

అప్పటికీ చదువుమీద కోరికని చంపుకోలేని సుశీల పసి హృదయం ఒకరోజు తల్లిని అడిగింది.

"అమ్మా అమ్మా... నేను కూడా అన్నాయ్‌తో పాటు బడికి పోయి చదువుకుంటానే!"

రోటి దగ్గర ఏదో పనిచేసుకుంటున్న రాగమ్మకి ఆ మాటలు వింతగా, విచిత్రంగా అనిపించాయి. కూతురి వైపు ఆశ్చర్యంగా చూసింది.

"ఏందే... ఏందీ నువ్వు అనేది? "

"నేను కూడా బడికి పోతానే!"

"ఏయ్యో... నీకూతురు ఏందో అంటంది

విను" అంది రాగమ్మ అక్కడే వున్న భర్తతో ఆశ్చర్యంగా.

"ఏమంటందేంది? "

"బడికిపోయి చదువుకునిద్దంట! వాడితో పాటు బడికి పోతానంటంది!"

"ఏమ్మా... బడికిపోయి చదువుకుంటా... పిచ్చిముండ చదువుకుని ఏం ఉజ్జోగాలు చేస్తావా;. వూళ్ళు ఏలతావా? ఏం చేస్తా చదువుకుని? " అన్నాడు ఆయన.

ఇంతలో ఆయనని ఎవరో పిలిస్తే బయటకి వెళ్ళిపోయాడు.

చదువుకుని ఏం చేయాలో సుశీల సున్నిత మనస్సుకి తెలియలేదు. అయినా తల్లిని మళ్ళీ అడిగింది, "బడికి పోతానే" అంటూ.

"ఎందుకమ్మా నీకు చదువు? చదువుకుని ఏం చేస్తా? నువ్వు చదువుకోవటానికి బడికి పోతావనుకో, బుజ్జిని ఎవురు సాకుతారు చెప్పు? "

"అమ్మా..."

"అది కాదు బుల్లాయ్... పని మానుకుని బుజ్జి ఎదురుగా నేను కూకుంటే కూడు ఎట్ట వచ్చిద్ది? పనిలేకుండా నేను ఇంటి దగ్గర వున్నప్పుడు ఎప్పుడన్నాపోయి నాలుగచ్చర మ్ముక్కలు నేర్చుకుందువులే!" అంది ఆమె.

ఆమె ఇంటి దగ్గర వున్నదీ లేదు, ఉన్నా సుశీల బడికి పోయిందీ లేదు.

అలా సుశీల చదువు ఈ దేశంలో వున్న లక్షలాది ఆడపిల్లల చదువులకి మల్లే అర్ధంతరంగా కాదు, ఆరంభంలోనే ఆగిపోయింది.

సుశీల బడికిరాకపోవడంతో ముందుగా పిల్లల్ని పంపించిన నిర్మల టీచర్, సుశీల శాశ్వతంగా బడి మానుకుందని తెలిసి, ఒక రోజు స్వయంగా వచ్చి రాగమ్మని అడిగింది.

"ఏమమ్మా... సుశీలని బడికి పంపించడం లేదేం? పాపని బడికి పంపించండి!"

"పిల్లని బడికి పంపిస్తే మాకు ఎట్ట జరుగిద్ది పంతులమ్మా? ఇంట్లో ఇంకో పసిముండ వుంది. మేం పనికిపోతే ఆ పసిముండ దగ్గర ఎవురు వుంటారు? మా పిల్లకి రావడం కుదరదులే పంతులమ్మా బడికి? "

"పాప మంచి చురుకు కలిగినది! చెప్పిన విషయాన్ని ఇట్టే గ్రహించేస్తుంది! మీరు కానీ ఆ అమ్మాయిని బడికి పంపిస్తే చదువులో బాగా రాణిస్తుంది. మంచి భవిష్యత్ వుంటుంది!"

"మాకు కుదరదులే పంతులమ్మా! మగపిల్లోడు ఒకడు వున్నాడు. వాడి ఒక్కడిమట్టుకి అయినా చదువుకుంటే చాల్లే! అందర్నీ చదివించాలంటే మాకు ఎట్ట వల్లయిద్ది? " అంది రాగమ్మ.

"అది కాదండీ..." అని నిర్మల టీచర్ వదల్లేదు.

"సరే, రేపట్నుండీ వచ్చిద్దిలే బడికి!" అని రాగమ్మ ఆ టీచర్ బారినించి అప్పటికి తప్పించుకుంది.

సుశీల అక్క నాగమణికి కూడా చదువు లేదు.

ఆ ఆడపిల్లల్ని కనీసం ఆవూరి ప్రాథమిక పాఠశాల చదువుల వరకైనా చదివిద్దామనే స్పృహా, కాంక్షా, ఇష్టమూ ఆ తల్లిదండ్రులకి లేదు.

రాగమ్మకి, నాసరయ్యకీ కూడా చదువులు లేవు మరి.

★ ★ ★

"ఇదుగో సుశాయ్... ఇది చూడు, బ్యాటు. ఐదు రూపాయలిచ్చి కంసాలి బత్తుడు సుబ్బాచారితో చేయించా!" అంటూ బ్యాటులాంటి ఆకారం కలిగిన ఒక కట్టె





తీసుకుని నాగార్జున వచ్చాడు.

అప్పటివరకూ అతను ఆటలాడి వచ్చాడు.

"ఐదు రూపాయలా? అమ్మో... నీకెక్క డివి అన్నాయ్ అన్ని డబ్బులూ? ఎవురి చ్చారు? "

"ఎవురిస్తే నీకెందుకు? బ్యాటు బాగుందా, లేదా చూసి చెప్పు!" అంటూ అతను బ్యాటు చెల్లెలి చేతికి ఇచ్చాడు.

సుశీల బ్యాటుని చూసి అటు తిప్పీ, ఇటు తిప్పీ అంది. "ఇది ఐదు రూపాయలా? ఎందుకన్నాయ్, శుద్ధదండగ! కట్టె పుల్లలకి పోయినప్పుడు, ఏ చెట్టుకొమ్మో కొట్టి, గొడ్డ లితో ఇంతకంటే బాగా నేను చెక్కలేనెట్టా? "

"ఏందీ నువ్వు బ్యాటు చెక్కుతా? "

"ఏమీ, ఎందుకు చెక్కకూడదేంది? "

"ఇంత బాగా? ఇట్ట వుండిద్దా నువ్వు చేసేది? "

"ఇంకా బెమ్మాండంగా వుండిద్ది! అసలు ఇందులో ఆయన చేసిందేంవుంది? మొదులూ, చివరా తెగకొట్టి, కొద్దిగా చెక్కట మేగా? "

"సుశాయ్.... సుశాయ్... రేపు నాకు ఒక బ్యాటు చెక్కుకుని రావే!"

"సరే, అట్నే బ్యాటు చేసి పెడతాలే! సరే కానీ అన్నాయ్, నీకు డబ్బులు ఎవురు ఇచ్చారో చెప్పవా? "

"ఎవురు ఇస్తే నీకెందుకు, నేను చెప్పను!"

"అట్టయితే నేను చేసిపెట్టను"

"సుశాయ్ సుశాయ్ చేసిపెట్టవే! ఇంకొకటి దాచిపెట్టు కుంటానే!"

"మరి నీకు డబ్బులు ఎవురు ఇచ్చారో చెప్పు, చేసి పెడతా!"

"చెపుతాను కానీ, మళ్ళీ నువ్వు ఏడవకూ డదు"

"ఏడవనులే, చెప్పు"

"నిన్నటి రేత్రి అమ్మ మూడు రూపాయ లిచ్చింది. ఇయ్యాల పొద్దున అయ్య మూడు రూపాయలు ఇచ్చాడు"

"ఎందుకు ఇచ్చారు నీకు డబ్బులు? "

"ఎందుకు ఇస్తారేంది? కొనుక్కోవడాని కంటే ఇచ్చారూ!"

"నాకు తెలుసులే! పుస్తకాలు కొనుక్కోవ డానికని అబద్దాలు చెప్పి డబ్బు తీసుకుని బేటు చేయించుకుంటా! అమ్మని రానియ్యి చెప్పకపోతే!"

"చెప్పుకో, చెప్పుదెబ్బలు తినుకో! అబద్ధం చెప్పాల్సినంత కర్మ నాకేం పట్టింది? బ్యాటు చేయించుకోవడానికే డబ్బులు ఇవ్వ మన్నా! వాళ్ళు ఇచ్చారు!"

"నిజంగానంట అన్నాయ్, బేటు చేయిం చుకోవడానికి నీకు ఐదు రూపాయలి చ్చారా? " ఆశ్చర్యంగా, బాధతో ప్రశ్నిం చింది సుశీల.

"ఐదు రూపాయలు కాదు, ఆర్రూపా యలు. అమ్మ మూడు, అయ్య మూడు! ఐదు రూపాయలకి బ్యాటూ, రూపాయికి వేరుశనగముద్దా!" వూరిస్తూ బడాయిగా అన్నాడు నాగార్జున.

తను మూడు రోజుల్నించీ పావలా అడు గుతోంది. ఒక్క పావలా ఇవ్వలేదు తనకి?

అదీ వూరికే కాదు, ఒకపూట అంతా పొలాలవెంటా, గొడ్ల వెంటా తిరిగి ఇల్లూ, ఇంటిగోడలూ అలుక్కోవడానికి పేడ తీసు కొస్తే ఇస్తానన్నవి.

తనకి ఇవ్వడానికి పావలా లేదుకానీ, అన్నాయ్‌కి ఇవ్వడానికి మాత్రం ఆరు రూపాయలు వున్నాయి!

తల్లిదండ్రులు తన విషయంలో చూపి స్తున్న వివక్షకీ, అశ్రద్ధకీ, అసమానత్వానికీ,

సంకుచిత్వానికీ సుశీలకి ఏడుపు వచ్చింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. సుశీల సున్నిత మనసు కలతచెందింది.

"ఇప్పుడిదాకా వీరాంజనేయగాడూ, నర్సిగాడూ, నేనూ మేం చాలా మందిమి శివుడి గుడి దగ్గిర క్రికెట్ ఆట ఆడుకుని వచ్చాం. రేపు బడిలేదుగా మళ్ళీ రేప్పొద్దున్నే పోయి ఆడుకోవాలి. బ్యాటు దాచిపెట్టుకుంటా. నాకు నీళ్ళు తోడు సుశాయ్!"

"ఆ పొయ్యిమీదనించి నీళ్ళు తోట్టం నాకు చేతకాదు. నువ్వే తోడుకొని పోసుకో!" అమ్మమీద కలిగిన కోపంతో అంది సుశీల.

"ఇటుచూడు, ఇదిగో బ్యాటు. ఇది తీసుకుని కొట్టేనంటే తలకాయ రెండుముక్కలైద్ది! లేచి మరియాదగా నీళ్ళు తోడు"

"నీళ్ళు తోడకపోతే ఏం చేస్తావేందిరా నువ్వు? కొట్టు, ఎంతమాత్రం కొడతావో చూస్తా! బేటు తీసుకుని కొడతాడంటనే! నీళ్ళు నువ్వు తోడుకోలేవెట్టా? "

"లేచి ముందు నీళ్ళు తోడు" నాగార్జున వచ్చి సుశీల జుట్టు పట్టుకున్నాడు. సుశీల అతని మీద తిరగబడింది.

ఇద్దరూ కొట్టుకుంటున్న సమయంలోనే కొట్టుకి వెళ్ళిన వాళ్ళ అమ్మ వచ్చింది.

"అన్నాయ్ చూడమ్మా, నీళ్ళు తోడలేదని ఎట్ట కొడతన్నాడో!" అని తల్లికి ఫిర్యాదు చేసింది సుశీల.

"ఇది చూడవే, నీళ్ళు తోడమంటే తోడలా! పైపెచ్చు తోడుకోమని ఎదురుతిరిగి వాగుతుందే!" అని నాగార్జున కూడా తల్లికి చెప్పాడు.

"మగపిల్లోడు నీళ్ళుతోడుకుంటాడూ? ఏమేయ్ సుశాయ్, మదంపట్టి కొట్టుకుంటున్నావో... నీళ్ళు తోడిపెట్టడానికి ఏం మాయరోగం? నిమషం ఇంటో లేకపోతే చాలు, తిట్టుకోటం, కొట్టుకోటమే!"

"కొట్టుకి పోయి వచ్చి పావలా ఇస్తానంటివేమ్మా!"

"ఇస్తాలేవే గుంటా! ముందు వాడికి నీళ్ళు తోడు. నేను వచ్చి బొక్కెన తీసకపోయి దొడ్డి దగ్గర పెడతాలే!"

"అన్నాయ్‌కి బేటు కొనుక్కోమని ఆర్రూపాయలిచ్చారూ నువ్వూ, అయ్యా? "

"మేం ఎప్పుడు ఇచ్చామే? ఎవురు చెప్పారు? "

"అన్నాయ్ చెప్పలా? ; వాడికి మాత్రం రూపాయలు రూపాయలు ఇయ్యాలీ, మాకు మాత్రం పావలా వుండదు ఇయ్యడానికి? "

"నీకూ ఇస్తాలేవే! వాడు నెలరోజుల్నించీ బేటో, ఏదో కొనుక్కుంటానని ఒకటే జాతర చేస్తన్నాడు! వాడి జాతర తట్టుకోలేక ఇచ్చాలే!"

సుశీల ఏడుస్తూ, మూలుగుతూ వుంటే రాగమ్మ కొంగున ముడివేసుకున్న పావలా బిళ్ళ తీసి ఇచ్చింది. ఆ డబ్బు తీసుకుని ఆ అమ్మాయి ఏడుపు ఆపేసి పరిగెత్తుకునిపోయింది.

రాగమ్మలేచి నీళ్లతోడి దొడ్డి దగ్గరపెట్టింది. నాగార్జున స్నానం చేసి వచ్చేసరికి ఆమె కొట్టు దగ్గర కొనుక్కు వచ్చిన కొబ్బరి ముక్కా, బెల్లం ముక్కా కొడుక్కి పెట్టింది.

"నీకు డబ్బులు ఇచ్చామని దానికి ఎందుకు చెప్పావురా, అసలే అది కుళ్లబోతుది అయితే... నీనోట్లో మాత్రం మాట దాగదు. ఆ కొబ్బరీ, బెల్లం అది చూడకుండా తిను. అది వచ్చి చూసిందంటే మళ్లీ యాపక తినిద్ది. ఆ చుప్పనాతి దాని దెబ్బ తట్టుకోలేకపోతున్నా!" అంది రాగమ్మ.

ఇంటి బయట ఆడుకుంటున్న చిన్న కూతురు గంగమ్మ లోపలకి వచ్చింది. ఆ అమ్మాయికి సరిగా మాటలురావు.

నాగార్జున తినడం చూసి "అన్నాయ్... నాకూ.. నాకూ" అంటూ అతను పెట్టకపో

వడంతో కొద్దిదూరంలో వున్న అమ్మ దగ్గరకి వెళ్లి అడిగింది.

"అమ్మా... నాకూ... • నాకూ... తినేయ్యి..."

"నేలమీద బోర్లాపడి నాకు" వెకిలిగా నవ్వుతూ అన్నాడు నాగార్జున చెల్లెల్ని.

"ఏం మాటలురా పసిముండని పట్టుకుని! దానికీ కొద్దిగా పెట్టరా. పాపం, నోరువిప్పి అడుగుతోంది!"

"ఆ పెడతా, నువ్వు పది రూపాయలకి మరింత తెచ్చిపెట్టావనీ! ఏమ్మా... తెచ్చేదానివి ఇంకాస్త ఎక్కువ తెస్తే అరిగిపోతా? "

"రెండు రూపాయలకి శెట్టి ఆ కొంచెం పెట్టాడు. ఇంకెన్ని రూపాయలకి తెమ్మంటావేందిరా? "

"అమ్మా... నాకూ... నాకూ... అమ్మా..."

"ఈ బుజ్జి ముండకి కొద్దిగా పెట్టయ్యా! పసిది. పొద్దున నేను కూలికిపోతా ఎక్కడ పడేస్తే సందకాడ నేను వచ్చిందాకా అక్కడే పడి వుండిద్ది! సుశాయ్ దీన్ని సరిగా సాకుతుందంటనా? కొందరు పిల్లలు అయితే పొద్దున వాళ్ల అమ్మ కూలికిపోయినప్పుడు మొదలుపెట్టిన ఏడుపు సందకాడ తిరిగి ఇంటికి వచ్చిందాకా ఏడుస్తూనే వుంటారు. మన బుజ్జి ఎంత మైనంగా వుండిద్దో! అమ్మ కావాలని ఒక్కసారి కూడా ఏడవదు! పాపం, దానికీ తిందామనిపించదూ? కొద్దిగా పెట్రా!"

"ఇదుగో, ఇటుచావు!" అని నాగార్జున తను తినే దాంట్లో నలుసంత బెల్లపు ముక్క కొరికి ఆ అమ్మాయికి ఇచ్చాడు.

గంగమ్మ అది తీసుకుని తింటూ బయటకు వెళ్లిపోయింది.

దగ్గరలోనే వున్న బంకు దగ్గరకి వెళ్లి సీటులు అని పిల్లలు పిలుచుకునే చక్కెరగోలీల్ని కొనుక్కుని తింటూ ఇంట్లోకి వచ్చింది సుశీల.

లోపల దృశ్యాన్ని చూసి ఖిన్నురాలైపోయింది.

నాగార్జున కొబ్బరీ, బెల్లం కలిపి మెక్కుతున్నాడు. సుశీల రావడంతోనే టక్కున తినే వాటిని కనపడకుండా దాచిపెట్టాడు. అయితే అప్పటికే సుశీల విషయాన్ని గ్రహించేసింది. తింటున్నాడని గమనించినా ఏం తింటున్నాడో తెలియలేదు.

"అన్నాయ్ ఏందో తింటున్నాడు. నువ్వు కొట్టుకి పోయినప్పుడు కొనుక్కొచ్చి పెట్టావు కదూ! ఏందో చెప్పు, ఏందీ తినేది వాడూ? "

"వాడేం తింటన్నాడే? "

"ఏందో తింటన్నాడులే! నన్ను చూసి దాచిపెట్టాడు. అదిగో, గుప్పిట్లో ఏందో వుందిలే!"

చేతిలో వున్న కొబ్బరీ, బెల్లాన్ని నాగార్జున కూర్చున్నవాడు మోకాలి క్రింద పెట్టుకుని ఖాళీ చేతులు వూపుతూ అన్నాడు, "నా దగ్గిరేం వుందీ, నేనేం తింటున్నానూ? "

"అదిగో, కాలికింద పెట్టావులే! నేను చూశాలే! నువ్వు లేలే" అని దగ్గరకి వచ్చి నాగార్జునని లేపింది.

నాగార్జున అవి కనపడకుండా చేయాలని ప్రయత్నించాడు కానీ, సుశీల వాటిని చూడనే చూసింది.

"అమ్మో.. కొబ్బరీబెల్లం తింటన్నాడు. నాగ్గూడా పెట్టు, నేను కూడా తింటా!"

"ఇప్పుడు నీకు పావలా ఇయ్యాలా, వాణ్ణి తిననియ్యవే!"

"అన్నాయ్ పొద్దున రూపాయపెట్టి వేరుశనగ ముద్ద తెచ్చుకోలా? నాకు కొబ్బరీ బెల్లం కావాలి!"

శెట్టి దగ్గర చిల్లర లేకపోయేసరికి, ఆ ఇయ్యాల్సిన చిల్లరకి కొద్దిగా పెట్టాడు.



ఎంతుంది వాడి దగ్గర నీకు పెట్టడానికి? "

"అదిగో చేతిలో, నాకు పెట్టాల్సిందే!" అని నాగార్జున చేతిలోనిది లాక్కోవడానికి ప్రయత్నించింది సుశీల.

నాగార్జున చిక్కనివ్వకుండా చేత్తో గట్టిగా పట్టుకుని సుశీల వీపుమీద రెండు పిడిగుద్దులు గుద్దాడు. సుశీల అతని మీద కలయబడింది.

చివరకు సుశీల అతని చేతిలోని బెల్లం ముక్క లాక్కుని బయటకు పరిగెత్తింది.

"అది చూడవే, తినేది తినేది లాక్కుని ఎట్ట పరిగెత్తిపోయిందో! ఇంటోకిరా! నిన్ను ఇయ్యాల చంపి పారేసి వాగులో తొక్కిరాక పోతే నా పేరు నాగార్జునే కాదు. ఇంటికి రా నీ పని చెపుతా!" అన్నాడు నాగార్జున కోపంతో.

"ఓ ఇప్పుడే వస్తా ఇంటికి. ఏం చేస్తావురా నువ్వు? " సవాల్ చేసినట్లుగా అంది సుశీల.

"నువ్వు బాగా మదంపట్టి కొట్టుకుంటున్నావే! తన్నులు పడితేనే నువ్వు మాటవింటావు" అంది రాగమ్మ.

"నీకు పడొద్దా తన్నులూ? ఏమ్మా కొబ్బరీ బెల్లం తెచ్చిందానివి ముగ్గురికీ మూడింతలు పెడితే ఎం అరిగిపోతావా, కరిగిపోతావా? కుళ్లబోతుదానా... అందరూ మనుషులు , కారూ? వాడొక్కడేనా మనిషీ? ఇంక ఎవురికీ తినకూడదూ, వాడొక్కడే తినాలీ!"

"అట్నేవాగు. ఇయ్యాల నీకు నా చేతిలో మూడినయ్యిలే!"

"మూడతయ్యి మూడతయ్యి, మళ్లీ నీక్కూడా మూడతయ్యి!" ఎదురు తిరిగింది సుశీల.

"నువ్వు అక్కడ నిలబడి మాట్టాడవే, ఎవురికి మూడతయ్యో చూద్దాం!" రాగమ్మ సుశీలని పట్టుకోవడానికి నాలుగు అడుగులు వేసింది.

సుశీల తల్లికి చిక్కకుండా పోవడానికి పది అడుగులు వెనక్కి పరిగెత్తింది.

"పరిగెత్తిపోతావేమే దొంగముండా!" అని రాగమ్మ ఇంట్లోకి వెళ్లి పనిలో పడింది.

నాసరయ్య కూలికివెళ్లి పొలం నించి వూళ్లోకివచ్చాడు. అయితే ఇంటికి రాకుండా దారిలోవున్న టీ బంకుల వద్ద ఆగి వూళ్లో రాజకీయాలూ, కబుర్లూ తెలుసుకున్నాడు. అప్పటికే పొద్దుపోయింది.

అక్కడనించి వస్తూండగా, తమ ఇంటికి కొద్ది దూరంలో సుశీల ఒక్కతే ఒక అరుగు మీద కూర్చుని వుండటం చూశాడు. ఇంటికి వెళ్తే దెబ్బలు పడతాయనే వుద్దేశంతో సుశీల ఆ అరుగుమీద మకాం పెట్టింది.

"సుశాయ్, ఏందే ఇక్కడ కూచున్నావు? " వస్తూ కూతుర్ని చూసిన నాసరయ్య పిలిచాడు.

సుశీల నుంచి మౌనమే జవాబు.

"పొద్దుపోలేదెట్టా? అలిగావా ఏందీ? ఏం మాయరోగం అలగడానికి, తిన్నది అరగలా? లే... లేచి పద ఇంటికి"

"అమ్మ కొడతందయ్యా!"

"ఎందుకు కొడతంది నిన్ను వూరకనే? ఏందో చేసి వుంటావు! పా ఇంటికి పా"

అని కూతుర్ని తీసుకుని ఇంటికి వెళ్లాడు నాసరయ్య.

"సుశాయ్ అలిగి అక్కడెక్కడో అరుగు మీద కూచొని వుంటే తీసుకొచ్చా! ఎందుకు అలిగింది? " ఇంటికి వచ్చిన నాసరయ్య భార్య రాగమ్మని అడిగాడు.

"దానికి పనా పాటా? ఎద్దు తిన్నట్టు తినిద్ది! వాడికి ఒక తుంపు బెల్లం, కొబ్బరీ పెట్టానని వాడిమీద కలబడి, వాడు తినేయ్యి లాక్కుని పోయింది. ఇంటికి వస్తే





తంతానని అక్కడకి చచ్చింది గామాలి! కానిచ్చి నీళ్లు పోసుకుని చావు, కూడు తిందువు!" సుశీలతో అంది రాగమ్మ.

"నాకు తోడు ముందు నీళ్లు. నాకు పొద్దు పోతంది. అల్లవాళ్లింటికి పోయి రావాలి" అన్నాడు నాసరయ్య.

రాగమ్మ నీళ్లతోడి దొడ్డివద్ద పెట్టింది.

నాసరయ్య స్నానం చేసి అన్నానికి వచ్చాడు. నాగార్జున కూడా అప్పుడే తిండికి కూర్చున్నాడు.

ఒకవైపు గంగమ్మ కుక్కి మంచం మీద పడుకుని నిద్రపోతూ వుంది.

"నేను కూడా బువ్వ తింటానమ్మా!" అంది సుశీల.

"తిందువులేవే గుంటా! తిండికి మగోళ్లు కూచున్నప్పుడే కూచోవాలి నువ్వు కూడా! ఏం జబ్బా, ఇందాక తినకూడదూ, ఎవుడు వద్దన్నాడు? వాళ్లు తిన్న తరువాత తిందు వులే!"

అన్నంవద్ద కూడా వివక్షా, పక్షపాతం వుంటుందని సుశీలకి తెలుసు. వాళ్లకి వేరేగా కూరగాక మజ్జిగో, పెరుగో వుంటుంది. పెరుగుఅంటే గోరంత వేసు కుని, అందులో నీళ్లు కలుపుకుని తింటారు. వాళ్లతోపాటు తింటానికి కూర్చుంటేనే తనకి అవి కొద్దిగా అయినా దక్కుతాయి. వాళ్లు తిన్న తరువాత తను కూర్చుంటే పచ్చడో, కారమో తన ముఖాన. కనీసం మజ్జిగ తాగడానికి కూడా తను నోచుకోలేదు! పున్నీళ్లే.

పున్నీళ్లు అంటే అంతకుముందు రోజు వార్చిన గంజిలో చాలా నీళ్లు కలిపి, పులియ పెట్టి ఉప్పు వేసుకుని అన్నంలో కలుపుకుని తింటారు. అదే వీళ్లకి మజ్జిగ అన్నం.

రాగమ్మ ప్రతీరోజూ పున్నీళ్లు చేస్తుంది. సుశీలకి ఎప్పుడూ ఆ నీళ్లే!

వాళ్లతోపాటు అన్నం తినడానికి సిద్ధమై కూర్చుంది సుశీల.

"నాగ్గూడా ఆకలవతందమ్మా, నేను కూడా తింటా!" బతిమలాడినట్లుగా అంది సుశీల.

"నువ్వు నీళ్లు పోసుకున్నావంటే? ముందు పోయి నీళ్లు పోసుకో! నువ్వు నీళ్లు పోసుకుని వచ్చేసరికి పళ్లెంలో కూడు వేస్తా!"

"కూడు తిన్న తరువాతే నీళ్లు పోసు కుంటా, నాగ్గూడా కూడెయ్యి!"

"చెప్పేది నీక్కాదంటే, ముందు నీళ్లు పోసుకో!"

"తిండి తిన్న తరువాతనే నీళ్లు" స్థిరంగా అని సుశీల వచ్చి తండ్రిపక్కనే నేలమీద చతికిలపడింది.

ఇంట్లో రెండు పీటలు వున్నాయి. అవి తండ్రీ, అన్నా వేసుకున్నారు. ఎప్పుడూ వాళ్లే పీటలు వేసుకుంటారు. రాగమ్మ అయితే కంచంలో అన్నం పెట్టుకుని బయటకు తెచ్చుకుని కుక్కి మంచం మీద కూర్చుని తింటుంది. మిగతా వాళ్లు నేలమీదనే కూర్చుని తింటారు.

"నీళ్లు పోసుకోకపోతే పోసుకోకపో య్యావు, కాళ్లూ చేతులూ కడుక్కున్నా వంటే? ఎక్కడెక్కడో తిరిగి కాళ్లూ చేతులూ కూడా కడుక్కోకుండా మగరాయుడి మాది రిగా వచ్చి కూర్చోవడమే! పో పొయ్యి కాళ్లూ చేతులు కడుక్కుని రా!" అని రాగమ్మ చేతి లోని ఖాళీ కంచంతో సుశీల నెత్తిమీద ఒక్క టేసింది.

సుశీల మూలుగుతూ బయటకు వెళ్లి కాళ్లూ చేతులూ కడుక్కుని వచ్చింది.

"మహా పందెగత్తెమ్మా ఇది! నీ అంత పందెం మగవాళ్లకి వుంటే కాపరాలు నిలబ డవే!" అంది రాగమ్మ ముగ్గురి కంచాల్లో భోజనం వడ్డిస్తూ, తనమాటని ధిక్కరించి తిండికి కూర్చున్నదనే అసంతృప్తితో.



"సరేలే, కానిచ్చి తొందరగా పెట్టవే!" అని నాసరయ్య భార్యని విసుక్కున్నాడు.

ఆమె భర్త విసుగుదలని ఏమాత్రం పట్టించుకోలేదు. భర్త విసుక్కుంటూ, చిరాకు పడుతూ మాట్లాడటం సహజం. అది వాళ్లహక్కు అయినట్లు అందరి స్త్రీల మాదిరిగానే ఆమె కూడా అలవాటు పడిపోయింది.

"కూరగాయల ధరలు మండిపోతున్నాయి. కిలో కూరగాయలు కొంటేకానీ ఇంటెల్లపాదికీ సరిపోవు! అందుకని, రెండు కోడిగుడ్లు కొనుక్కొచ్చి మగవాళ్ల మట్టుకి వేపా!" అంది రాగమ్మ కంచాల్లో కోడిగుడ్డు కూరని వడ్డిస్తూ... మగవాళ్లకి మాత్రమే ఆ కూర ప్రత్యేకం అయినట్లూ, ఆడవాళ్లు ఏది తిన్నా ఫర్వాలేదన్నట్లుగా.

"అమ్మా! అన్నాయ్‌కి అంత కూరా? నా పళ్లెంలో ఏదమ్మా కూర? నాగ్గూడా ఇంకాస్త కూరవెయ్యి!" అంది సుశీల.

పాపం ఆ అమ్మాయి ఆ కూరకోసమే ప్రత్యేకంగా మగవాళ్లతోపాటు భోజనానికి కూర్చున్నది.

"రెండు కోడిగుడ్లు ఎంత కూర అయిద్దే! మన మట్టుకి గోంగూర పచ్చడి వుందిలే. ఈ రెండు ముక్కలతోపాటు గోంగూర పచ్చడి వేసుకుని తిను"

"గోంగూర పచ్చడి నాకేం వద్దు. నిన్న పొద్దుట్నించీ అదే పచ్చడి? నాగ్గూడా ఇంకాస్త కోడిగుడ్డు కూర వెయ్యి. కొద్దిగా చాల్లే!"

"చెప్పేది నీక్కాదంటే! లేదే తల్లీ. వుంటే వెయ్యనూ? నీకు పెట్టకుండా నేను తింటానా? "

"అట్టయితే పెరుగు వేస్తావా? కూర లేకపోతే లేకపోయిందిలే! ఇందాక సుబ్బమ్మ దగ్గిర గిద్ద పెరుగు పోయించుకుని రాలా! అందులోకొద్దిగా వెయ్యి నాకు!"

"ఏమేయ్, కొవ్వెక్కి కొట్టుకుంటన్నావో! గిద్ద పెరుగు అది. అందులో నీకు వేస్తే మీ అన్నా, అయ్యా ఏం తింటారు? పెరుగు వాళ్లకోసమా తెచ్చింది, నీ కోసమా? "

కూతురూ, భార్యా సంవాదం వింటూ నాసరయ్యా మౌనంగా వున్నాడు. తండ్రీ కొడుకులు ఇద్దరూ తిండి లాగించే కార్యక్రమానికి వుపక్రమించారు.

"ఏమ్మా! వాళ్లేనా మనుషులూ? అన్నీ వాళ్లే తినాలెట్టా? వీళ్లు తినే పనిలేదేంది? అన్నీ వాళ్లే తింటే వీళ్లేం తినాలని? "

"ఏందే మళ్లీ కుయ్.. మగోళ్లకీ, నీకూ పోటీనా? నువ్వు బాగా మదంపట్టి కొట్టుకుంటున్నావే! నీ మదం అణిగితేకానీ నువ్వు పద్ధతి మార్చుకోవూ, మాట వినవూ! అప్పుడప్పుడూ నీకు పడతంటేనే మాట వింటావే!"

అని రాగమ్మ కోపంగా వచ్చి సుశీలని వంగతీసి వీపుమీద పెడీపెడీమని కొట్టింది. చెంపలకి పెట్టి కొట్టింది. ఆమె బాగా అలసిపోయే వరకూ కొట్టింది.

సుశీల అన్నం తినకుండా, పెద్దగా ఏడుస్తూ వచ్చి బయట మంచంమీద పడుకుంది.

కొద్దిసేపటికి నాసరయ్యా అన్నం తిని వచ్చి బయటవున్న మరో మంచం మీద కూర్చున్నాడు. రాగమ్మ ఇంట్లో పనిచేసుకుని, స్నానం చేసింది.

"ఎక్కడికో పోయి రావాలంటివి కదయ్యా? " అంది.

"రేపొద్దున పోయొస్తాలే. పొద్దుపోయిందీ పైగా నాకు సొలిపోయింది. ఆ ముండ పడుకుని నిద్రపోయిందట్టుగా వుంది. దాన్ని లేపి కూడుపెట్టు. పాపం, పొద్దున ఎప్పుడు తిందో ఏమో!"

"దాన్ని పాపం తలవకూడదు. మాడాల్లే ఒక పూట. ఒక పూట మాడిస్తే కానీ అది దారికి రాదు. దాన్ని అయ్యా అమ్మా అని




బతిమలాడితే మాట వినదు. తంతంటేనే అది దారికి వచ్చిద్ది"

"దాని తప్పేం వుందే? పిల్లలు ఎక్కివ స్తిరి. తినే ఈడాయె! కనీసం మజ్జిగ నీళ్లు కూడా లేకుండా ఎంతకాలమని పున్నీళ్లతో తింటారు? పాడివుంటే బాగుండిద్దనిపిస్తందే నాకు!"

"కొనూ బర్రెని! కొంటే బాగానే వుండిద్ది. కోడలు బిడ్డని కంటానంటే అత్త వద్దనిద్దీ? నువ్వు బర్రెని కొంటే పిల్లలు కడుపునిండా కూడు అన్నా తింటారు, పాడి పుణ్యమాని!"

"నరసిమ్మగారి నారాయణ మొన్న కందులు అమ్మేడంట! నాల్రోజుల్లో మనకి ఇయ్యాల్సిన డబ్బులు ఇస్తానన్నాడే. వడ్డీ తోటి దాదాపు ఐదువేలు ఇవ్వాల్సి వచ్చిద్ది!"

"ఆయన మన దగ్గర వడ్డీకి డబ్బు తీసుకుని యాడాదిన్నరకాలా! అప్పుడే వెయ్యి రూపాయలు అయిద్దీ వడ్డీ? "

"ఎందుకు కాదు? వడ్డీతోటి వడిగల గుర్రం కూడా పరిగెత్తలేదంట! నారాయణ ఇచ్చే డబ్బు పెట్టి వక్కిదో, బక్కదో ఒక బర్రెని కొందామే! పాడి అమ్ముకోకపోయినా, ఆ బర్రె ఇంటి అవసరం తీరిస్తే చాలు!"

"అంతేనయ్యా, బర్రెని కొనుక్కోవడమే మంచిది! రోజూ రెండు రూపాయలు పెట్టి పెరుగు పోయించుకున్నా అవి ఎవురి ముక్కులోకీ రాకపోతందే! ఆ పోసే పెరుగు కూడా వుత్తనీళ్లే! బర్రె వుంటే ఇంటి అక్కర పోంగా రోజుకి పాతికా, ముప్పయ్ రూపాయలకి కూడా అమ్ముకోవచ్చు"

"సుశాయ్ పొగులు బర్రెని వాగుల్లోనో, బీళ్లలోనో ఎక్కడోచోట తిప్పి మేపుకుని వస్తే, సందకాడికి నేను పనికి · పోయిన దగ్గర ఒక పన మేత తీసుకొస్తా! అసలు మేతదేం వుందిలో ఈ రోజుల్లో!"

"అంతే రోజూ పొద్దున్నే నేను పోయి ఒక గంపగడ్డి కోసుకొని వస్తా! బర్రెని కొందాం. దానిమీద నాల్రూపాయలు వస్తే ఏన్నీళ్లకి చన్నీళ్ల మాదిరిగా ఇంట్లో పైకర్చులు ఎల్లబారిపోతయ్యి!" అంది రాగమ్మ.

★ ★ ★

"సుశీలా.. చింత తోపులోకి పోయి కాయలు తెచ్చుకుని పప్పన్నాల ఆట ఆడుకుందామంటివే! తొందరగా కానిచ్చిరా! నీదే ఆలిస్సెం, అందరం వచ్చాం!" అంటూ ఐదారుగురు పిల్లలు బిలబిలమంటూ వచ్చారు సుశీల కోసం.

బయట తొట్టి ధగ్గర కూర్చుని సుశీల అంట్లు కడుగుతోంది. "వస్తానుండండే! ఈ నాలుగు బొచ్చెలు కడిగి, లోపల పడేసి వస్తా!" అని పరపరా ఆగిన్నెలు కడిగి, నీళ్లలో ముంచింది.

వచ్చిన పిల్లలు మాటల్లో పడ్డారు.

"రాంచిలకలు వుండినే ఒకచెట్టు తొర్రలో, ఆ చెట్టు తెగ కాసిందే కాయలు" అంది ఒక అమ్మాయి.

"నిజమేనే! చెట్టు ఎక్కకుండా కింద వుండి కొమ్మలాక్కున్నా తిగ్గోసుకోవచ్చు కాయలు" అంది ఇంకోమ్మాయి.

"ఇయ్యాల చాలాకాయలు కోసుకుందామే! కడుపునిండా తిందామె!" అంది మరో అమ్మాయి.

"కోసుకుందాం కానీ కాపలోడు ఏమన్నా అంటాడేమోకదే!"

"ఏమంటాడేంది? మనమేమన్నా మణుగులు మణుగులు కాయలు కోసుకుంటామా ఏంది? నాలుగు చింతకాయల చిండకి ఏమంటాడు? "

"ఇంక చింతకాయలు కాలేదే! అన్నీ వామన కాయలే!"

"అబ్బ... వామనకాయల్లో కారం ఏసుకుని నంజుకుని తింటంటే.. నాసామి రంగా... బలే గుండిద్దే! నాకు ఇప్పుడే నోట్లో



నీళ్లూరుతన్నాయి"

"ఎప్పుడెప్పుడు పోదాం అనిపిస్తందే! తొందరగా పోదాం కానియ్యబ్బా!"

"నువ్వు ఇంతకీ కారం తీసుకొచ్చావంటే?"

"ఎందుకు తీసకరాలేదు? ఇదుగో సాంబారుకారం" ఆ అమ్మాయి భద్రంగా దాచిపెట్టుకున్న పొట్లం తీసి చూపించింది.

"మరి నువ్వేం తెచ్చా?"

"నేను బియ్యం తెచ్చా"

"నేను కందిపప్పు తెచ్చా"

"నేను యేరుశనగ పప్పు తెచ్చా"

అని ఆ పిల్లలు ఆటకి తాము తెచ్చిన తినుబండారాలు చూపెట్టారు.

"మరి నువ్వేం తెస్తావబ్బా?" వాళ్లలో ఒక అమ్మాయి సుశీలని అడిగింది.

"మా ఇంటో ఏముంటయ్యబ్బా తీసకరానికి? బియ్యం ఒక్కటే మా ఇంటో వుండేది. అయ్యి కూడా మా అమ్మ పెట్టో పెట్టుకుని తాళం వేసుకుని పొలం పోయిద్ది! ఇంక నేనేం తీసకొచ్చేది?"

"నిజమేనబ్బా! సుశీల తీసకరాకపోతే ఏం పొయ్యింది? మనమందరం తీసుకరాలా, అయ్యి చాలవేంది? నువ్వు కానిచ్చి రాబ్బా, తోపులోకి పోయి కాయలు తెచ్చుకుని ఆడుకుందాం!" అంది ఒక అమ్మాయి.

సుశీల కడిగిన పాత్రలు తీసుకుపోయి ఇంట్లో పెట్టింది. లోపల రాగమ్మ ఏదో పని చేసుకుంటూ సుశీలతో అంది.

"సావాసగత్తెలు వచ్చేరట్టుగా వుందిగా! వాళ్లతో కలిసి వూరిమీదపడి తిరుగు గాచెద్దుమాదిరిగా! పొయ్యి కాడపుల్లలేదు. వాగులమ్మటికి పోయి నువ్వు సందకాడికి పుల్లలు ఏరుకుని వస్తేనే రేత్రికి కూడు వండేది. నువ్వు ఎప్పుడైనా పోయి పుల్లలు తీసుకురా! సందకాడ నేను ఇంటికి వచ్చేసరికి పొయ్యి కాడ పుల్లలు లేకపోయినయ్యంటే నిన్ను యిరగతీసి పొయ్యిలో పెడతా!"

"తెస్తాలేమ్మా! నీకెప్పుడూ పుల్లలూ, నీళ్లూ ఆ రంధేగా! నేనొక్కదాన్నే పోయి పుల్లలు ఏరుకుని రావాలి" అని సుశీల బయటకు వచ్చింది, అక్కడ నిలబడి వుంటే ఇంకా ఏదైనా పని చెపుతుందేమోనని.

పిల్లలు అందరూ కలిసి చింతతోపుకి వెళ్లారు. వూరికి చాలా దగ్గిరే ఆ తోపు.

సుశీల మంచి స్నేహపాత్రురాలు. సుశీల కోసం ఎప్పుడూ ఐదారుగురు పిల్లలు వస్తుంటారు. ఆ పిల్లలంతా సుశీలని బాగా అభిమానిస్తారు.

అంతా క్రిందవుంటే సుశీల ఒక్కతే చెట్టు ఎక్కి కాయలు కోసింది.

"చాలా కాయలు అయినయబ్బా, ఇంక చెట్టుదిగు! మా వడులు నిండిపోయినయ్యి. మనకి ఆటకి సరిపోతయ్యి, మళ్లీ కాపలోడు వస్తాడు!"

"వస్తే ఏం చేస్తాడేంది?" అంది సుశీల.

అసలు వాడు రాడులే. ఎప్పుడో ఒకసారి వచ్చి అట్టచూసి ఇట్టపోతాడు!" అంది ఇంకో అమ్మాయి.

"వాడు వచ్చినా మనం చిక్కుతామంటలే! వాడు ఆ మూల వుండి కేకేసేసరికి మనం ఈ మూలనించి ఇంటికి పోయి పడతాం!"

"పిల్లకాయలు తినేకాయలకి ఏమంటాడులే?"

"అమ్మో.. వాడు అసలు మంచోడు కాదబ్బో! మొన్న మగపిల్లకాయలు కోసుకుంటంటే, వాళ్లని పట్టుకుని తెగ తిట్టేడంట!"

"వాడుత్త ఎర్రోడు! ఒక్కోసారి కాయలు కోసుకోటానికి వచ్చిన పిల్లల్తోటి ఎకసెక్కాలాడతాడు! ఒక్కోసారి బండబూతులు కూస్తాడు. వాడితోటి ఎందుకు? వాడు ఒకసారి వున్నట్టు ఒకసారి వుండడు!" అంది మరో అమ్మాయి.

సుశీల చెట్టు దిగింది.




"నీడగా బాగుందబ్బా ఇక్కడ! కొద్దిసేపు ఇక్కడ్నే ఆడుకుని పోదాం!"

"ఇళ్ల దగ్గిరకంటే ఇక్కడే బాగుంది. కొద్ది సేపు ఇక్కడే ఆడుకుందాం" అంది మరో అమ్మాయి కూడా.

అక్కడే కూర్చుని కొద్దిసేపు కబుర్లు చెప్పు కున్నారు. కొద్దిసేపు ఆ చెట్ల మీదనే ఎగు రుతూ, దుముకుతూ ఆడుకున్నారు.

"ఇంటికి పోయి పెళ్లిళ్ల ఆట ఆడుకుందా మబ్బా!" అంది ఒక అమ్మాయి.

"పెళ్లిళ్ల ఆటే మర్చిపోయాం. తొందరగా ఇంటికి పోయి బొమ్మలకి పెళ్లి చేసి పప్పన్నాలు తిందాం!" అంది ఇంకో అమ్మాయి.

అందరూ ఇంటికి వెళ్లారు.

సుశీల వాళ్ల ఇంటి పక్కన ఒక పాత ఇల్లు వుంది. ఆ ఇంటిలో కూర్చుని, వాళ్లు తెచ్చుకున్న తినుబండారాలతో బొమ్మలు పెట్టి ఆడుకుంటున్నారు.

నాగార్జున వచ్చాడు.

"నేను కూడా వస్తా మీ ఆటకి"

"నువ్వొద్దు పోయ్యే.. మేం పిల్లలం ఆడు కుంటంటే నువ్వెందుకు? "

"నన్నుగానీ ఆటకి రానిచ్చుకోకపోతే మిమ్మల్ని ఆడనియ్యను"

"నువ్వెవరివి ఏందీ మమ్మల్ని ఆడనియ్య కుండా వుండడానికి? నీదేందంట? "

"అంతే... నన్ను ఆటలోనికి రానిస్తేనే మిమ్మల్ని ఆడుకోనిస్తా!" అని నాగార్జున అక్కడవున్న బొమ్మలు చేత్తోపట్టుకున్నాడు.

"చూడబ్బా మీ అన్నాయ్, బొమ్మలు తీసు కుంటన్నాడు"

"నాగార్జునా.. మరియాదగావుండదు. మా బొమ్మలు అక్కడ పెట్టి నువ్వుపో! అయ్యి నా బొమ్మలు, తీసుకోటానికి నువ్వె వరివి? " అంది పెద్దమ్మాయి అనే అమ్మాయి. ఆ అమ్మాయి చిన్న అమ్మాయే అయినా అందరూ పెద్దమ్మాయి అనే పిలుస్తుంటారు.

"నీ బొమ్మలేం కాదు" అన్నాడు నాగార్జున.

"నా బొమ్మలు కాక ఎవురియ్యేంది? "

"నీ బొమ్మలని వీటి మీద పేరు చూపెట్టు! ఇయ్యి నాకు ఇక్కడ చిక్కినయ్యి"

"చిక్కుతయ్యి! మేం ఇక్కడపెట్టి ఆడుకుం టంటేనంటా చిక్కినయ్యంటనే! ఇయ్యా మా బొమ్మలూ... "

"ఇయ్యరా మా బొమ్మలూ..." అంది సుశీల.

"ఇయ్యనూ... ఇయ్యనూ... ఇయ్యనూ..."

"ఇయ్యకపోయ్యావంటే పోయి మా అమ్మకి చెపతా!" పెద్దమ్మాయి అంది.

"మీ అమ్మకి కాకపోతే మీ జేజమ్మకి చెప్పుకో! నాకేం భయం? "

"ఏం భయం వుండదు! నిజ్జంగా పోయి చెప్పానంటే.."

"నిజంగానే చెప్పుకో! ఏం చేసిద్దేంది మీ అమ్మ? "

"ఏం చేసిద్దా? నీ వీపు చింతకాయ పచ్చడి చేసిద్ది!"

"మళ్లీ చేస్తా మామిడికాయపచ్చడి!"

ఆ అమ్మాయి ఏడుస్తూ ఇంటికి వెళ్లడానికి బయల్దేరి" నాగీనాగీ నక్కేరు కాయి... నీ ముక్కు తొక్కేరు కాయ!" అంది.

"పెద్దమ్మాయి పెద్దమ్మాయి పెంట మ్మాయి... నీ వళ్ళంతా పెంటమ్మాయి"

"నన్ను పెంటమ్మాయి అంటావంట్రా నువ్వు? " అని అక్కడ చిన్నరాయి వుంటే అది తీసుకుని నాగార్జున మీదకు విసిరివే సింది.

ఆ రాయి నాగార్జున ముక్కుమీద తగిలింది.

నాగార్జున కూడా తన పక్కన రాయి వుంటే అది తీసుకుని ఆ అమ్మాయిపైకి విసిరాడు. అది కొద్దిగా పెద్దరాయి. ఆ రాయి పోయి ఆ అమ్మాయి తలమీద తగిలింది. బాగా స్పీడుగా వెళ్ళి బలంగానే తగిలింది.

అంతే. ఆ అమ్మాయి తలమీదనించి జలజలా రక్తం కారడం మొదలుపెట్టింది.

తెల్లటి గౌను వేసుకుంది. ఆ గౌను తడిసిపోయింది.

ఆ అమ్మాయి పెద్దగా ఏడుస్తూ ఇంటికి వెళ్ళింది.

ఇంటి దగ్గర ఆ అమ్మాయి నాన్న వున్నాడు. ఆయన కూతురి వంటిమీద రక్తం చూసి గాభరా పడ్డాడు.

ఆయన పేరు శేషు. ఆయనని అందరూ కొసవెర్రివాడు అంటారు. తగాదాలకీ, తన్నులాటలకీ ముందుంటాడు. ఎప్పుడూ భయంకరమైన బూతులు కూస్తుంటాడు. పెద్దపెద్దగా మాట్లాడుతుంటాడు. ఆయనకి సిగ్గనేది ఎలాంటిదో తెలియదు.

ఆయనకి కూతురి వంటిమీద రక్తం చూసి కోపం వచ్చింది.

"ఏమైందమ్మాయి? ఎవురు కొట్టారు?"

"ఓమ్మో... ఏందే అంత నెత్తురు? ఏనాబట్ట కొట్టేడు నిన్ను? వాడి చేతికి జిట్టయిలేవా! వాడి చేతులు ఇరిగిపోనూ! వాడి దినం చెయ్యా!" అని ఆ అమ్మాయి అమ్మ కూడా తిట్లకు లేచింది.

"మరే... నాగార్జున గోడు తనని ఆటలోనికి రానియ్యలేదని రాయేశాడు నానా!" అంది ఆ అమ్మాయి పెద్దగా ఏడుస్తూ.

"నాగార్జునగాడంటే ఎవుడు?" శేషు అడిగాడు.

"వాడయ్యా... నాసరయ్య కొడుకు. పందిమొహమోడు! వాడికేం పనా? పాటా? చదువూ చట్టుబండలూ ఏం లేవు!"

"వాడా? ఎంత రాయి వేశాడు, అంత లావున నెత్తురు కారిపోతంది! వాడు మనిషా, దున్నపోతా..." అంటూ ఆయన ఇంక బూతుల పురాణానికి లేచాడు.

"వూరక నువ్వీడ తిడితే ఏం లాభం? పోయి అడిగిరా రాయి ఎందుకేశాడో, ఏందో?"

"అడిగిరాకుండా ఎందుకుంటానే? ముందు నెత్తురు రాకుండా కట్టు కట్టు. వాడి యవారం ఏందో కనుక్కుని వస్తా!" అని ఆయన నెత్తురు తుడిచి కోపంగా వెళ్ళాడు.

"వాళ్ళమ్మ తగాదాకి వచ్చుద్దన్నాయి. నువ్వు పోయి దాక్కో! మేం లేడని చెపతాం! లేకపోతే ఎక్కడికన్నా పో" అని నాగార్జునని బ్రతిమిలాడింది సుశీల.

"ఎందుకొచ్చిద్దేంది తగాదాకి? ముందు నాకు రాయేసింది, తరవాత నేను వేశాను!"

"అయితే మాల్లే ఎక్కడికన్నాపో!" అంది సుశీల.

"ఆమెని చూస్తే ఇక్కడ ఎవురికన్నా బయం పుడతందేంది," అన్నాడు నాగార్జున.

అంతలోనే శేషు వచ్చాడు. అప్పటివరకూ ధైర్యంగా వున్న నాగార్జున ఆయనని చూసి భయపడ్డాడు.

"రేయ్... మా అమ్మాయికి రాయి ఎందుకేశావురా?" అన్నాడు ఆయన వస్తూనే.

"ముందు మీ అమ్మాయే నాకు రాయేసిందయ్యా?"

"మా అమ్మాయి నీకు వూరకనే ఎందుకు రాయేసింది?"

"ఎందుకేసిందో మీ అమ్మాయినే అడుగు!"

"నీయమ్మ... నీకు వూరకనే రాయెందుకే





సిందిరా? ఏం జరిగిందమ్మాయి? " అని అక్కడ వున్న ఇద్దరు ఆడపిల్లల్ని అడిగాడు ఆయన.

వాళ్లు జరిగిన విషయం చెప్పారు.

"నువ్వు మా అమ్మాయి జోలికి ఎందుకు వచ్చావురా? నిన్ను వాళ్లు ఆటలోనికి రాని య్యాలీ? రానియ్యకపోతే బొమ్మలు పీక్కుంటావా? ఎద్దు మాదిరిగా వున్నావు. ఆడపిల్లల్తోటి ఏంపనిరా నీకు? " అని ఆయన నీచమైన బూతులకి లేచాడు.

"వోయ్... తిట్టావంటే బాగుండదు" అన్నాడు నాగార్జున.

"తిట్టటం కాదురా, నిన్ను తంతా ఇప్పుడు! ఎవరు అడ్డం వస్తాడో రమ్మను!" అని నాగా ర్జునని నాలుగు దెబ్బలు కొట్టాడు ఆయన.

కొట్టి, బూతులు తిడుతూ ఇంటికి వెళ్ళిపో యాడు.

నాగార్జున ఏడుస్తూ ఇంటికి వచ్చి మంచంమీద పడుకున్నాడు.

చీకటి పడేవేళకి కూలిపనికి వెళ్ళిన రాగమ్మా, నాసరయ్యా వచ్చారు. నాగార్జున పెద్దగా ఏడుస్తూ, పెడబొబ్బలు పెడుతూ "అమ్మా... అయ్యా... మరే ఇదే శేషుచేత నన్ను తెగకొట్టిచ్చిందయ్యా" అని సుశీలమీద చెప్పాడు.

"ఇది బాగుందే. నేనెందుకు కొట్టిచ్చాను? " అంది సుశీల భయపడుతూ.

"అది ఎందుకు కొట్టించిందిరా? " అడి గాడు నాసరయ్య.

"నేను ఆటకి వస్తానంటేనూ రానియ్యలా! పెద్దమ్మాయి నాకు రాయేసింది. ఆ రాయి తగిలి నాకు ముక్కుదూలం పగిలిపో యింది. నాకు రాయేసేసరికి నేను కూడా రాయేస్తే ఆ అమ్మాయి పోయివాళ్ళ నాన్నని పిలచుకువచ్చి నన్ను తెగకొట్టిచ్చిందయ్యా!" అన్నాడు ఇంకా పెద్దగా ఏడుస్తూ.

"పిల్లలూ పిల్లలూ కొట్టుకుంటారూ, తిట్టు కుంటారూ మళ్ళీ అంతలోనే మంచి అవు తుంటారు! పిల్లలు కొట్టుకున్నదానికి పెద్దోళ్లు వచ్చి పిల్లల్ని కొట్టాలా? ఏందో అడిగివస్తం పా!" అని కదిలింది రాగమ్మ.

"అన్నాయ్ రాయేసేసరికి పెద్దమ్మాయి తల పగిలిందమ్మా! చాలా నెత్తురు కారింది. రాము డాక్టరు దగ్గరకి పోయేసరికి రెండు కుట్లు కూడా యేశారంట!" చెప్పింది సుశీల.

"దీని గుండానే ఆయన నన్ను కొట్టింది. ఇదే నన్ను ఆటలోనికి రానియ్యంది"

"సన్నాసిముండా... నీకు ఇంట్లోవాళ్లకంటే బయటవాళ్లు ఎక్కువంటే? మన పిల్లోడ్ని వచ్చి కొట్టినోడి కూతురితో నీకు ఆటలా? దానితోటి నీకు ఆటలేందే? ఊళ్లో ఆడుకోడా నికి దానికంటే మంచోళ్లు ఎవ్వురూ నీకు దొర కలా? దాని అయ్యా అమ్మా వూరికీ కాడికీ రోసినోళ్లు! అంత రోసినోళ్లు ఇంత వూరి మొత్తంమీద ఎవురూ లేరు! వాళ్ళ బిడ్డతోటి నీకు ఆటలెందుకూ, వాళ్లు వచ్చి మనవాడ్ని కొట్టటం ఎందుకూ? " అని రాగమ్మ సుశీ లని కొట్టింది.

నాగార్జున అంటే నాసరయ్యకి ఎంతో ప్రేమ. అతిప్రేమ. అతి గారాబం. తన కొడుకుని ఎవరో వచ్చి కొట్టారంటే నాస రయ్య కడుపు మండిపోతోంది. చాలా కోపం వచ్చింది. అయినా వెళ్ళి శేషుని అడిగే ధైర్యం లేదు. శేషు అంటే నాసర య్యకే కాదు, చాలామందికి భయమే.

అలాంటివాడి కూతురితో సుశీల ఎందుకు ఆటలకి పోవాలి? వాడు వచ్చి తన కొడు కుని ఎందుకు కొట్టాలి?

దీనికంతటికీ కారణం సుశీలే! సుశీలని తంతే అలాంటివాళ్ళతో రెండోసారి ఆటలకి వెళ్ళకుండా వుంటుంది.

ఆ కోపంతో నాసరయ్య సుశీలని కొట్టాడు. దారుణంగా, అందుబాటులో చేంతాడు వుంటే అది తీసుకుని కొట్టాడు.



సుశీల ఏడుస్తూ ఆ రాత్రి కూడా అన్నం తినకుండా పడుకుంది.

★ ★ ★

వాళ్లు గేదెని కొనాలని అనుకున్న పదిహేనురోజులకి నలభైమూడు వందలు పెట్టి ఒక మోస్తరు గేదెనికొన్నారు.

ఆ గేదె రావడంతో ఇప్పుడు సుశీలకి అదనపు పని పడింది.

ఇంతకుముందు పొయ్యిలోనికి పుల్లలు ఏరుకురావడం, వాళ్ళ అయ్య పొద్దున్నే కూలికిపోయినరోజు ఇంటికి అవసరమైన నీళ్లు తీసుకురావడం, అంట్లు తోమడం, వూడవడం, అప్పుడప్పుడూ స్నేహితురాళ్ళతో కలిసి చెరువుకి వెళ్ళి బట్టలు వుతుక్కురావడంలాంటి పనులు చేసేది.

ఇప్పుడు ఉదయమే లేచి గేదె దగ్గర పేడ కళ్లు తీసి, చిమ్మి, శుభ్రంచేయాలి. దానికి కుడితి పెట్టి, ఖాళీ అయిన ఆ తొట్టిలోనికి రెండు మూడు బుంగలు నీళ్లు తీసుకొచ్చిపోయాలి.

తొమ్మిది గంటల ప్రాంతంలో గేదెని విప్పి తోలుకుపోవాలి. ఎండా లేదూ వానా లేదు. ప్రతీరోజూ దానిని తోలుకుపోయి వాగుల్లోనో, వంకల్లోనో. చాళ్లలోనో, బీళ్ళలోనో మేపుకుని, సాయంత్రం 4 గంటల ప్రాంతంలో ఇంటికి తోలుకు వస్తుంది.

ఇంటికి వచ్చిన తరువాత దానికి నీళ్లు పెట్టి, మేతవేసి, మళ్ళీ ఖాళీ అయిన ఆ తొట్టిలోనికి రెండు మూడు బుంగలు నీళ్లు తీసుకొచ్చిపోస్తుంది. అప్పుడు ఇంకా పొద్దు వుంటే తొందరగా వెళ్లి కాసినో, కూసినో పుల్లలు ఏరుకురావాల్సిన పని వుండనే వుంటుంది.

గేదె రాకతో సుశీల దినచర్య మారిపోయింది. ఇంతకుముందు మాదిరిగా ఇప్పుడు స్నేహితురాళ్ళతో ఆటలకు వెళ్ళే అవకాశం లేదు. పనితోనే పొద్దంతా సరిపోతోంది.

వాళ్ళ ఇంటికి నాలుగు ఇళ్ళ అవతల వున్న రమణయ్య కూతురు రాణిది కూడా సుశీల ఈడే! ఇద్దరికీ ఐదురోజుల తేడానట! రాణి ఐదురోజులు పెద్ద.

ఇద్దరూ ఒకటీ, రెండేళ్ళ క్రితంవరకూ బాగా స్నేహితులే. అప్పుడు రాణి రోజూ సుశీల దగ్గరకి ఆడుకోవడానికి వచ్చేది! ప్రస్తుతం రావడంలేదు. ఇప్పుడు రాణి ప్రపంచం వేరూ, సుశీల ప్రపంచం వేరూ!

“రాణీ... రాణీ... ఆటాడుకుందాం వస్తావా?” రాణి ఆటలకి రాకపోతుండటంతో ఒకరోజు వాళ్ళ ఇంటికి వెళ్ళి సుశీల అడిగింది.

“ఏం ఆటా? నేను చేసుకోవాల్సిన వర్క్ చాలా వుంది. పైగా ఆటకు వస్తే మా అమ్మ కొడుతుంది కూడా!” అంది రాణి ముఖం చిట్లిస్తూ, నిర్లక్ష్యంగా.

తరువాత కూడా రాణి పలికీపలకనట్లు వుండటంతో సుశీల ఆ అమ్మాయి దగ్గరకు ఆటకు వెళ్ళడం మానుకుంది.

రాణి బ్రహ్మాండమైన ఫ్రాకులూ, స్కర్టులూ, మిడ్డీలూ, పంజాబీ డ్రెస్సులూ, ప్యాంటూ, షర్టులూ- ఇలా రోజుకోరకం దుస్తులు ధరించి బడికి వెళుతుంది.

ఆ వూళ్లో వున్న ప్రయివేట్ బడిలో రాణి ఐదోతరగతి చదువుతోంది. ప్రయివేటు బడి కావడంతో తీరిక తక్కువగా వుంటుంది. రాణికి సైకిల్ తొక్కడం కూడా చేతనవుతుంది. ఉన్న తీరిక సమయంలో సైకిల్ తొక్కుకుంటూనో, ఇంటి దగ్గర క్యారెమ్స్, చైనీస్ చెక్కర్స్ లాంటి ఆట ఆడుకోవడంతోనో కాలం గడుపుతుంది.

రాణి చక్కటి డ్రెస్సులతో ప్రతీరోజూ బడికిపోతుంటే, అదే వయస్సు కలిగిన సుశీల అస్తవ్యస్తమైన బట్టలతో, చిరిగిపోయిన బట్టలతో, ముతక బట్టలతో, మురికి బట్టలతో




గేదెని తోలుకుని పొలంపోతుంది.

రాణి మాదిరిగా మంచి బట్టలు కట్టుకో వాలని సుశీల పసిమనసుకి ఎంతో కోరిక. అలాంటి అందమైన, నాజూకైన బట్టలు తను జీవితంలో ఒక్కసారి కూడా కట్టుకో లేదు. ఇక ముందు ముందు భవిష్యత్‌లో మాత్రం అలాంటి బట్టలు తను ఏం కట్టు కుంటుంది?

అలాగే సైకిల్ తొక్కడం కూడా సుశీలకి తీరని కోరికే! రాణి మాదిరిగా సైకిల్ తొక్కితే ఎంత బాగుంటుందో అని సుశీల ఎన్నోసార్లు అనుకుంది.

సుశీల వాళ్ల అక్క వూరు అక్కడికి మూడు మైళ్ళదూరం. రోడ్డు కూడా వుంది. ఆ వూరికి సైకిల్ తొక్కుకుంటూ తనుపోతే అక్క ఎంత సంతోషిస్తుందో అనుకునేది సుశీల.

తనకి సైకిల్ తొక్కడం చేతకాదు. నేర్చు కోవడానికి కూడా తనకి సైకిల్ దొరకదు.

బుజ్జిగాడి నాన్నకి సైకిల్ వుంది. వాడికి సైకిల్ తొక్కడం కూడా బాగా చేతనవు తుంది. చేతులు కూడా వదిలిపెట్టి తొక్కు తాడు.

వాడు సుశీలకి మంచి స్నేహితుడు. వాడు కూడా బర్రెని తోలుకువస్తాడు. ఇద్దరూ బరిగొడ్లను కలిసే మేపుతుంటారు.

"అబ్బాయి బుజ్జిగా... నాకు సైకిల్ తొక్కడం నేర్పుతావా?" అని ఒకరోజు సుశీల వాణ్ని అడిగింది, గేదెలు కాసేదగ్గిర.

"ఓ... బెమ్మాండంగా నేర్పుతా! నేను చాలామందికి నేర్పాకూడా! సైకిల్ నేర్చుకో వడం చాలా సులబం సుశామ్! అయితే మోకాలి చిప్పలు మాత్రం పగిలిపోతాయి"

"ఎందుకూ?"

"అంతే. సైకిల్ నేర్చుకునేటప్పుడు ఎన్ని సార్లు పడాలో... ఎన్ని దెబ్బలు తగ లాలో..."

"అయితే మాల్లే! నాకు నేర్పు బుజ్జాయ్!"

"మా నాన్న సైకిల్ నాకేగా! నన్ను ఎప్పుడూ తొక్కుకోమంటాడు. నీకెందుకు, రేపొద్దున్నే మీ ఇంటికి సైకిల్ యేసుకుని వస్తా! నువ్వు రా. రెండు రోజుల్లో నేర్పేస్తా సైకిల్" అన్నాడు బుజ్జిగాడు.

అన్నట్టుగానే మరుసటిరోజు ఉదయమే సైకిల్ తీసుకుని సుశీల వాళ్ళ ఇంటికి వచ్చాడు.

"సుశీలా సుశీలా... సైకిల్ నేర్పుతా రా..." అని ఇంటిముందు నిలబడి పిలి చాడు ఉత్సాహంగా.

అప్పుడు సుశీల ఇంటి దగ్గిర నీళ్ల తీసు కొస్తూ వుంది. బుజ్జిగాడు పిలవడాన్ని రాగమ్మ కూడా విన్నది. ఇంకా నీళ్ల తీసుకు రావాల్సిన పనివుంది.

సుశీల వెళ్ళ్డానికి ప్రయత్నించింది కానీ రాగమ్మ బుజ్జిగాడిమీదకి లంఘించింది. "ఏంద్రా... సుశాయ్‌కి సైకిల్ నేర్పుతా? నీకేం పనీపాటా లేదెట్టా? ఆడముండలు సైకిళ్లు నేర్చుకుని ఏం చేస్తార్రా? ఆడాళ్ళకి ఎందుకూ సైకిళ్లూ? పోపో... పొయ్యి మీ చెల్లెలకి నేర్చుకో సైకిలు! సైకిలు నేర్పుతా డంట పెద్ద మొగోడు! నీమాత్రం మొగోడు ఎవుడూ లేడ్రా సుశీలకి సైకిల్ నేర్పడా నికి... పనికిమాలినోడా కూసే గాడిద వచ్చి మేసే గాడిదని చెడగొట్టిందంట" పనిచే స్తున్న సుశీలని పనిచెయ్యనివ్వకుండా చెడ గొట్టడానికి బుజ్జిగాడు వచ్చినట్లు, పైగా ఆడవాళ్లు సైకిల్ నేర్చుకోవడం పెద్ద తప్పు అయినట్లూ రాగమ్మ చడామడా తిట్టకు లేవ డంతో బుజ్జిగాడు వచ్చిన దారినే వెళ్ళిపో యాడు వెనక్కి తిరిగి చూడకుండా.

సుశీలకి అలా సైకిల్ తొక్కాలనే కోరిక తీరకుండానే ఆదిలోనే అంతమైపోయింది.

గేదె పనితోనే సుశీలకి సమయం అంతా గడచిపోతోంది. గేదె లేనప్పుడు తల్లిదం

ద్రులు తిట్టినా, కొట్టినా ఒకసారి గాకపోతే ఒకసారయినా ఆటలకి వెళ్ళేది. ఇప్పుడు ఇంటి దగ్గర మాత్రం ఆటలనే మాట మరి చిపోయింది.

పని పెరిగింది. ఆటలు మానుకుంది. ఎప్పుడూ గేదె పనితోనే సరిపోతోంది. అయినా సుశీల కడుపునిండా, తృప్తిగా ఒక్క రోజు కూడా పాలూ, పెరుగూ తాగలేదు.

గేదెని కొనుక్కు వచ్చిన కొత్తలో కొద్దిరోజులు మాత్రం ఉదయం పూట చిక్కటి మజ్జిగా, సాయంత్రంపూట పెరుగూ వేసి సుశీలకి అన్నం పెట్టింది రాగమ్మ.

పాలు అమ్మడం మొదలుపెట్టింది. డబ్బులు వస్తున్నాయి. వస్తున్న ఆ డబ్బు మీద ధ్యాసే తప్ప సుశీలకి తృప్తిగా పెరుగు కానీ, పాలు కానీ పెట్టాలనే ధ్యాస మాత్రం వుండదు.

నాగార్జున అయితే పెరుగో, పాలో లేనిదే భోజనం చేయడు.

సుశీలని బాధించే విషయం అదే! నాగార్జున గేదెపని ఒక్కరోజు కూడా చేయడు. కనీసం ఆ గేదె తాడు విప్పి దానికి కుడితి కూడా ఎప్పుడూ పెట్టడు. దానిముందు మేత వేయడు. అయినాసరే ఆ గేదెనించి వచ్చే పాలో, ఆ పాలతో వచ్చే పెరుగో వుండాల్సిందే!

ఒకరోజు సుశీలా, నాగార్జునా కలిసి ఒకేసారి భోజనానికి కూర్చున్నారు. సుశీలతో పాటు నాగార్జునకి కూడా రాగమ్మ నీళ్ళమజ్జిగ వేసి అన్నం పెట్టింది.

నాగార్జున క్షణం ఆలస్యం చేయకుండా, ముందు వుంచిన కంచాన్ని విసిరి నేలకేసి కొట్టాడు. మరోమాట కూడా ఏం మాట్లాడలేదు. అంత కోపం అతనికి వచ్చింది.

"ఏంపనిరా అది? చూడు, ఇల్లంతా ఎట్ట మెతుకులు పడ్డాయో! తినే కూటిని నేలకేసి కొడితే కూడు దొరకదురా" అంది రాగమ్మ కోపంగా.

"లేకపోతే ఏందీ? ఇది మనుషులు తినే కూడేనా? పాలు పొయ్యకూడదూ? బర్రె పాడివుంది ఎందుకూ? కడుపునిండా కూడు కూడా తినేపని లేదా ఏందీ?" అని కోపంగా ప్రశ్నలవర్షం కురిపించాడు నాగార్జున.

"ఈ పూట పాలు లేవు. రోజూ పోయించుకునే కాతాల వాళ్ళకి సరిపోయినయ్యి! ఉన్నప్పుడు పాలు పోసి పెట్టటంలా? ఒక పూట పాలు లేకపోతే కూడు తినలేవెట్లా? పుట్టినప్పటినించీ పాలతోటి పెరిగావా ఏందీ? పోనియ్యిలే మగపిల్లోడు, మగపిల్లోడు అని గారాబం చేస్తంటే మదంపట్టి కొట్టుకుంటున్నావేందిరేయ్! ఇట్టయితే లాభం లేదబ్బాయి!" అని రాగమ్మ కొడుకుని ముద్దు ముద్దుగానే కోప్పడింది.

ఆ పూట చిటికెడు పాలు మిగిలాయి. ఆ పాలు పోసి నాగార్జునకి అన్నం పెడదామనుకుంది ఆమె. అయితే సుశీలా, అతనూ ఒకేసారి భోజనానికి కూర్చున్నారు.

అతని ఒక్కడికే పాలుపోసి అన్నం పెడితే సుశీల పేచీపెట్టి, గొడవ చేస్తుంది. ఈమధ్య ప్రతీరోజూ సుశీల భోజనం దగ్గిర పాలో, పెరుగో కావాలని గొడవే!

సుశీల భయంతో అతనికి కూడా సుశీలతోపాటు నీళ్ళమజ్జిగతో అన్నం పెట్టింది. దానికి నాగార్జున కంచం నేలకేసి కొట్టి, అన్నం నేలపాలు చేసి, పేచీపెట్టి గొడవ చేశాడు.

అతను అంత గొడవ చేసినా రాగమ్మకి ఇష్టమే! కారణం, అతను మగపిల్లవాడు! అతనంటే ఆమెకి అమిత ఇష్టం!

అలాంటిపని సుశీల కానీ చేసి వున్నట్లయితే ఈపాటికి శరీరం వాతలు తేలివుండేది.



ముసురుపట్టి వాతావరణం చల్లగా, ఆహ్లా





దకరంగా వుంది. చల్లటి గాలులు వీస్తు న్నాయి.

సుశీలా, బుజ్జిగాడూ ఇంకా ఏడెనిమిది మంది పిల్లలు గేదెలు తోలుకుపోయారు. వాళ్లలో ముగ్గురు ఆడపిల్లలు కూడా వున్నారు.

కొద్దిసేపు గేదెల్ని మేపిన తరువాత వాటిని ఒక కుంటలో తోలారు.

"బుజ్జిగా... ఓరేయ్ బుజ్జిగా... ఈత కొడదామా?" వాళ్ళలో ఒక అమ్మాయి బుజ్జిగాడ్ని పిలిచినా, అందర్నీ ఉద్దేశించి అడిగింది.

"చల్లగా వుందికదే! చలి పుట్టిద్ది. ఈత కొట్టకపోతే ఏం పోయింది లెద్దూ ఇయ్యాల!" అంది మరొక అమ్మాయి.

"చలాగిలా? ఈత కొట్టాల్సిందే" అని ఒక పిల్లవాడు చొక్కా వూడతీసి, నిక్కరుమీదనే కుంటలోనికి పరిగెత్తాడు.

వాడ్ని చూసి మిగతా పిల్లలు కూడా ఒకరి వెంట ఒకరు చొక్కాలు విప్పి మగపిల్లలు నిక్కర్లమీదా, ఆడపిల్లలు డ్రాయర్ల మీదా కుంటలో పోయిపడ్డారు.

ఈత వచ్చినవాళ్లు లోపలకి పోయి ఈదుతుంటే, చేతకానివాళ్ళు లోతుకి వెళ్ళకుండా, కొంచెం దూరం మోకాలిలోతువరకు గల నీళ్ళలో పడి, చేతుల్నీ కాళ్ళనీ నేలకేసి కొడుతూ పొర్లాడుతున్నారు.

సుశీల కొద్దిరోజుల్లోనే ఈత నేర్చుకుంది. ఇప్పుడు మగపిల్లలకంటే కూడా బాగా ఈదుతుంది.

కొంతమంది ఈడుతూనే వెళ్ళి కుంటలో వున్న గేదెల్ని కడుక్కున్నారు. సుశీల కూడా కుంట మధ్యభాగంలోనికి వెళ్ళి తన గేదెని శుభ్రంగా కడుక్కుంది.

అరగంట సేపు కుంటలో నీళ్ళతో ఆటాడుకుని, ఒడ్డుకి వచ్చి, తల, వళ్లూ తుడుచుకుని బట్టలు కట్టుకున్నారు.

"ఏం ఆట ఆడుకుందాంరా ఇయ్యాల?" అడిగాడు బుజ్జిగాడు.

గేదెల్ని తోలుకు వచ్చిన పిల్లలందరిలో వాడు కొంచెం పెద్దవాడు. మనిషి బలంగా, తెలివిగా వుంటాడు. వాడు వాళ్ళకి లీడర్ లాంటివాడు. వాడు చెప్పిన మాటకి తిరుగు వుండదు.

"చర్ ఆట ఆడుకుందాం రా" అంది ఒక అమ్మాయి.

"రోజూ చర్రే కదరా! ఇయ్యాల చర్ వద్దు. తొక్కుడుబిళ్ల ఆడుకుందాం" అన్నాడు ఒకడు.

"ఏహై అయ్యి కాదురా. ఇయ్యాల కోతికొమ్మంచి ఆడుకుందాం. కోతికొమ్మంచి ఆడుకుని చాలారోజులవతంది. బాగుండిద్ది" అన్నాడు బుజ్జిగాడు.

"అంతే. ఇయ్యాల కోతికొమ్మంచి ఆటే, కోతి కొమ్మంచి ఆటే!" అని పిల్లలు అందరూ వంతపలికినట్లు కోరస్‌గా అన్నారు.

ఒకరి చేతులు ఒకరు పట్టుకుని పంటలు వేశారు. సుశీల 'తట్ట' అయింది. అంటే సుశీల ఆటపెట్టాలి.

కుంట గట్టుమీద వేపచెట్టూ, చింత చెట్టూ వున్నాయి. వేపచెట్టు కొమ్మలు బాగా కిందకు వంగి వుంటాయి. వాళ్లు కోతికొమ్మంచి ఆట వేపచెట్టు ఎక్కే ఆడతారు.

ఆట మొదలైంది.

ఒకరు పుల్లదూరంగా విసిరివేశారు.

సుశీల ఆ పుల్లకోసం పరిగెత్తిపోయింది.

కొంతమంది చెట్టు ఎక్కి కూర్చున్నారు. కొంతమంది దూరంగా పోయారు. సుశీల పుల్ల తీసుకువచ్చేలోపు ఎక్కడివాళ్ళు అక్కడ సర్దుకుని జాగ్రత్తగా వున్నారు.

సుశీల పుల్ల తీసుకువచ్చి గిరిగీసి గిరిలో పెట్టింది. ఆ పుల్లని 'తల్లి' అంటారు.

ఆడుతున్నవాళ్లు ఎవరైనా తల్లిని తాకితే



సుశీల మళ్ళీ ఆట పెట్టాలి.

ఎవరూ తల్లిని తాక్కముందే సుశీల ఎవరో ఒకర్ని టచ్‌చేస్తే, ఆ టచ్ అయిన వాళ్లు ఆట పెట్టాలి.

ఎవరికివాళ్లు టచ్ గాకుండా ఆ పుల్ల తల్లిని పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ తల్లిని తాకనివ్వకుండా ఎవర్నయినా ఒకర్ని టచ్ చేయాలని సుశీల చూస్తోంది.

మొత్తానికి సుశీల రెండోసారి ఆట పెట్ట కుండానే, కొద్ది నిమిషాల్లోనే ఒకర్ని టచ్ చేసింది.

ఆ టచ్ అయినవాడు ఆట పెడుతు న్నాడు.

కొంతమంది నేలమీద వున్నారు. కొంత మంది చెట్టు ఎక్కి దూకుతున్నారు. నేల మీద వాళ్లూ, చెట్టుమీద వాళ్లూ అందరూ తల్లిని తాకడానికి ప్రయత్నిస్తున్నారు.

అయితే ఆట పెడుతున్నవాడు ఎవర్నీ తల్లి పుల్లని తాకన్వికుండా దాని దగ్గరగానే, దాని చుట్టూనే తిరుగుతూ, నేలమీద వున్న వాళ్ళని టచ్ చేయడానికి నాలుగు అడు గులు వేస్తే చెట్టుమీదవాడు టక్కున పుల్ల మీద దూకుతున్నాడు. చెట్టుమీద వున్నవా ళ్ళని చిక్కించుకోవడానికి చూస్తూ, చెట్టు మీదకు ఎగబాకుతుంటే, కింద వున్నవాళ్ళు వేగంగా పుల్లని తాకుతున్నారు.

వీళ్లు పుల్లని టచ్ చేస్తే ఆట పెడుతున్న వాడికి మళ్ళీ ఆట పెట్టక తప్పదు. మొత్తా నికి వాడిని ముప్పుతిప్పలు పెడుతూ ఏడిపి స్తున్నారు.

ఆట మంచి వూపులో వుంది. ఉత్సా హంగా కేకలు వేస్తూ, గోలగోలగా అరుస్తూ, మహావేగంగా చెట్టు ఎక్కుతూ దూకుతూ ఆటాడుకుంటున్నారు.

మగపిల్లలకి ఏమాత్రం తీసిపోం అన్నట్లు ఆడపిల్లలు కూడా వీళ్ళతో పాటే చెట్టు ఎక్కుతూ దూకుతున్నారు.

గేదెలు కుంటలో ప్రశాంతంగా పడుకు న్నాయి. ఏదైనా ఒక గేదె గడ్డి మేయడానికి బయటకి వస్తే, అలా మేస్తూ దూరంగా పోతుందనే ఉద్దేశంతో ఒక పిల్లవాడు వెళ్ళి దాన్ని మళ్ళీ కుంటలోనికి తోలుతున్నాడు.

బుజ్జిగాడు దొనయి ఆట పెడుతున్నాడు. చెట్టుమీద ఐదుగురూ, కింద నలుగురూ వున్నారు.

తల్లిపుల్ల దగ్గరనించి బుజ్జిగాడు నేలమీద వాళ్ళలో ఒకడిని టచ్ చేయడానికి వాడి వెంట పరిగెత్తాడు.

సుశీల చెట్టుమీద వుంది. పుల్లని తాకడా నికి సుశీల చెట్టుమీదనించి దూకబోతున్నం తనలోనే చేయిజారింది. అంతే. థక్‌మని కిందపడింది.

కిందపడిన సుశీల కాలు ఒక రాయిమీద ఏటవాలుగా పడింది.

సుశీల కిందపడిన వెంటనే, ఒకడు పైనించి దభీల్‌మని సుశీల కాలుమీద దూకాడు. ఆ క్షణంలో వాడు ఆట ధ్యాసమీ దనే వున్నాడు.

రాయిమీద ఏటవాలుగా వున్న కాలిమీ దనే వాడు పడటంతో సుశీల 'అమ్మా' అని పెద్దగా అరిచింది.

పిల్లలందరూ పరిగెత్తుకుని సుశీల దగ్గ రకు వచ్చారు.

సుశీల కాలు పట్టుకుని ఏడుస్తోంది. పిల్ల లందరూ సుశీల కాలు చూశారు.

మోకాలి కిందిభాగంలో సుశీల కాలు విరి గిపోయింది.

సుశీల బలహీనురాలు. గాలి కొడితే పడి పోయేలా వుంటుంది. రాయిమీద వున్న కాలికి బలంగా దెబ్బ తగలడంతో పాదానికి కొంచెం పైభాగంలో, మోకాలి కింది భాగంలో కాలు విరిగిపోయి, అంతవరకూ వేలాడుతూవుంది.





# ఏరిన ముత్యాలు

☆ పంతులులేని బడి, దేవుడు లేని గుడి, మనసు లేని మనిషి ఒకటే.

-బాబా

☆ ఒక ఉల్లాసవంతమైన మిత్రుడు నిత్యం ప్రకాశాన్నిచ్చే సూర్యుని వంటివాడు.

-సర్‌జాన్ లుబ్బక్

☆ తమ స్త్రీలు ఎంత అభివృద్ధి చెందితే ఆ దేశం అంత అభివృద్ధి చెందినట్లు భావించాలి.

-గాంధీజీ

☆ యవ్వనమొక తప్పిదము, మధ్యవయసు ఒక పోరాటము, పెద్దతనము ఒక సంతాపం.

-షెరిడాన్

☆ అపజయం అంటే ఏమిటి? అదొక అరుదైన చదువు. అందమైన ప్రగతికి మెట్టు.

-వెనిడెన్ ఫిలిప్స్

☆ చదువరి కానివాడు రచయిత కాలేడు.

-హారీ గోల్డెన్

☆ ఇతరుల జీవితాలను సంతోషంతో నింపండి. మీ సుఖసంతోషాలకు అదే ఖచ్చితమైన మార్గం.

-టి.ఎ. పాయ్

☆ పురుషుడు డబ్బును సంపాదిస్తాడు. స్త్రీ గృహాన్ని నిర్మిస్తుంది.

-అరబ్‌దేశ సామెత

☆ ప్రేమంత వేగంగా, బలంగా ఏ తీగా బంధించలేదు.

-బర్టన్

☆ నలభై సంవత్సరాల వృద్ధుడిగా వుండటంకంటే డెబ్బైసంవత్సరాల యువకుడిగా ఉండటం కొన్ని సమయాలలో చాలా ఆనందంగా వుంటుంది.

-ఒ.డబ్ల్యు. హూమ్స్

☆ ఆత్మద్వేషి తన అధఃపతన మార్గాలను తానుగా వెతుక్కుంటాడు. దేశంపట్ల కూడా ఈ మాట నిజమే.

-స్వామీ వివేకానంద

☆ పరిస్థితులు మనిషి అదుపులో ఉండవు. కాని అతని ప్రవర్తన అతని అధీనంలోనే వుంటుంది.

-బెంజిమేన్ డిజ్రెలి

☆ సమాజంలో డబ్బు మిక్కిలి సమర్థవంగల శక్తి. ఎవరి చేతిలో వున్నా అది ఆ వ్యక్తికి అధికారం ఇస్తుంది.

-రోగర్ స్టార్

సేకరణ: పట్నం శేషంశెట్టి




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

ఫిబ్రవరి చతుర నవల 'పేదపిల్ల'

...........................................

సమీక్షకుని పేరు : ...........................................

చిరునామా : ...........................................

...........................................

...........................................

...........................................

"అమ్మో... కాలు విరిగిపోయిందిరా!" అన్నాడు బుజ్జిగాడు భయంగా.

"ఏం చేద్దాంరా ఇప్పుడు? ఎట్ట... ఎట్ట..." అని ఇద్దరు ముగ్గురు పిల్లలు ఆందోళనగా అడిగారు.

"మనం ఏంచేద్దాం? వెళ్ళి వాళ్ళ అమ్మా అయ్యకి చెపుదాం" అంది ఒక అమ్మాయి.

పిల్లలందరికీ భయంభయంగా వుంది. వాళ్ళ భయాన్ని చూసి సుశీల ఒక్కసారిగా పెద్దగా ఏడుపుకి లేచింది.

"ఎవరంపోయి చెపుదాం వాళ్ళకి? " అన్నాడు ఒకడు.

"అమ్మో... ఆలస్యమైతే యట్ట? నేను పొయ్యి వాళ్ళ అయ్యని పిలుచుకుని వస్తాను. నా బరిగొడ్లని చూస్తుండండి, మళ్ళీ అయ్యి ఎటన్నా పోతయ్యేమొ!" అని ఒకడు ఇంటికి వెళ్లడానికి సిద్ధమయ్యాడు.

"మయ్య ఇంటి దగ్గర వుంటాడో, వుండడో! ఇయ్యాల ఎంకయ్యోళ్ళకి బావి తవ్వడానికి కూలికిపోయాడు"

"ఎక్కడున్నా పోయి పిలుచుకుని రారా! నువ్వు తొందరగా రావాలి" అంది ఒక అమ్మాయి.

వాడు పరుగు లంకించుకున్నాడు.

అందరూ కాలి చుట్టూ కూర్చుని భయంగా, ఆందోళనగా చూస్తున్నారు. ఏం చేయాలా అని తర్జన భర్జన పడుతున్నారు. ఏంచేయాలో అర్థంకావడంలేదు.

కొద్దిసేపు గడచిన తరువాత బుజ్జిగాడు అన్నాడు, "వాళ్ళ అయ్య వచ్చినా ఏంచేస్తాడురా? ఇంటికి తీసుకుపోవాల్సిందేకదా! ఇంటి దగ్గర్నించి ఇక్కడకి వచ్చేసరికి ఆలస్యమయిపోయిద్దిరా! మనమే ఎత్తుకుని ఇంటికి తీసుకుపోదాం. మనం ఇంటిదగ్గరకి చేరిస్తే, అక్కడ్నించి వాళ్ళు ఆస్పత్రికి తీసుకుపోతారు"

"అంతేరా... గొడ్లుని తోలుకుపొయ్యేవేళ కూడా కావస్తందిగా! ఓరేయ్, మీరు ముగ్గురూ బరిగొడ్లుని ఇళ్ళకు తోలుకుని రాండ్రా! మేం ముగ్గురమి సుశీలని ఇంటికి తీసుకుపోతాం"

"సరే... మీరు సుశీలని జాగర్తగా ఎత్తుకుని తీసుకుపోండ్రా! కుంటలోపలనించి బరిగొడ్లని బయటకి తోలి, కొద్దిసేపు మేపి ఇంటికి తోలకవస్తాం. మరీ ఈ జామునే గొడ్లు ఇంటికి ఎందుకు? కొద్దిసేపు మేపి అన్నిటికీ ఒకేసారి తోలుకు వస్తాంలే!" అన్నాడు ఒకడు.

బుజ్జిగాడు సుశీలని భుజాలమీదకి ఎత్తుకున్నాడు. ఇద్దరు అనుసరించారు.

దారిలో కొంతమంది పెద్దవాళ్లు ఎదురు వచ్చి "ఏం జరిగింది, ఏం జరిగింది? " అని అడిగారు.

సుశీలని ఎత్తుకుని తీసుకుపోతూనే జరిగిన విషయం చెప్పారు. మోకాలి కింది భాగంలో కాలు విరిగినవరకూ వేలాడుతూ వుంది. చూసినవాళ్లు 'అయ్యో పాపం!' అన్నారు.

బుజ్జిగాడూ, మరొకడూ సుశీలని ఒకరి తరువాత ఒకరు మార్చుకుని ఎత్తుకుని తీసుకువస్తున్నారు.

వెళ్ళినవాడు చెప్పడంతో రాగమ్మా, నాసరయ్యా పెద్దగా ఏడుస్తూ వీళ్లు వూరు సమీపంలోకి వచ్చేసరికి ఎదుర్కువచ్చారు. వాళ్ళ వెంట ఇంకా వూళ్ళో జనం ఐదారుగురు కూడా వున్నారు.

"ఏమైందిర బుజ్జిగా? " అని గుంపులో అతను అడిగాడు. బుజ్జిగాడు జరిగిన విషయం చెప్పాడు.

"అయ్యో నా బిడ్డా... ఎంతపని జరిగిందే తల్లీ!" అని రాగమ్మ ఏడుపుకి లేచింది.

రాగమ్మ ఏడవడంతో సుశీల కూడా బావురుమంది పెద్దగా. తల్లి కొడుతుందనే

భయం కూడా సుశీల ఏడుపుకి ఒక కారణం.

నాసరయ్యకి కూడా కళ్ళంట నీళ్లు తిరిగాయి.

"ఊరుకోండి రాగమ్మా... ఏడవ్వాకండి. ఎందుకేడుత్తారూ? మీరు ఏడుత్తంటే మిమ్మల్ని చూసి ఆ పిల్ల కూడా ఏడుత్తంది! ఎందుకు ఏడవడం మీరు?"

"ఏంకాదులే అది. చిన్నపిల్లకదా, కాలు తొందరగానే అతుక్కుంటుందిలే! ఏడిచి ఏం లాభం, ఏడవద్దు!" అని వాళ్ళవెంట వచ్చిన వాళ్ళు నాసరయ్యనీ, రాగమ్మనీ సముదాయిస్తున్నారు.

"అయ్యో నా బిడ్డా... అయ్యో నా తల్లీ... నా బిడ్డకి కాలు ఒకచోట నిలవదమ్మా... ఎప్పుడూ లేడిగెంతినట్లే గెంతేదమ్మా! అలాంటి బిడ్డకి కాలు విరిగి అవిటిదయిందమ్మా!" అని రాగమ్మ ఏడుస్తూనే వుంది.

అందరూ కలిసి ఇంటికి వచ్చారు. ఊళ్ళో వున్న సూదులు పొడిచే కంపౌండర్‌ని పిలుచుకువచ్చారు.

అతను చూసి ఒక ఇంజెక్షన్ చేసి, రెండు గొట్టాలు కడుపులోనికి మింగించాడు. తరువాత విరిగిన కాలు కదలకుండా రెండు చిన్న వెదురుబద్దలు పెట్టి, బ్యాండేజీ మోకాలివరకూ చుట్టాడు.

"ఈ కేసు నావల్ల కాదు. మీరు టౌనుకి తీసుకుపోవాల్సిందే. అక్కడ ఎముకల స్పెషలిస్టు డాక్టరు వున్నాడు. ఆయన దగ్గరకి తీసుకుపోతే ఆయన కట్టుకడతాడు. అక్కడ మీరు వారంరోజులు వుండాల్సివచ్చిద్ది. బస్సులో మాత్రం కాలు కదలకుండా జాగ్రత్తగా తీసుకుపొండి" అని చెప్పి వెళ్ళిపోయాడు కంపౌండరు.

సుశీలని చూడటానికి వచ్చిన వాళ్ళలో ఒకతను అన్నాడు. "ఆ డాక్టరు దగ్గరకిపోతే చాలా కర్చయ్యిద్ది నాసరయ్యా! మొన్న మా చుట్టాలబ్బాయికి ఇలాగే చెయ్యి విరిగితే ఆ డాక్టరు దగ్గరికే తీసుకుపోయాం. ఆయన చూసినందుకు చీటికే యాబయిరూపాయలు! ఎక్సరేలనీ, మందులనీ, పాడూ బీడని చాలా వదిలిస్తాడు. అక్కడ వుండమంటాడు. ఉంటే గదికి రోజుకి నలబయి రూపాయల అద్దె కట్టాల!"

"అసలు డాక్టరు దగ్గరకి ఎందుకు? విరిగినవాటిని అతికించడంలో పుత్తూరు రాజులు పెట్టింది పేరు! వాళ్ళు కట్టుకడితే ఇంక తిరుగేముండిద్ది? విరిగినవాటిని అతికించడంలో వాళ్ళు మొనగాళ్లు!" అన్నాడు మరో మనిషి.

"రమణాయపాలెంలో ఒక నాటువైద్యుడు వున్నాడు. విరిగిన ఎముకలకి ఆకుకట్టు కడతాడు. ఎంతెంత దూరంనించో కూడా ఆయన దగ్గరకి కట్లు కట్టించుకోవటానికి జనం వస్తుంటారు. ఆయన పైసా డబ్బు కూడా తీసుకోడు, ఏదో ఇష్టమై మనం ఇస్తే తప్ప! ఆయన కట్టిన కట్టు గేరంటీగా అతుక్కోవాల్సిందే!"

"ఈ నాటువైజ్జులు; పుత్తూరు రాజులూ, వీళ్ళందరూ కూడా కట్టు కట్టి విరిగినవాటిని అతికించి నయం చేస్తుంటే ఇంక డాక్టర్లు ఎందుకూ, స్పెషలిస్టులు ఎందుకూ, చదువులు ఎందుకూ?" అన్నాడు ఆ మాటలు అన్నీ వింటున్న ఒక చదువుకున్న కుర్రవాడు.

"కానియ్యండి, బస్సు వచ్చే వేళయింది. ఇప్పుడు బస్సు పోతే ఇంక రాత్రిదాకా బస్సులేదు. ఈ బస్సుకి పోవడం మంచిది" అన్నాడు వాళ్ళ బంధువు ఒకతను.

రాగమ్మ తీసుకువెళ్ళాల్సిన బట్టలు అన్నీ సర్దింది. నాసరయ్యకి ఏం చేయాలో తోచకుండా వుంది.

డబ్బులు ఇంట్లో లేకపోతే, నాలుగు రోజుల్లో ఇస్తానని చెప్పి, ఒకరి దగ్గర 5 వందల రూపాయలు చేబదులు తీసుకువ




చ్చాడు.

దెబ్బ తగిలిన సుశీలని చూద్దామని వచ్చినవాళ్లు నలుగురూ నాలుగు రకాలుగా సలహాలు ఇస్తున్నారు. నాసరయ్యా ఎక్కడికి వెళ్ళాలో నిర్ణయించుకోలేకపోతున్నాడు.

"ఎక్కడికి తీసుకుపోతే బాగుండిద్దన్నా? ఎవరు అయితే బాగా నయం చేస్తారు? " సుబ్బరామయ్యని అడిగాడు నాసరయ్య. ఆయన పనికే నాసరయ్యా ఎక్కువగా వెళ్తుంటాడు. ఆయన కొద్దిగా చదువుకున్నవాడూ, తెల్సినవాడూ, తెలివైనవాడూ!

"ఇది ఒకరు చెప్పేయవారం కాదురా! ఒక్కొక్కరిది ఒక్కోరకపు నైజం! స్పెషలిస్టు డాక్టరు దగ్గరికి మీరు వెళ్తే బాగానే వుండిద్ది! అయితే ఆయన దెబ్బ నువ్వు తట్టుకో వద్దూ? జలగ పీల్చినట్టు పీల్చి వదిలిపెడతాడంట! ఆయన దగ్గరకి వెళ్తే చాలా అవతయ్! మళ్ళీ పది నిముషాలు మనల్ని ఓపిగ్గా చూడడు! సినిమా హాల్లో క్యూలో నిలబడ్డట్టు నిలబడితే, అక్కడ టిక్కెట్లు ఇచ్చినంతసేపే ఇక్కడ మనల్ని చూసేది. సినిమా హాల్లో టిక్కెట్లు అంటే ఇట్ట డబ్బులు తీసుకుని అట్ట టిక్కెట్టు ఇయ్యడమేగా! క్యూ మాత్రం చాంతాడంత పొడుగున వుండిద్ది! ఇక్కడా అచ్చం అంతే! అక్కడ టిక్కెట్టు ఇచ్చినంతసేపే ఇక్కడ మనల్ని చూసేది! ఇక ఆ నర్సులూ, కంపౌండర్ల ఎగురుళ్లూ, ఇసుగుళ్లూ చెప్పేపనిలేదు!"

"మరి ఏం చేస్తే మంచిదన్నా? "

"పుత్తూరు రాజుల దగ్గరకిపోయి కట్టు కట్టించుకుంటే మంచిదిరా! కట్టినందుకు వంద రూపాయలు తీసుకుంటాడేమొ! కర్చులూ గిర్చులూ అన్నీ అయినా ఐదారు వందల్లో పనయిద్ది. నైజ్జం కూడా నమ్మకమే నంటన్నారు!"

రాగమ్మా, నాసరయ్యా చర్చించుకుని, పుత్తూరు రాజుల దగ్గరకి వెళ్ళడమే శ్రేయస్కరమని నిర్ణయించుకున్నారు.

స్పెషలిస్ట్ డాక్టరు దగ్గిరకు వెళ్ళాలన్నా, పుత్తూరు రాజుల దగ్గరకి వెళ్ళాలన్నా పట్టణం వెళ్ళాల్సిందే.

వీళ్లు ఇలా మాట్లాడుకుంటుండగనే బస్సు వచ్చింది. నాసరయ్యా అక్కయ్యా వుంటే ఆమె, నాసరయ్యా, భార్యా, మరో దగ్గిర బంధువూ కలిసి సుశీలని బస్సులో పడుకోబెట్టుకుని పట్టణానికి తీసుకుపోయారు.

★ ★ ★

"అమ్మో నొప్పి... అయ్యో నొప్పి... నేనీ బాధని తట్టుకోలేను దేవుడో... అమ్మో... అయ్యో... దేవుడో, నాయనో..." అని పెద్దగా, భయంకరంగా, హృదయవిదారకంగా ఏడుస్తోంది సుశీల.

సుశీలని పట్టణంలో పుత్తూరు రాజు అనే వైద్యుడి దగ్గరకి తీసుకుపోయారు.

సుశీల కాలు విరిగిన దగ్గిర, బాగా లావుగా వాచిపోయింది.

ఆ నాటువైద్యుడు, వాచిన దగ్గర అదిమి, రుద్దుతూ కట్టుకడుతున్నాడు. ఆ బాధను భరించలేక సుశీల పెద్దగా అరుస్తూ, ఏడుస్తోంది.

"ఏడవ్వాకమ్మా... ఏడవ్వాకు ఏం కాదులే... చెట్టు ఎక్కేటప్పుడు తెలియదమ్మా? ఏడిస్తే నొప్పి తగ్గిద్దీ? " అని ఆ నాటువైద్యుడు మొరటుగా మాట్లాడుతూ కట్టు కడుతున్నాడు.

ఆ వైద్యుడు కట్టు కడుతున్న తీరుకి ఆ బాధను భరించలేక సుశీల గింగిరాలు తిరిగిపోతోంది.

కూతురు పడుతున్న బాధను చూసిన రాగమ్మకి కళ్ళంట నీళ్ళు తిరిగాయి. ఒక్కసారిగా పెద్దగా ఏడ్చింది.

"ఏడవ్వాకమ్మా... పెద్దదానివి నువ్వే ఏడిస్తే రోగి ఇంక ఎంత బాధపడుతుంది? ఎందుకు ఏడుస్తావు? ఏం కాదు, గమ్ము

నుండు" అని వైద్యుడు రాగమ్మని విసుక్కున్నాడు.

అందరి ఏడుపుల మధ్య సుశీలకి కట్టుకట్టాడు.

"ఇక్కడ నాలుగురోజులు వుండాలి. తరువాత చూసి ఇంటికి పంపిస్తాం. ఇంటికి వెళ్ళిన తరువాత మళ్ళీ నెలరోజుల్లో వస్తే కట్టు విప్పుతాం" అని చెప్పాడు.

"మా అప్పా, నువ్వా వుండండే ఇక్కడ. నేను ఇంటికి పోయొస్తా! ఇంటికాడ పిల్లలూ, బర్రే వుండె! ఆ బర్రెకి మేతవేసే సంతన కూడా లేదు. ఇంటికాడ నువ్వో, నేనో మనిషి లేకపోతే యట్ట? అన్నిటినీ సముదాయించుకుని మళ్ళీ నేను యేకు వజాం బస్సుకి వస్తా!" అన్నాడు నాసరయ్య.

"అట్నే పోయిరా! పొద్దున వస్తా మజ్జిగా, పాలూ, కాసిన్ని కట్టెపుల్లలూ తీసుకుని రా! ఇంటికాడ పిల్లవాడికీ, చిన్నపిల్లకీ జేగర్త అని చెప్పు. పాపం, చిన్నముండ వుండిద్దో, నేను కూడా వస్తానని ఏడిసిద్దో! అది. ఏడిస్తే మాత్రం నువ్వ వస్తా దాన్ని కూడా వెంట పెట్టుకునిరా! అంతగా అయితే నువ్వ పోతా తీసుకుపోవచ్చు లేకపోతే ఇక్కడే వుండిద్ది" అంది రాగమ్మ.

"సరే" అని నాసరయ్య వూరికి వచ్చాడు.

నాలుగు రోజులు నాసరయ్య పట్టణానికీ, వాళ్ళ వూరికీ తిరిగాడు. ఉదయమే పట్టణంలోని ఆస్పత్రి దగ్గరకి వచ్చి, రాత్రి ఇంటికి చేరుకునేవాడు.

"మీ అమ్మాయిని ఇంటికి తీసుకుపొండి. నెలరోజుల తరువాత వస్తే కట్టు విప్పుతాం. ఈ నెలరోజులూ అమ్మాయి ఎక్కడికీ కదలకూడదు. మంచంమీదనే పడుకోబెట్టండి. బాగా బలమైన తిండిపెట్టండి" అని చెప్పాడు వైద్యుడు.





"మంచి తిండి అంటే ఏం పెట్టమంటారు డాక్టరుగారూ?" అడిగింది రాగమ్మ.

"ప్రతిరోజూ గుడ్లూ, పాలూ, పండ్లూ, రెండు మూడు రోజులకి ఒకసారి మాంసం పెట్టండి. కాలు విరిగిన దగ్గర కండపెట్టి, సరిగ్గా అతుక్కోవాలంటే మంచి తిండి వుండాలి" అన్నాడు ఆయన.

సుశీలని తీసుకుని వూరికి వచ్చారు.

★ ★ ★

మంచంమీద పడుకుని వున్న ఆ నెలరోజులూ సుశీల జీవితంలో మరపురాని మధురమైన రోజులే! సుశీల పుట్టి బుద్ధెరిగిన తరువాత ఎప్పుడూ అలాంటి తిండి తినలేదు.

ఆ నెల రోజులూ పాలూ, పెరుగూ, గుడ్లూ, పండ్లూ పెట్టింది రాగమ్మ. మంచి మంచి కూరలు చేసి పెట్టింది. మాంసాహారం పెట్టింది.

సుశీల జీవితంలో ఇంతవరకూ అలాంటి తిండి తిని ఎరుగదు. ప్రతీ రోజూ కోడి గుడ్డూ! గిద్దెడు పాలు!

వైద్యుడు బలమైన ఆహారం పెట్టమని చెప్పడంతో రాగమ్మ వాళ్ళ శక్తిమేరకు సుశీలకు మంచి ఆహారమే పెట్టింది.

"ఎప్పుడూ ఇలాంటి తిండి తింటే ఇంకా కావాల్సిందేంవుంది?" అనుకునేది సుశీల. "కాలు విరిగితేనేం, కడుపు నిండా తిండి తినే భాగ్యం కలిగింది!" అని ఆ పసిమనసు ఎన్నోసార్లు ఆనందపడింది.

ఆదివారం రావడమే ఆలస్యం మాంసం తీసుకువచ్చి వండిపెట్టేది. ఆ వూళ్లో ఆదివారమే మాంసానికి పశువుల్ని కోస్తారు. మాంసాహారం కోసం ఆదివారం ఎప్పుడెప్పుడు వస్తుందా అని ఆశగా ఎదురుచూసేది.

అయితే నిజానికి సుశీల ఎంత తిండి తిన్నదో, నాగార్జున అంతకంటే ఎక్కువ తిన్నాడు. సుశీలకి చేసిపెట్టిన వాటిలో ఏవై

నాసరే నాగార్జునకి సగం పెట్టాల్సిందే. లేక పోతే గొడవచేస్తాడు.

నాగార్జున మీద వున్న ప్రేమతో, అతను అడగకముందే సుశీల కోసమని ఏ కొంచెం చేసినా, అందులో కొంత ప్రత్యేకంగా తీసి అతనికి పెడుతూనే వుంటుంది రాగమ్మ. అయినాసరే అతను వూరుకోడు. సుశీలకి ఏమీ వద్దు, మొత్తం తనకే పెట్టమంటాడు ఆ ముద్దుల కొడుకు.

ఆదివారం కేజీ మాంసం తీసుకువస్తే అందులో మూడు భాగాలు నాగార్జునే మింగుతాడు. మిగతా పావుభాగమే సుశీలకి దక్కేది. ఒకరోజు వుదయం రాగమ్మ అమ్ముకోవడానికి వచ్చే వాళ్ళదగ్గర డజను అరటికాయలు కొని, దాచిపెట్టి, పొలం వెళ్ళింది. మధ్యాహ్నం పొలంనించి వచ్చి చూస్తే కాయలు లేవు. ఆమెకి బాగా కోపం వచ్చింది.

"సుశాయ్, పెట్టెలో పెట్టిన అరటికాయలు ఎవురు తిన్నారే? పొద్దున్నే డజను కాయలు కొంటే ఒక పూటకే తింటే కొంప వుంటానికేనా, వూడుచుకుని పోవటానికా?" మంచంమీద పడుకుని వున్న సుశీలని అడిగింది రాగమ్మ, కొడుకే తిని వుంటాడని తెల్సినా కోపం పట్టలేక.

"అన్నాయ్ తిన్నాడమ్మా కాయలన్నీ?"

"ఏడీవాడు? ఎటు పొయ్యాడు? కాయలన్నీ వాడు ఒక్కడే తిన్నాడా, నీకేమైనా రెండు కాయలన్నా ఇచ్చాడా?"

"నాకు ఒక్క కాయకూడా ఇయ్యలా! అన్నీ వాడే తిన్నాడేమో నాకేం తెలిసిద్ది, నేను బయట పడుకుని వుంటిని"

అంతలోనే నాగార్జున వచ్చాడు.

"అరటి కాయలు ఎవురు తిన్నార్రా?" అడిగింది రాగమ్మ.

"నేను తిన్నాలే. తింటానికే కదెట్టా కొనుక్కున్నదీ?"

"నువ్వు తింటానికా ఏందిరా కాయలు కొన్నదీ? పిల్లముండ కోసమని కాయలు కొంటే... అయినా తినేదానికయినా ఒక అద్దూపద్దూ వుండొద్దంట్రా?"

"ఇప్పుడు ఏమైందేంది తింటే?"

"ఏమయిద్ది? ఏమన్నా అయిద్దా ఏంది? ఆ తినడానికయినా పద్ధతి వుండాల్రా? పూటకి డజను కాయలా? పొద్దున డజను కాయలు కొంటే మజ్జాన్నానికే తినేవోడు ఎవుడన్నా వున్నాడంట్రా? మనమేమన్నా లచ్చాధికారులమా డజన్లు డజన్లు కాయలు తింటానికీ. అసలు లచ్చాది కారులు కూడా తినర్రా అట్ట! పోనియ్యిలే, పోనియ్యిలే ముగ్గురు ముండల మజ్జన పుట్టిన మగ నలుసు అని మేం చూసీ చూడనట్టు పోతంటే, నెత్తికెక్కి ఆడతన్నావేందిరేయ్? అందరూ నీ అసుంటోళ్ళు కదూ? అందరికీ తినాలనిపించదూ?" అని రాగమ్మ కొడుకు మీద కోప్పడింది.

అయినా సరే, మరుసటి రోజునించీ మళ్ళీ మామూలే! సుశీల కోసమని చేసినవీ, కొన్నవీ గుటకాయ స్వాహా చేస్తూనే వున్నాడు.

పేరుకి సుశీలకోసం కొనడమే అయినా మెక్కడం మాత్రం నాగార్జున వంతే అవుతోంది. రాగమ్మ కానీ, నాసరయ్యకానీ వాడిని ఏమీ అనరు. వాడిమీద వున్న అభిమానం, ప్రేమే అందుకు కారణం. అవి వాడిమీద ప్రత్యేకంగా ఎందుకు వున్నాయంటే వాడు మగపిల్లవాడు కావడమే!

★ ★ ★

"సుశీలకి కట్టుకట్టించి ఇయ్యాల్టికి నెలరోజులవతంది. రేపోమాపో పోయి కట్టు వూడతీయించుకుని వస్తే బాగుండిద్ది" రాగమ్మ అంది నాసరయ్యతో

"రెండు రోజుల్లో పోయొద్దాం. ఐదారు రోజులు యెనకా, ముందుగా అయినా పర్లే

దన్నాడుగా"

"తొందరగా పోయొస్తే మంచిది"

"రేపటితోటి నారాయణగారి పని అయి పోయిద్ది. చేసేపని మజ్జలో వదిలిపెట్టిపోతే ఏం బాగుండిద్ది? ఒకవేళ రేపు వాళ్ళ పని కొద్దిగా కొరవపడ్డా, ఆ కొద్దికొరవ పని వాళ్లనే చేసుకోమని చెప్పి, ఎల్లుండి పొద్దున్నే పోయొద్దాం. కూలి డబ్బులు కూడా రేపు సందకాడ ఇస్తానన్నాడు" నాస రయ్య అన్నాడు.

అన్నట్లుగానే మూడవరోజు కట్టు విప్పతీ యించుకోవడానికి సుశీలని పట్టణంలో కట్టు కట్టిన వైద్యుడి దగ్గరకి తీసుకుపోయారు.

అతను కట్టు వూడతీసిన తరువాత చూస్తే, విరిగిన దగ్గర కాలు వంకర పోయి వుంది.

అది చూసిన రాగమ్మ గుండెలు గుభేల్ మన్నాయి. "అదేంది డాకటరుగారూ... కాలు వంకర పోయిందేంది? " ఆందోళనగా, గాభరాగా అడిగింది రాగమ్మ.

"అదేం కాదులే! కాలం గడిచేకొద్దీ మామూలుగా, సాఫీగా వస్తుంది" అన్నాడు ఆ డాక్టరు నింపాదిగా, ప్రశాంత స్వరంతో.

"అయ్యో... కాలు అసలు వంకరే పోయింది కద సామీ! అది మళ్ళీ ఎట్ట వచ్చిద్ది? " ఏడుపు గొంతుతో అంది రాగమ్మ.

"ఏంకాదు. అదే సర్దుకుంటుంది. అమ్మా యిని నడిపిస్తానని చెప్పాను కదా ఆరోజు. నడిపిస్తాను చూడు" అని సుశీలని బల్లమీ దనించి దింపి, చేయి పట్టుకుని నడిపిం చాడు.

సుశీల విరిగిన కాలు అవిటిగా, కుంటిగా వేసి నడిచింది.

"మామూలుగా నడిపిస్తానని చెప్పావు కదా సామీ అప్పుడు! కుంటుతుంది కదా ఇప్పుడు? "

"అవునమ్మా. ఇది కాలక్రమంలో సర్దుకుం టుంది కానీ, ఒకేసారి పరిగెత్తమంటే పరిగె త్తుతారూ? విరిగినంత తేలికా అతుక్కో వడం? " అన్నాడు ఆయన చాలా నిర్ల క్ష్యంగా.

చేసేది ఏమీ లేక సుశీలని తీసుకుని బరు వెక్కిన హృదయాలతో ఇంటికి తీసుకువ చ్చారు.

★ ★ ★

"ఈ బర్రె పాలు ఇచ్చేదీ కాదూ, చచ్చేదీ కాదు. ఎందుకు ఇది ఒక దండగ! దీని కోసం ఒక మనిషి పని మానుకుని రోజంతా చెడిపోవాల్సి వస్తుంది!" అంది రాగమ్మ ఒకరోజు.

"పాలు సరిగా ఇయ్యటంలేదా? "

"ఏం ఇచ్చిచస్తుంది? పాలకేంద్రానికి పోస్తే పూటకి ఒక లీటరు కావటంలేదు. నిన్నపొద్దున ఇచ్చిన పాలు తీసకపోయి కేంద్రానికి పోస్తే అరలీటరు అయినయ్యి! సందకాడ ఇచ్చినపాలు మన ఇంటిలోకి బొటాబొటిగా సరిపోయినయ్యి!"

"అయితే బరిగొడ్ల దళారి సుబ్బన్నకి చెప్పమంటావేంది? అమ్మిపెడతాడు"

"చెప్పు... ఎవరో ఒకరు కొనుక్కుపో తారు. పీడా వదిలిపోయిద్ది! దీనికి మేతా, నీళ్ళూ, తవుడూ చూసేసరికే నడుములు విరిగిపోతున్నాయి. సుశీలకి కాలు బాగున్న ప్పుడు బర్రెని రోజంతా బీళ్ళలోనో ఎక్కడో చోట తిప్పుకుని వచ్చేది పాపం, బర్రె పనంతా ఆ ముండే చేసేది! ఇప్పుడు నావ ల్లకాదు. కూలికి పోతే పదీ, పదహేను రూపాయలు వస్తయ్యి. కూలికి మానుకుని ఈ బర్రె ఎదురుగా కూకుంటే, దాని పాలకి వచ్చే డబ్బులు దాని తౌడుకి కూడా సరి పోవు"

"గొడ్డొచ్చినవేళా, బిడ్డొచ్చినవేళా అన్నారు.




ఈ బర్రె కూడా మంచిది కాదు. ఈ పాడు గొడ్డురాకపోతే అమ్మాయికి కాలు విరగక పోయి వుండేది. ఇయ్యాల మనం ఇన్ని అవస్తలు పడి వుండేవాళ్లమి కాదు" అన్నాడు నాసరయ్య.

"అందుకే బర్రెని అమ్మిపారేద్దాం. ఎంతో కొంత! దండగో పండగో! దాన్ని మేపడమే కష్టమైపోతంది. ఎంతెంత గడ్డిమోపులు తీసుకొచ్చినా ఏనుగు మేసినట్టు మేసి వెళ్ళ గక్కిద్ది! ఆ తిన్నదంతా ఎటుపోయిద్దో, ఏంపాడో సరిగా పాలు కూడా ఇచ్చిచావదు. అసలు అది తిన్నంత మేపడం మనవల్లేమ యిద్ది? "

వాళ్ళు అలా అనుకున్నవారం రోజులకి ఆ గేదెని అమ్మివేసారు.

సుశీలకి కాలు బాగున్నట్లయితే పాలు ఇవ్వకపోయినా సరే వుంచుకుని వుండే వాళ్ళు. సుశీలే గేదె పని అంతా చేసేది కదా! ఇప్పుడు సుశీల గేదె పని చేయలేకపో వడంతో దాన్ని అమ్ముకోక తప్పలేదు.



రాగమ్మ బాబాయి కొడుకు రాఘవులు. ఆయన చాలా దూరంలో బ్యాంకులో వుద్యోగం చేసుకుంటున్నాడు. అంతకు ముందు ఆయన మిలటరీలో పనిచేసాడు.

మిలటరీనించి రిటైరయిన కొంతకాలానికి బ్యాంక్‌లో వుద్యోగం వచ్చింది.

ఆయనకి ముగ్గురు కూతుళ్ళు. కొడుకులు లేరు. కూతుళ్లు ముగ్గుర్నీ చదివిస్తున్నాడు. వాళ్ళని బాగా చదివించాలనేది ఆయన కోరిక.

ఆడపిల్లలయినా వాళ్ళని వివక్షగా చూడ కుండా, మగపిల్లలకి మల్లే పెంచాలనీ, మగ వాళ్ళ మాదిరిగా తీర్చిదిద్దాలని ఆయన అభి లాష. ఆయనకి పెద్దగా చదువులేదు.

ఉద్యోగం చేసుకునే దగ్గరనించి వాళ్ళ వూరు వచ్చాడు. తరువాత నాలుగురోజు లకు అక్కని పలకరించి పోదామని దగ్గిర వూరే కావడంతో ఆ వూరినించి రాగమ్మ వాళ్ళ ఇంటికి వచ్చాడు.

కుశలప్రశ్నలు అయిన తరువాత సుశీల విషయం ప్రస్తావనకు వచ్చింది.

"అసలు మీరు అలాంటి నాటువైద్యుడు దగ్గరకి ఎట్ట తీసుకుపోయారు అక్కాయ్. వాళ్ళ దగ్గరకి తీసుకపోవటం ఎంత తప్పు! చూస్తా చూస్తా మీరు సుశీలని కుంటిదాన్ని చేసినట్టే కదా? స్పెషలిస్టుల దగ్గరకి తీసుక పోయినట్టుయితే కాలు బాగుచేసి వుండే వాళ్ళు! చిన్నపిల్ల. లేత ఎముకలు. కాలు సులభంగా బాగయివుండేది! మళ్ళీ ఎప్పటి మాదిరిగా మామూలుగా నడుస్తూ వుండేది కదా! చూస్తా చూస్తా అమ్మాయి జీవితాన్ని పాడుచేసారు!" అని ఆయన బాధపడ్డాడు.

"ఇట్ట జరిగిద్దని అనుకోలేదురా అబ్బాయి అప్పుడు. మాకేమో తెలియదు. ఆ వైద్యుడు బెమ్మాండంగా చెప్పాడు. నెల రోజుల్లోనే మామూలుగా నడిపిస్తానన్నాడు. అసలేం జరగనట్టే నడిపిస్తా చూడమన్నాడు. వాడి తీపి మాటలు నమ్మి మేం మోసపోయాం!"

"వాళ్ళ డబ్బులకోసం వాళ్ళు నానా అబ ద్ధాలు చెపతారు. అవన్నీ నిజమని నమ్మితే యట్ట? మీరు వెళ్ళకపోతే వాడు చెప్పే వాడా? ముందు వాడి దగ్గరకి వెళ్ళటం మన తప్పు! వెళ్ళిన తరువాత వాడి నోటికి వచ్చిన మాటలు వాడు చెపతాడుగా? "

"ఇంగిలీసు వైద్యుడు దగ్గరకిపోతే వేలకి వేలు కర్చవుతయి అన్నార్రా! అంత డబ్బు మనం బరాయించొద్దూ? అసలే లేమిడిలో వుంటిమి! ఊళ్ళో జనం కూడా ఈ వైద్యుడి దగ్గరకే పో తక్కువ డబ్బుతో పనయిద్ది అన్నారు. మనం డబ్బు దగ్గిర, యెనకాడే ఈడి దగ్గరకి పోయాం! ఈడు చివరకి అంతకి అంత డబ్బుకాజేసి కూడా బిడ్డని

అవిటిదాన్ని చేసాడు!" అన్నాడు నాసరయ్య.

"ఆడపిల్ల. ఇప్పుడు కాకపోతే తరువాతైనా ఒక అయ్య చేతిలో పెట్టి వాళ్ళ ఇంటికి సాగనంపాలి! రేపు మనం పెళ్ళి చేయా లంటే గబక్కన ఎవరైనా అవిటిది అనే మాట అంటారు కదా!"

"నిజమే, అంటారు. అయితే మనం చేసే దేముంది? అయినా మొగపిల్లోడా కాయ కష్టం చేయాలీ, కాలూచెయ్యీ సక్రమంగా వుండాలీ అనుకోడానికీ!"

"అదేంది మామా అట్టంటావు? మగపిల్ల లేనా కాయకష్టం చేసేదీ, ఆడపిల్లలు చేయరూ? నిజానికి మగోళ్లకంటే ఆడోళ్లే ఎక్కువ చాకిరీ చేస్తన్నారంట! ఆడవాళ్ళు చేసేదాంట్లో మూడొంతుల చాకిరేనంట మొగోళ్లు చేయడం! మొన్న పేపర్లో యేశారు!"

"మొగోళ్లు చాకిరీ చెయ్యటం లేదంటనా?"

"చాకిరీ చేసినా, కష్టం చేసినా, ఏది చేసినా చేయకపోయినా మనిషన్న తరువాత కాలూచెయ్యీ సక్రమంగా వుండాలి కదమామా? "

"నిజమే, కానీ మనం ఏం చేద్దాం? పొరపాటు జరిగిపోయింది"

"పొరపాటు అనవాకు మామా! పొరపాటు ఏముంది? మీరు కావాలనే చేశారు. డబ్బు దగ్గిర ఎనకాడే ఈ నాటు వైద్యుడి దగ్గరకి తీసకపొయ్యాం అంటున్నావుగా నువ్వే! ఆడపిల్లనే నిర్లక్ష్యంతోనే డబ్బు దగ్గర లెక్కచూసుకుని, ఆ నాటు వైద్యుడి దగ్గరకి తీసుకపోయి సుశీలని అవిటిదాన్ని చేశారు. అదే మగపిల్లోడికి జరిగితే మీరు ఇట్ట చేసే వాళ్లా? "

"ఏమో, అప్పుడు ఎట్టుండేదో! అసలు ఆడపిల్లలకీ, మగపిల్లలకీ సాపత్యం ఏందిరా? మగపిల్లోడంటే మగపిల్లోడే! రేపు మనం చచ్చినా తల కొరివి పెట్టేది మగపిల్లోడేకానీ, ఆడపిల్ల వచ్చి పెట్టిద్దేంది? మగపిల్లోడంటే వంశాన్ని నిలబెట్టేవాడాయె! ఆడపిల్లలు ఏముంది, పెళ్లి చేసిన తరువాత అత్తగారింటికి పొయ్యేవాళ్లేగా! మనకి వున్నదాంటోనే మంచి మనువు చూసి వాళ్లకి పెళ్లి చేయడమే మనధర్మం! తరువాత వాళ్లు ఎవురో మనం ఎవురమో! ఎప్పుడైనా వాళ్లు వస్తే మనం ఒకపూట తిండి పెడతాం, మనం ఎప్పుడైనా పోతే వాళ్లు ఒక పూట తిండిపెడతారు!"

"మా బాగా చెప్పావు మామా! మగపిల్లోడయితేనే బాగుంటుందంటావు, రేపు పెళ్లయిన తరువాత తన్ని తలకిపోయడానికి"

"పెళ్లయ్యిందాకా ఎందుకురా అబ్బాయి, మనోడు ఇప్పుడే తన్ని తలకి పోసేటట్టున్నాడు. మాట మాట్టాడితే డియ్యమని కయ్యానికి లేస్తాడనుకో! ఇప్పుడే వీడితోటి యాగలేకపోతన్నాం! రేపు పెళ్లి అయిన తరువాత మమ్మల్ని ఇంటో కూడా వుంచడు!" మురిపెంగా కొడుకు వైపు చూస్తూ ముసిముసి నవ్వులతో సంతోషంగా అంది రాగమ్మ.

"నా సంగతెరగవు... కొట్టేనంటేనా..." అన్నాడు నాగార్జున.

"అదేరా నేననేది, ఈడు ఇప్పుడే కొట్టేటట్టు వున్నాడనీ'

"ఎహెపో" అని నాగార్జున బజారుకి వెళ్లిపోయాడు.

"ఇప్పుడు పెద్ద డాక్టరు దగ్గరకి పిల్లని తీసుకుపోతే కాలు ఎప్పటి మాదిరిగా నడిచేటట్టు చేస్తాడంటబ్బాయి? ఐదారు వందలు ఖర్చయితే అయినయి, కాలి వంకర సరిచేస్తాడూ? " రాగమ్మ అడిగింది.

"ఏమో చెప్పలేం అక్కాయ్! కాలు విరిగి దాదాపు మూడు నాలుగు నెల్లాయె! ఆపరేషనో, ఏదన్నానో చేసో మామూలుగా చేస్తారేమో! తీసకపోయి చూపెట్టండి. చూపెడితే





ఏం చెపుతారో తెలిసిద్దిగా!"

"ఆ నాటు వైద్యుడు కట్లు వూడతీసిన తరువాత సుశీల కాలు అపటుగా వేస్తుంటే, ఎముకలకి సంబంధించిన పెద్ద వైద్యుడి దగ్గరకి తీసుకుపోయి చూపెట్టమని వూళ్లో ఇద్దరు ముగ్గురు చెప్పారు. అయితే అప్పటికే చాలా డబ్బు కర్చయిపోయింది. ఇంక చేతిలో డబ్బు మెసలక తీసకపోయి చూపెట్టలేదు!" నాసరయ్య అన్నాడు.

"ముచ్చటగా నడిచే పిల్ల! అసలు నిజంగా ఈ ముండ నడవడం కూడా తక్కువేనబ్బాయి! ఎప్పుడూ పరిగెత్తిందే పరిగెత్తడం, లగెత్తిందే లగెత్తడం! కాలు మాత్రం ఒక చోట ఒక నిముషంనిలవదు. కాలు వంకరగా వేస్తుంటే చూడలేకపోతున్నాను. పట్టణం తీసుకపోయి పెద్ద డాక్టరుకి చూపెడదాం!" అంది రాగమ్మ.

"చూపెట్టడమే మంచిదక్కాయి!" అన్నాడు రాఘవులు.

రెండు రోజులు వుండి అతను వాళ్ల వూరు వెళ్లిపోయాడు.

సుశీలని పట్టణం తీసుకుపోయి పెద్ద డాక్టర్‌కి చూపెట్టాలనుకున్న రాగమ్మ కోరిక కోరికగానే మిగిలిపోయింది. కనీసం ప్రయత్నం కూడా చేయలేదు.

తమ్ముడితో మాటవరసకి అయితే అన్నది గానీ, గట్టిగా తీసుకుపోయి చూపెట్టాలనే బలమైన కోరిక కూడా ఆమెకిలేదు.

నాలుగురోజుల తరువాత ఒకరోజు సుశీల అడగనే అడిగింది. "అమ్మా... అప్పుడు మామయ్యతోటి పట్టణం తీసుకుపోయి పెద్ద డాక్టరుకి చూపెడతానంటివి కదమ్మా! పోదామే, నేను డాక్టరు దగ్గిర చూపెట్టుకుంటానే!"

"ఇంక ఎందుకు లేవే? నడుస్తున్నావుగా ఎట్టోకట్ట! ఇప్పుడు వెళ్లినా ఏం లాభం? కాలు విరిగి చాలా రోజులు జరిగిపోయా! ఇప్పుడు చూసినా ఆ డాక్టరు మాత్రం ఏం చేస్తాడు? మొదట్లోనే తీసుకుపోయినట్లయితే ఎట్టుండేదో! ఇప్పుడు పోయి చూపెట్టుకున్నా ఏం లాభంలెద్దూ!" అంది రాగమ్మ.

సుశీల పది రోజులు పెద్ద డాక్టరు దగ్గరకి తీసుకుపొమ్మని బతిమలాడింది. ఏడ్చింది. పదేపదే అడిగింది. అయితే తండ్రి తిరస్కరించాడు. తల్లి ఆ వూసే ఎత్తకపోవడం, తను అడుగుతున్నా కోప్పడుతుండటంతో ఇక తనకి చూపెట్టరనీ, అడిగినా వుపయోగం లేదని తెలిసికొని అడగడం మానుకుంది.

★ ★ ★

సుశీలకి ప్రమాదం జరిగి ఆరు నెలలు గడచిపోయింది. ఇప్పుడు సుశీల కొద్దిగా కుంటుతూనే ఇంట్లో పనులు అన్నీ చేస్తోంది.

ప్రమాదం జరిగిన మొదట్లో దాదాపు 3 నెలల వరకూ సుశీలని అభిమానంగానే చూశారు. ఆప్యాయత కనపరచారు. సుశీల మీద అనురాగం వెల్లివిరిసింది.

ఆ ఇంట్లో ఎప్పుడూ మగవాళ్లని ప్రత్యేక శ్రద్ధతో చూస్తారు. ఉన్నది ఇద్దరు మగవాళ్లు నాసరయ్యా, నాగార్జునా! ఇద్దరూ ఇంట్లో పని బొత్తిగా చేయరు. నాసరయ్య కూలికి వెళ్లకుండా వుండే రోజులు తక్కువ. ఇంటి దగ్గర వున్న రోజు అయినా ఇంటిపని మాత్రం చేయడు. ఇక నాగార్జున అయితే కనీసం కుండలోనించి మంచినీళ్లు కూడా తీసుకోడు. ఎవరయినా ఇవ్వాల్సిందే! అతనికి అంత బద్ధకం!

మగవాళ్లకి ప్రత్యేకమైన తిండి కూడా!

ఆ ఉన్నదాంట్లోనే మగవాళ్లు ప్రత్యేకమైన సౌకర్యాలతో, అతిథి మర్యాదలతో, అదనపు మన్ననలతో ఎలాంటి వైభోగం అనుభవిస్తారో, వాళ్లకి ఎలాంటి రిజర్వేషన్స్



వున్నాయో సుశీల కూడా దాదాపు 3 నెలలు అలాంటి వైభోగమే అనుభవించింది. ఆ ఇంట్లో మగవాళ్ల జీవితపర్యంతం అనుభవించే సౌఖ్యాన్ని సుశీల 3 నెలలపాటు అనుభవించింది.

ఇప్పుడు సుశీల ప్రమాదం పాతదైపోయింది. సుశీల పరిస్థితి మామూలైపోయింది. ఒకరకంగా గతంలోకంటే కూడా హీనమైపోయింది.

ప్రమాదం జరగడానికి ముందు సుశీలచేసిన ఇంటిపనులు అన్నీ మళ్లీ మామూలుగానే చేయాల్సి వస్తోంది. కుంటుకుంటూనే వెళ్లి పుల్లలు ఏరుకురావడం, ఇంట్లో అంట్లు తోమడం, చిమ్మడం, కళ్లాపి చల్లడం, చేతనై చేతగాక వంటచేయడం, చెరువుకి వెళ్లి బట్టలు వుతుక్కురావడం లాంటి పనులు అన్నీ సుశీల చేతుల మీదుగానే జరిగిపోతున్నాయి.

ఇంతకుముందు కోపం వచ్చినప్పుడు సుశాయ్ అని పిలిచేవాళ్లు ఇప్పుడు సుశాయ్ పోయి కొత్త బిరుదు వచ్చింది. సుశీల చెప్పినపని చేయనప్పుడో, కోపం వచ్చినప్పుడో కుంటిముండా అని పిలుస్తున్నారు. కోపంలో కుంటిది అని పిలవడం ఆ ఇంట్లో అందరికీ అలవాటైపోయింది.

తిట్లూ, దెబ్బలూ, తన్నులూ, సాధింపులూ అన్నీ సాధారణమైపోయాయి. ఎప్పుడైనా సుశీల ఒకపూట ఏదైనా చిన్నపని చేయడానికి బద్ధకిస్తే ఇక ఆరోజంతా రాగమ్మ ఆలపించే తిట్ల పురాణాన్ని ఆలకించాల్సిందే. ఆమె కోపం శృతిమించినప్పుడు దెబ్బలకి సుశీల వళ్లు అప్పగించాల్సిందే!

★ ★ ★

"సుశీలా... నారమ్మ వచ్చిపోయిందే! పెసరచేలో కలుపు వుందంట. ఇద్దరు మడుసుల్ని రమ్మంది. మేం ఇద్దరం వస్తామని చెప్పా! తొందరగా కానీయ్, పోదాం" అంది రాగమ్మ ఒకరోజు.

"నారమ్మ ఎవురే? "

"సుబ్బన్నగారి నారమ్మ"

"వాళ్లకి చాలాపొలం వుందికదే! ఏ పొలంలోనంట కలుపు? "

"ఉత్తరప్పొలానంట! ఏగదాల పొలిమేర చేను"

"అమ్మో పొలిమెర చేనే! చాలా దూరం కదే! అంతదూరం నేను నడవలేనమ్మా!"

"అట్టంటే యట్టమ్మా? నువ్వు ఇంటి దగ్గరకొద్దిగా పెందలాడి బయలుదేరిపోతే చేలోకి కూలోళ్లతోపాటు చేరుకుంటావు. సందకాడ ఇంటికి వచ్చేటప్పుడు ఒక అడుగు పెందలాడి లేచిరా! నిన్ను ఎవురేమంటారు? నారమ్మ మంచి మడిసి, ఏం అనేది కూడా కాదు"

"అంటారని కాదమ్మా! వాళ్ల పొలం ఇక్కడుందీ? ఎంత దూరం... నేను అంత దూరం నడవలేనమ్మా!"

"నడవలేనంటే యట్టే? రేపు దసరా పండగ వస్తంది. పండక్కి నీకు గుడ్డలు తీసుకోవాలా, పనిలేదా? నీకేకాదు, ఇంటో ఎవురికీ గుడ్డలు లేవు. అందరికీ చినిగిపోయినయి. ఇంటెల్లపాదికీ గుడ్డలు తీసుకోవాలి. గుడ్డలనీ, గోచీలనీ, గారెలనీ, బూరెలనీ పండక్కి ఎంతలేదనుకున్నా ఆరేడు వందలు కర్చవుతయి"

"అయితే ఏం చేయమంటావేంది నువ్వు? "

"చేసేదేందే? నువ్వు కూడా కూలికి వస్తే రూపాయికి రూపాయి కూడతయి. మీ అయ్యకి కూడా రెండు మూడు వందలు కూలి డబ్బులు రావాల్సి వస్తయ్యి! ఎట్టోకట్ట పండగ కర్చు యల్లబారిపోతే తరువాత యవారం తరవాత"

"నేను అంత దూరం నడవలేనంటంటే ఏందమ్మా నువ్వా..."




"నడుస్తావులే, ఎందుకు నడవలేవు? గాచెద్దు మాదిరిగా వూరంతా తిరిగిరావ టంలా? ఊరంతా పొద్దుట్నించీ సందకాడ దాకా తిరిగిన దానికంటే ఎక్కువ దూరం వుందేంది వాళ్ల పొలం? "

"పోమ్మో... ఎవురొస్తారో? "

"చెప్పినట్టు విను, ఎందుకు పెడర్ధరంగా వూరేగుతావు? నేను టిపినీలో అన్నం పెట్టుకుని వస్తాకానీ నువ్వుపద. నువ్వు అక్కడ విరగబడి చేసేదేం లేదు. నువ్వు చేలోకిపోయి సాల్లో కూసుంటే నీ మునుం కూడా నేను లాగుతాలే కలుపు. నువ్వు వూరక మునుంలో లెక్కకేలే! నువ్వు సాలు పట్టుకుని నీకు చేతనయినంత మట్టుకి తియ్యి, చాలు. మిగతాది నేను లాగుతా!"

"అన్నాయ్‌ని కూడా రమ్మను. పండగ సెలవలంట, వాడికి బడిలేదుగా!"

"వాడికి పరీచ్చలో ఏవో వున్నయ్యిలేవే! చదువుకోవాలంట, వాడితోటి ఎందుకు? "

"ఏం పరిచ్చలమ్మా వాడికి? ఏందీ వాడు చదివేది? పొద్దుగూకులూ గోలీకాయల ఆటలేనంట, ఏందో చదువుతున్నాడంట! వాడ్ని కూడా రమ్మను కూలికి. వాడు వస్తే నేనూ వస్తా!"

"వాడితోటి నీకు వంతు ఎందుకే? వాడు చదువుకుంటన్నాడు, నువ్వు ఏం చేస్తన్నా? తన్నులు తినకుండా పద! నీ డబ్బులు పెట్టి నీకే గుడ్డలు కుట్టిస్తాలే, నీ డబ్బులు ఇంటోకి ఏం వద్దు"

"నాకు గుడ్డలేం వద్దులే"

"గుడ్డలు లేకుండా మొండి మొలన వూరే గుతావా ఏంది? "

"ఆ వూరేగుతా కూడా!"

"వూరేగుతావు, నువ్వెందుకు వూరేగవు? పండక్కి అందరూ కొత్తగుడ్డలు తొడుక్కుని తిరుగుతుంటే, నువ్వు పాతగుడ్డలతోటి తిరు గుతా నాకు మమ్మా, మయ్యా గుడ్డలు కొని పెట్టలేదని అందరిచేతా అనిపించాలేంది? కానిచ్చి తొందరగా కూడువేసుకుని తిని బయల్దేరు. వేళవతంది. మళ్లీ ఎండబడిపో యిద్ది!"

"వాడు మాత్రం వూళ్లో ఆడుకోవాలీ, నేను కూలికి వచ్చి చాకిరీ చేయాలీ! ఎప్పుడూ నీ బుద్ధి ఇంతేలే కుక్కబుద్ధి!"

"ఏమేయ్, వళ్లు కొవ్వెక్కి మదం పట్టి కొట్టుకుంటన్నావో! నా సంగతెరగవు, గెంటె కాలేసి నాలికమీద వాతపెడతా! కుక్క బుద్ధేందే? "

"లేకపోతే అందర్నీ నువ్వు ఒకటిగా ఎప్పుడు చూశా? "

"నాపసాని మాటలు మాట్లాడవాకు! నేనూ, మీ అయ్యా కోడి కూసినప్పట్నించీ, అర్ధమరేత్రిదాకా చాకిరీ చేస్తన్నామంటే ఎవు రికోసమే? మీ కోసంకదూ! నిన్ను రోజూ కూలికి రమ్మంటున్నామా? ఈ పండగ నాల్రోజులూరా! పండగెల్లిన తరువాత నువ్వు వచ్చినా, రాకపోయినా మా తంటాలు మేం పడతాం!" అంది రాగమ్మ చిరునవ్వుతో, కూతురు ముందు కూలికి రానని మొరాయించినా చివరకి తన మాటలు విని భయంతోనో, భక్తితోనో మొత్తానికి వస్తున్నందుకు ఆనందంగా, అభి మానపూర్వకంగా చూస్తూ.

★ ★ ★

దసరా పండుగ వచ్చింది.

పండుగకి ఇంట్లో అందరికీ బట్టలు తీసు కున్నారు. అందరికీ జత బట్టలుతీసుకుంటే, నాగార్జున ఒక్కడికి మాత్రం రెండు జతల బట్టలు. అంటే రెండు చొక్కాలూ, రెండు ప్యాంట్లూ! వాళ్లు తీసుకున్న బట్టలు అన్నీ తక్కువ రకానివే అయినా, ఆడపిల్లల బట్ట లతో పోలిస్తే నాగార్జున బట్టల ఖరీదు ఎక్కువ.

పండుగ రోజు ప్రొద్దుటే నిద్రపోతున్న

సుశీలని లేపింది రాగమ్మ.

"సుశీలా... నువ్వు పడమర పొలాన వాగులకల్లో, జామాయిలు తోటల కల్లో పోయి కాసిని కట్టెపుల్లలు ఏరుకుని రావాలే! నీకు పండగ చేసి పెడతాను. మబ్బులేచింది. వాన వచ్చిద్దేమొ! తొందరగా పోయి రావాలి!"

"ఏందమ్మా, నేను కట్టెపుల్లలకి పోవాలీ? అయ్య ఎక్కడికి పోయాడేంది, పండగపూట కూడా..."

"మీ అయ్య ఇంటికాడ వుండేవోడేనే! నారాయణ వచ్చి బతిమలాడి పిలుచుకుని పోయాడు. నాలుగు రోజులనాడు వేరుశనగ పీకారంట! కాయలు ఎండిన తరువాత కోపిద్దామని ఆగేరంట! ఇయ్యాల మబ్బు లేచింది. అసలే చిత్తకార్తాయె! ముసురుపట్టి నాలుగు రోజులు వానపడితే నోటికాడికొచ్చిన పంట పాడైపోయిద్దని, వేరుశనగ కంపని గూళ్లు పెట్టించటానికని తీసకపోయాడు. మీ అయ్య దానంటే రానన్నాడు. అయినా యిడిచిపెట్టకుండా తగులుకున్నాడు. మీ అయ్య వున్నట్టయితే ఎవురోకరివామి దగ్గరకిపోయి ఒక మోపు పుల్లలు తీసుకొచ్చేవాడే!" సంజాయిషీ మాదిరిగా చెప్పింది రాగమ్మ.

"పొద్దున్నే నేను ఎక్కడ చచ్చేదే?"

పోయి రామ్మా, మమ్మవికదూ! ఇయ్యాల నీకు ఇష్టమైనవి చేస్తా! నీకు అందరికంటే ఎక్కువ మరిన్ని పెడతా! పుల్లలు లేకపోతే నన్ను ఏం చేయమంటా చెప్పు?"

"మబ్బుచూడు ఎట్టలేచిందో... నల్లగా చీకట్లు కమ్ముతున్నాయి. వానవస్తే తడిసి పోతానుకదే!"

"వానా రాదూ,పాడూ రాదు! ఎంతసేపుట్లో పోయొస్తా! ఈ ఇంట్లో మగగుంపేమొ పొయ్యి మీదకు తెచ్చిపడేసినా, పొయ్యి కింద యవారం పట్టిచ్చుకోక పోతంట్రి! ఎంతకాలం ఆడోళ్లమి చద్దాం? లచ్చుమ్మ మొగుడు ఎంకటేశులు చూడు, పనులులేని ఎండాకాలం రోజుల్లో బండి అడివి తమ్మకట్టెలు కొట్టుకొచ్చి పడేశాడు. మీ అయ్య ఏమో ఎప్పుడన్నా రెండు మోపులు కట్టెలు కొట్టుకుని రావడానికి అల్లాడిపోతాడు" మనసులో భర్తమీదా, ఇంట్లో పుల్లలు కూడా లేని పరిస్థితి మీదా అణిగిపోయి వున్న కోపాన్ని వెళ్లగక్కుతూ అంది రాగమ్మ.

"అప్పుడప్పుడూ తెస్తాడు కదే అయ్య?"

"ఏం తీసకరావటం? నెలకోసారి ఎప్పుడన్నా నాలుగు మోపులు తెస్తే సరిపోయిద్దీ? ఎప్పుడూ కూలీకూలీ అని కూలి చూసుకుంటాడుకానీ, ఒకరోజు కూలి మానుకుని ఏడెనిమిది మోపులు కట్టెలు కొట్టుకొస్తే నెల రోజులన్నా పోతయికదా? ముసురులోనో, ఇరుకూ ఇబ్బందయితే తప్ప ఎప్పుడూ నువ్వు ఏయో పుల్లలు ఏరుకొనో, కొట్టుకునో తెస్తానే వుంటివి! నువ్వు తెచ్చేయ్యే సరిపోతండే, ఇంకేందమ్మా మీ అయ్య తెచ్చేదీ? నువ్వు ఇయ్యాల్టికి ఒక్కరోజుకి పోయిరామ్మా..." బతిమలాడుతూ అంది రాగమ్మ.

"పోయొస్తాలే, నాకు తప్పిద్దీ? మోపుకట్టకోటానికి తాడు ఎక్కడుంది?"

"మమ్మ మంచిదమ్మా, చెప్పినమాట వినిద్ది! మా బంగారు తల్లి! ఇయ్యాల నీకు ఏం ఇష్టమొ చెప్పు, చేసిపెడతా! నీకు మరిన్ని పెడతాలే!"

"నాకు ఏం సుత్తి వెయ్యవాకులే! నీకు నీ కొడుకు ఇష్టమవుతాడుకానీ నేను ఎందుకు ఇష్టమవుతానేంది?"

"నువ్వు కూతురివికదంటే!" నవ్వుతూ అంది రాగమ్మ.

"నిన్ను వుద్ధరించి తీసకపోయి వాగులో పెడతాడని. కొడుకు మీద వుండే బెమ కూతుళ్లమీద ఎందుకు వుందిలే? పండక్కి




ఎక్కువ కరీదు పెట్టి వాడికి రెండు జతల గుడ్డలు తీసుకుంటివీ, నాకూ, గంగమ్మకేమొ ఒక్క జత తీసుకుంటివీ! ఇక్కడ తెలియ డంలా నీకు వాడి మీద వుండేబెమ!"

"కాదులేవే..."

"ఏం కాదూ... నాకు వచ్చిన కూలి డబ్బులు పెట్టే నువ్వు తీసుకున్నావుకానీ, నీ డబ్బులు పెట్టి ఏం తీసుకున్నా?"

"కానియ్యవే, గుడ్డల ధరలు మండిపో తండే! మీ పిల్లల ముగ్గురికీ ఎక్కువకి పోకుండా ఒక్క జత తీసుకుంటేనే ఐదొం దలు అయినయ్యి, ఇంక ఏం తీసుకో మ్మంటా?"

"ఐదొందలు అయినయ్యా? అబ్బ, ఎన్ని డబ్బులు అయినయ్యమ్మా? అందులో మూడొందలు వాడి ఒక్కడి గుడ్డలకే పొయ్యా! నాకూ, గంగమ్మకీ కలిపి రెండొం దలు కూడా కాలేదుగా!"

"కుంటికులాసం... నా ఒక్కడియ్యే మూడొందల నలపై అయినయ్యే! నియ్యా, గంగమ్మయ్యా కలిపి నూట అరవై రూపా యలే! మీ ముకాలకి అంతమట్టుకి చాల్లే!" మంచం మీద పడుకుని నిద్రపోతున్న నాగా ర్జున లేచి అన్నాడు.

"కుంటికులాసం ఏందిరా? ఇంటో వాడివి నువ్వు అంటే బయటోళ్లు కూడా అనరూ? ఆ ముండకి పేరేలేదా ఏంది, ముచ్చటగా సుశీల అని పిలవక..." రాగమ్మ గారా బంగా, ముద్దుగా కొడుకుని మందలించింది.

నల్లగా మేఘాలు కమ్ముకుని, వర్షం వచ్చే సూచనలు వున్న ఆ సమయంలో పుల్లలకి పోతున్న కూతురిమీద తల్లికి ప్రేమ వుప్పొంగింది.

"అవి మాత్రం మాకు ఎందుకమ్మా? నువ్వు గుడ్డలు కొనిపెట్టకపోతే కొనిపెట్టలే దని ఎవురు ఏడిశారు? ఆ డబ్బులు కూడా పెట్టి వాడికే తీసుకోకపోయా!"

"ఉత్తదేలేవేయ్ వాడి మాటలు నమ్మ వాకు! నువ్వు వూరుకోరా పోసుకోలోడా..."

"వాడి మాటల్లో అబద్దం ఏం వుందేంది? నువ్వుఅయ్యకి చెపతంటే నేను యినలా, వాడికి మూడొందలూ, మాకు రెండొందలూ అయినయ్యని... వాడు ఇంకొద్దిగా కలిపి నిజం చెప్పాడూ! అంతేగా?"

"ఈసారి పండక్కి నీకు కరీదు ఎక్కువ పెట్టి మంచియ్యి తీసుకుంటాలేవే!"

"ఈ పండక్కి తీసుకున్నావూ, ఈసారి పండక్కి కొరవాదరవా తీసుకుంటావు!"

"వాదన ఎందుగ్గానీ, నువ్వు పుల్లలకి పోయిరా" అంది రాగమ్మ.

సుశీల తాడు తీసుకుని పుల్లలకి వెళ్లింది.

★ ★ ★

ఆరోజు ఊళ్ళో అందరికీ దసరా పండుగే కానీ సుశీలకి మాత్రం పండుగకాదు ఎండుగే!

అందరూ తలంటు స్నానంచేసి, పిండివం టలు తిని, కొత్త బట్టలు తొడుక్కుని, ఉత్సా హంగా, సంతోషంగా దేవాలయం వద్దకు వెళుతున్నారు.

దేవాలయం ముందు వున్న విశాలమైన స్థలంలో తెలుగుదేశం పార్టీకి చెందినవాళ్ళు కోలాటం వేస్తున్నారు. వాళ్లకి కొంతదూ రంలో కాంగ్రెస్ పార్టీవాళ్లు ఎక్కడినించో తెప్పించిన భజన బృందం వాళ్ళతో భజ నలు చేయిస్తున్నారు. ఇంకోవైపు కమ్యూని స్టుపార్టీ వాళ్ళు రికార్డు డ్యాన్సు ఏర్పాటుచే సారు. జనం అక్కడ కొద్దిసేపూ, ఇక్కడ కొద్దిసేపూ చూస్తూ మూడు చోట్లకీ గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు.

మధ్యాహ్నం ఒంటిగంటా, రెండు గంటల ప్రాంతంలో ఈ కార్యక్రమాలు ప్రారంభ మైతే సాయంత్రం ఐదుగంటలకు ముగు స్తాయి. ఐదు గంటల సమయంలో జనం



కర్రలూ, కత్తులూ, కటార్లూ, ఈటెలూ, బరిసెలూ, విల్లంబులూ చేతబూని పెద్దపెద్దగా లయబద్ధంగా అరుస్తూ, దేవుడి విగ్రహాల్ని వూరేగిస్తూ పార్వేటకు మైలు దూరంలో వున్న జమ్మిచెట్టు వద్దకు వెళతారు. అక్కడ మేకపోతుని బలి ఇస్తారు.

ప్రతి ఏడూ ఆ వూరిలో దసరా పండుగని ఇతర పండుగలు అన్నిటికంటే ఆనందంగా, ఒక సంబరంగా చేసుకుంటారు.

ఉద్యోగాలరీత్యానో, వ్యాపారాల రీత్యానో ఎంతో దూరంలో నివశిస్తున్న వాళ్ళు కూడా ఆ పండుగకి తప్పనిసరిగా వూరికి వస్తుంటారు.

నాగార్జున తలంటు స్నానంచేసి, కడుపు నిండా చేసిన పిండివంటలు తిని, కొత్తగా కుట్టించిన ప్యాంటూ, షర్టూ తొడుక్కుని, టక్‌చేసి దేవాలయం వద్దకు వెళ్ళాడు.

సుశీలకి కూడా తొందరగా ఆ సంబరం వద్దకు వెళ్ళాలని వుంది.

అయితే ఇంట్లోపని ఎంతకీ పూర్తిగావడం లేదు. ఉదయమే లేచి పుల్లలు తీసుకురావడానికి వెళ్లింది. తరువాత ఇల్లు అలుక్కోవడానికి పేడకోసం ఒకగంట సేపు తిరిగింది. నీళ్ళు తీసుకువచ్చింది. అంట్లు తోమింది. అప్పటికే తల్లితో ఒక వరుస యుద్ధం అయింది.

అంతకు ముందు రోజు కూడా రాగమ్మ కూలిపనికి వెళ్లింది.

ఇల్లు అలుక్కోవడం, తలంట్లు, పిండివంటలకోసం రోట్లో బియ్యం పోసి కొట్టుకోవడం, రుబ్బుకోవడం, ఆ పిండివంటలు తయారు చేయడం ఇలాంటి పనులు అన్నీ ఒకేరోజు చేయాల్సిరావడంతో రాగమ్మకి పని ఎక్కువైపోయింది. ఒకవైపు పనిచేస్తుంటే, మరోవైపు పిల్లలు తొందర చేస్తుండటంతో పనికి విసుగుతోడైంది.

"సుశీలా... కొద్దిగా పొయ్యి కింద మంట పెట్టవే, అంతలోకి నేను ఈ పిండి కలుపుకుంటాను" అంది రాగమ్మ, పిండి కలుపుకుంటూ.

"ఊళ్ళో పిల్లలు అందరూ కొత్త గుడ్డలు తొడుక్కుని సంబరం కాడికి పొయ్యారు. నేను సంబరం కాడికి పొయ్యేపనిలేదా ఏంది? "

"పోదువులే, కానియ్యావే గుంటా! అన్ని పనులూ ఒక్కదాన్ని ఎందాక చేసి చచ్చేది? "

"చేసుకుంటే చేసుకో, లేకపోతే మానుకో, నిన్ను ఎవుడు చేయమన్నాడేంది? పొద్దుట్నించీ నేను చేయడం లేదెట్టా? నేనేం వూరక కూర్చోలేదులే!"

"ఎదురు వాక్కుండా చెప్పినపనిచెయ్యి"

"నేనేం చెయ్యను. నేను తలకి పోసుకుని, కొత్త గుడ్డలు తొడుక్కుని గుడి దగ్గరికి పోతా. మళ్ళీ సంబరం అయిపోయిద్ది"

"అప్పుడే అయిపోదులే, పొయ్యి దగ్గిరకూర్చోవే"

"నేను కూర్చోను. మజ్జెన్నం నాచేత నీళ్ళు తెప్పిచ్చులా? అప్పుడు డాక్టరు ఏమని చెప్పాడూ, బరువు పనులు చేయించొద్దని చెప్పలా? మజ్జెన్నం అన్నాయ్ చేత కనీసం నీళ్ళన్నా తెప్పిచ్చుకూడదూ? వాడు అరగిపోతాడూ? "

"నీకు కోటిసార్లు చెప్పా, మగపిల్లోడు, వాడితోటి నీకు వంతు ఎందుకే అని? "

"ఎందుకు వంతు వుండకూడదు? వాడు సంబరం చూడాలీ, నేను చూడకూడదా? ఊళ్ళో పిల్లలుచూడు, ఒక్కరు వున్నారేమో ఇంటికాడ, ఎంతమంది పొయ్యారో సంబరం దగ్గరికి! ఆడోళ్ళు కూడా అందరూ పోయారు"

"ఇంటో నలుగురు ఆడోళ్ళు వున్నోళ్ళు తొందరగా పనులు చేసుకుని పోతారే, మనకి ఎట్టా కుదిరిద్ది? పండగలంటే అయ్యి




మొగోళ్ళకి కానీ ఆడోళ్లకి పండగలా? వండుకునీ, వార్చుకునీ, అలుక్కునీ, చిమ్ము కునేసరికి సరిపోయా! ఇంకెక్కడి పండ గలే?"

"నా కొత్త గుడ్డలు ఎక్కడున్నయ్యి? రెండు చెంబులు నీళ్ళు పైన పోసుకుని సంబరం దగ్గరికి పోతా!"

"ఒసేయ్ కుంటిదానా... నీకు రెండోకాలు కూడా ఇరక్కొడితేనే మాట ఇంటావే! పొయ్యారిపోతంది మంటపెట్టవే అని గంట సేపట్నించీ అరుస్తంటే నీలుగుతున్నావే మేయ్, నీలిగినా! నా సంగతెరగవు, ఆ సరిగా వున్న కాలు కూడా ఇరగతీసి పొయ్యిలో పెడతా, పీడా వదిలిపోతావు. కూర్చో ముందు పొయ్యి కాడ" పిండి కలు పుతున్న రాగమ్మ బాగా కోపంతో కళ్ళు వురిమి అంది.

సుశీల ఇక తప్పదన్నట్లు పొయ్యి దగ్గిర కూర్చుంది.

"నేనే పుల్లలు తీసకరావాలీ, నేనే నీళ్ళు తీసకరావాలీ, వాడు మాత్రం..." అని నసుగుతోంది.

"చత్ నోర్ముయ్, ఇంకోసారి వాడి వూసు ఎత్తావంటే నోటిమీద వాతలు పెడతా! కుంటిముండా... నీకాలు విరక్కొట్టుకున్న ప్పుడు పది వందల రూపాయలు కర్చయి నయి. మొన్నటిదాకా పందెపు ఎద్దుని మేపి నట్టు మేపాం. దున్న తిన్నట్టు తిని వెళ్ళ గక్కితివే. ఇకా వాడి ప్రస్తావన తెస్తావెం దుకే?"

"నాకని తెచ్చినయ్యి వాడు తినలేదట్టా?" సుశీల అంది.

రాగమ్మ ఏంమాట్లాడకుండా పనిలో నిమ గ్నమయిపోయింది.



దసరా పండుగరోజు రాత్రి తెలికపాటి జల్లులు పడ్డాయి. మరుసటి రోజునించీ ముసురు పట్టింది.

ఆరోజు పట్టిన ముసురు 20 రోజుల వరకూ వదల్లేదు. ప్రతీరోజూ, రోజుమార్చి రోజూ వానలు కురిసాయి.

పొలాల్లో కలుపు పెరిగిపోయింది.

అంతకుముందు 12 రూపాయలు వున్న కూలిరేటు, ఒక్కసారిగా 20 రూపాయలకు పెరిగింది. కూలీలకు మహావత్తిడిగావుంది.

పాలుమరచి, నడక నేర్చుకున్న బుడిబుడి నడకల బుడుగుల్ని కూడా కలుపులకి తల్లులు తీసుకుపోతున్నారు.

"సుశీలా... నాలుగు రోజులు కలుపుకి రావాలే! ఇరవై రూపాయలంటున్నారుకూలి. ఏముంది, ఐదు రోజులు పోతే వందరూపా యలు వస్తయ్యి! బంగారమసుంటికూలి. ఇలాంటి వత్తిడిలోనేనే మనకి డబ్బులు మిగిలేది. నాలుగు రోజులు రావే" రాగమ్మ కూతుర్ని బ్రతిమాలింది.

"నేనెక్కడ వచ్చేదే? వచ్చినా నేనేం చేస్తాను?"

"నీకేమే! నడవలేని పసిపిల్లల్ని కూడా ఎత్తుకుని తీసకపోయి మునుముల్లో కూసో పెడతన్నారు! పనిచేస్తన్నారా, పెడత న్నారా? లెక్కకే వాళ్ళు! వత్తిడి అట్టుంది! నీకేమే, నీ అంతోళ్ళు వస్తే అసలు ఎవురే మంటారు?"

"నడిస్తే కాలు నొప్పి పుట్టిద్దే! నేను రానమ్మా"

"నెప్పి ఎందుకు పుట్టిద్దే? వూళ్ళో ఆడు కుంటూ తిరిగొస్తే నొప్పి పుట్టదూ?"

"వూళ్ళో ఎవ్వురు తిరిగొస్తన్నారు?"

"నువ్వు నాతోపాటు కూలికి వస్తే పొద్దు టిపూట ఒక రూపాయి, సందకాడ ఒక రూపాయి రోజుకి రెండు రూపాయలు ఇస్తా నువ్వు కొనుక్కుని తింటానికి" ఆశ పెట్టింది రాగమ్మ.

"వూరకనే చెపతావు. నువ్వు నిజంగా ఇయ్యవులే"

"నిజంగా ఇస్తానే. కావాలంటే ఈ రెండు రూపాయలు తీసుకో, ఇప్పుడు ఒక రూపాయికీ, సందకాడ ఒక రూపాయికీ కొనుక్కో"

సుశీల సంతోషంగా రెండు రూపాయలు తీసుకుంది. "రేపు కూడా ఇస్తావా? "

"రోజూ ఇస్తా! నువ్వు కూలికి వచ్చినన్ని రోజులూ ఇస్తా ఏరోజు నీకు డబ్బులు ఇయ్యకపోతే ఆరోజు రావాకు" రాగమ్మ అంది. కూతురికి కొనుక్కు తినడానికి 2 రూపాయలు ఇచ్చినా, ఇంకా 18 రూపాయలు మిగుల్తాయనుకుంది రాగమ్మ.

రూపాయి తీసుకుని కొనుక్కుని, తల్లి వెంట కూలికి వెళ్ళింది సుశీల.

అది మొదలు, నెమ్మది నెమ్మదిగా తల్లి వెంట అలా కూలికి వెళ్ళడం సుశీలకి అల వాటైపోయింది. పెద్దలతోపాటు, సుశీల కూడా ఇప్పుడు ఒక కూలి మనిషి అయింది.

కలుపూ, విత్తనాలు నాటడం, ప్రత్తితీయడం, మొక్కజొన్న కండెలు విరవ డంలాంటి స్త్రీలు చేసే ఇతర పనులు అన్నిటికీ సుశీల వెళ్తోంది.

★ ★ ★

రోజులు జరిగిపోతున్నాయి.

సుశీలకి ఇప్పుడు పదకొండో ఏడు.

సంవత్సరం క్రితం సుశీల ఎంతో ఉత్సాహంగా వుండేది. తల్లితోపోట్లాట వేసుకోవడం, ఆమె చెప్పిన పని అప్పుడప్పుడూ, చేయకుండా ఎగ్గొట్టడం, పిల్లలతో ఆటలు ఆడుకోవడంతో రోజులు గడచిపోయాయి. ఇప్పుడు సుశీలలో చూద్దామన్నా ఆ ఉత్సాహం, చురుకూ కానరావడంలేదు.

నిద్ర లేచిన వెంటనే అంట్లు ముందేసుకుని పొయ్యిలోని బూడిద తీసుకొచ్చి వాటిని తోము కోవడంతో దినచర్య ప్రారంభమవుతుంది. తల్లితో సమానంగానూ, ఒక్కోసారి కాస్త ఎక్కువగానూ ఇంట్లో పనులు అన్నీ చేసి తల్లితో కూలికి వెళ్ళిపోతుంది. ఒక్కోసారి తనే వేరేవాళ్ళతో కూలికి పోతుంది. మళ్ళీ చీకటి పడితేనే ఇంటికి రావడం.

ఇంటికి వచ్చిన తరువాత మళ్ళీ ఏవో పనులు.

ఇప్పుడు తల్లిదండ్రులతో దెబ్బలు తినడం మాత్రం పూర్తిగా తగ్గిపోయింది. అయితే వాళ్ళకి కోపం వచ్చినప్పుడు తిట్లు మాత్రం తప్పడంలేదు.

వాళ్ళు చెప్పకుండానే స్వంతంగా కల్పించుకుని సుశీల ఇంట్లో పనిచేసినప్పుడు రాగమ్మ కూతుర్ని చూసి మురిసిపోతుంది.

"ఆడపిల్ల ఎక్కి వస్తే తల్లికి సుకమంట! మాతల్లి ఎక్కివచ్చిందీ, నాకు పనిబరువు తగ్గిపోయిందమ్మా! వరాల తల్లివేనే నువ్వు" అని రాగమ్మ కూతుర్ని మెచ్చుకుంటూ సంతోషపడిపోతోంది అప్పుడప్పుడూ.

ఒకరోజు సుశీల వేరేముటావాళ్ళతో కూలికి వెళ్ళి వచ్చిన తరువాత తల్లి చెవిలో గుట్టుగా చెప్పింది.

సుశీలని మూలన కూర్చోపెట్టారు.

బాగా పొద్దుపోయి నాసరయ్య పనినించి వచ్చాడు.

"కర్చు వచ్చి పడిందయ్యా మనకి" భర్తతో చెప్పింది రాగమ్మ.

"ఏం కర్చే? "

"అమ్మాయి కుండల్లోకి వచ్చింది"

"ఎప్పుడూ? "

"మజ్జెన్నంగామాలి! కూలికిపోయి వచ్చిన తరవాత చెప్పింది"

"ఎంతలేదన్నా వెయ్యిరూపాయలన్నా




అవతాయన్నమాట"

"ఏవి తప్పినా ఇసుంటివి తప్పేవి కాదుగా" అంది రాగమ్మ.

"చుట్టాలు అందర్నీ ఎక్కడ పిలుద్దాంలే? డబ్బులు ఎక్కడున్నయ్, అసలే డబ్బులకి కటకటగా వుంటే! దగ్గిరోళ్ళ మటుకు పిలిచి బంతి పెట్టుకుని తేలిగ్గా వెళ్ళబుచ్చుకుందాం"

"అంతేలే, ఇప్పుడే వందలు వందలు తెచ్చి ఎక్కడ కర్చు పెడదాం? మళ్ళీ పెళ్ళిచేయా లాయె! అప్పుడు ఎట్టనుకున్నా కర్చు తప్ప దుగా! అంతగా అయితే అప్పుడు చూడొచ్చు"

"రెండ్రోజుల్లో పిల్లోడ్ని పంపించి పెద్ద మ్మాయిని పిలిపిద్దాం. అల్లుడ్ని కూడా రమ్మని చెపుదాం" అన్నాడు నాసరయ్య.

ఆరోజు రాత్రి అన్నాలు తిని పడుకున్న తరువాత రాగమ్మ అన్నది. "వెంకాయమ్మ గారి పిల్ల ఈడైై రెండేళ్ళయింది. ఇంత మట్టుకి వాళ్ళు పెళ్ళి ఊసు ఎత్తుకోవడం లేదు. పెళ్ళిచేయకుండా ఇంకా ఎన్నిరోజులు ఇంటో అట్టిపెట్టాలనో వాళ్ళ వుద్దేశం"

"వాళ్ళు పాపం ఇబ్బందుల్లో వున్నార ట్టుగా వుందిలే! చేతిలో డబ్బు వుండి వుండదు. ముసలోడికి బాగలేక మంచంలో పడితే అటు తిప్పీ, ఇటు తిప్పీ వున్న డబ్బంతా పోగొట్టుకున్నారు. పెళ్లిచేయా లంటే మాటలా, ఏంచేస్తారు? డబ్బుతోపని" అన్నాడు నాసరయ్య.

"మనం మాత్రం పిల్లని ఎక్కువ రోజులు అట్టిపెట్టొద్దు! లోకులు ఆక్షేపిస్తారు. ఎంత తొందరగా వల్లయితే అంత తొందరగా పిల్లకి పెళ్లిచేసి అత్తగారింటికి పంపించటం మంచిది"

"మనం ఎందుకు ఆపుతాం? రేపు ఎండా కాలంలోనో, శ్రావణ మాసంలోనో పిల్లకి పెళ్ళిచేద్దాం. సమ్మంధం కుదరటమే ఆలస్యం, ముడిపెట్టేస్తే మనకీ బాదరబందీ తప్పిద్ది!" అన్నాడు నాసరయ్య.

★ ★ ★

ఆడపిల్లలు 'రజస్వల' అయితే వేడుకలు చేయడం ఈనాటికీ కూడా ఒక సాంప్రదా యంగా, ఒక పద్ధతిగా అమలు జరుగు తోంది. రజస్వల వేడుకలు కొన్ని కులాలకే పరిమితంకాదు. ఆంధ్రప్రదేశ్‌లో అన్ని కులాల్లోనూ, అన్ని మతాల్లోనూ ఈ సాంప్ర దాయం అమలులో వుంది.

అయితే ఇప్పుడిప్పుడే కొద్దిమంది విద్యా వంతులైన వాళ్ళు ఈ పద్ధతిని తిరస్కరిస్తు న్నారు.

సుశీల రజస్వల వేడుక నిరాడంబరంగానే జరిగింది. పదిమంది దగ్గర బంధువుల్ని పిలిచి వాళ్ళకి భోజనాలు పెట్టి చాలా పరి మితంగా చేసుకున్నారు.

ఆడపిల్ల యుక్తవయస్కురాలైతే ఇక వాళ్ళ దృష్టిలో పెళ్ళికి ఎదిగినట్టే! సుశీలకి కూడా తొందరగా పెళ్ళిచేద్దామని నాసరయ్యకీ, రాగమ్మకీ కోరికగా వుంది.

"అమ్మాయికి మంచి మనువు చూడండ మ్మాయి. ఏదో మాకు వున్న దాంట్లో మాకు తగ్గట్టు కట్నం ఇస్తాం. ఆస్తిపాస్తులు వున్న మగపిల్లలయితే ఈ రోజుల్లో వేలువేలు కట్నం అడుగుతున్నారు. మనకి అన్ని ఆశలు లేవులే! మన తాహతు ఎంతా? పిల్లని రెక్కల కష్టంమీద పోషించుకునేవాడ యితే చాలు!" వేడుకకి వచ్చిన బంధువు లతో అన్నాడు నాసరయ్య.

"అప్పుడే ఎందుకు అన్నాయ్ పెళ్ళీ? సుశీ లకి వయస్సు ఏం వుందనీ? అంత తొంద రగా పెళ్ళిచేయకపోతే మునిగిపోయేదేం వుంది? చిన్నగానే, రెండు మూడేళ్ళు ఆగి చేయొచ్చు కదా పెళ్ళి!" అంది ఒకావిడ.

ఆమెది ఆ వూరు కాదు. నాసరయ్యకి

దగ్గర బంధువు ఆమె. ఆమె అక్కయ్య కూతురికి కూడా చిన్న వయస్సులోనే వివాహం జరిగింది. అయితే తరువాత వాళ్ళ కాపురం విచ్ఛిన్నమై పోయింది. ఆ వివాహం చెడిపోవడానికి ఒక ప్రధాన కారణం వాళ్ళ వయస్సు కూడా! ఎదిగీ ఎద గని మనసులతో, ఒకర్ని ఒకరు అర్థంచేసు కోలేని పసిప్రాయంలో వాళ్ళు గొడవలుపడి విడిపోయారు. ఆ అనుభవంతో చెప్పింది ఆమె.

"చిన్నగా అంటేయట్టా? ఎప్పుడైనా పెళ్ళి చేసి ఒక అయ్య చేతిలో పెట్టక తప్పదు కదా! తొందరగా ఆ మూడు ముళ్ళూ పడి పోతే మనకీ నెత్తిమీదనించి ఒక బరువు దిగిపోయిద్ది" అన్నాడు నాసరయ్య.

"వాళ్ళ వయస్సు ఎంతా, వాళ్ళకి ఏం తెలుసు అన్నాయ్? బొమ్మలకి పెళ్ళిళ్ళు చేసి ఆడుకునే ఈడు వాళ్ళది. అంత చిన్న పిల్లకి పెళ్ళిచేస్తే వాళ్ళు ఏం సుకపడతారు? ఏం ఎదుగుతారు? కొద్దిగా లోకగ్నేనం వుండాలి కదా? మంచేదో, చెడేదో తెలుసు కునే వయస్సయినా వుండాలి. కనీసం పది హేనో ఏటనో, పదహారో ఏటనో పెళ్ళిచేస్తే బాగుండిద్ది" అంది ఆమె.

"నీదంతా చాదస్తంలే పిన్నీ. మా అమ్మకి ఏడో ఏటనే పెళ్ళయ్యిందంట! తొమ్మిది మంది బిడ్డల్ని కన్నది. ఇప్పటికి కూడా మనిషికి నలత అనేది వుండదు. ఇంటిపనీ, పొలం పనీ అన్నీ చేసిద్ది. నాకు మాత్రం పదో ఏటనే పెళ్ళికాలా? ముచ్చటగా సంసారం చేసుకోవటంలా నేను మాత్రం!" అంది మరొక ఆమె.

"ఎప్పుడో వెనకటిరోజుల్లో అట్ట జరిగి నయి కానీ, ఈ రోజుల్లో చిన్నపిల్లలకి ఎవురు చేస్తన్నారు పెళ్ళిళ్ళు?"

చిన్నపిల్లలకి పెళ్ళిళ్ళు చేయకూడదనే ఆవి డమాటని ఒక్కరు కూడా నెగ్గనీయలేదు.

అందరూ కలసి పిల్లలకి 12వ సంవత్సరం లోనో, 13వ సంవత్సరంలోనో పెళ్ళిళ్ళు చేస్తే ఇక ఏ సమస్యా వుండదనీ, ఏ గొడవలూ రావనీ, లేత వయసులోనే పెళ్ళిళ్ళు చేయడం మంచిదనీ తీర్మానించారు.

★ ★ ★

సుశీలకి పన్నెండో ఏడు వచ్చింది.

నాసరయ్యా, రాగమ్మా సుశీలకి సంబం ధాలు వెదుకులాడుతున్నారు. నాసరయ్య తెల్సిన వాళ్ళకి తమ బిడ్డకి సంబంధాలు చూడమని చెపుతున్నాడు.

పెళ్ళికి అవసరమైన డబ్బు కూడా చూసి పెట్టారు. స్వంత డబ్బు కొంత వుంది. దాని కితోడు నాసరయ్య ఎప్పుడూ పనికి వెళ్ళే నారాయణ కొంత డబ్బు అప్పుగా సర్దుతా నని చెప్పాడు. ఇక సంబంధం కుదరడమే ఆలస్యం!

చాలామంది వచ్చి సుశీలని చూసిపోతు న్నారు. కొంతమందికి సుశీల నచ్చడంలేదు. ఆ నచ్చినవాళ్ళకి సుశీల తండ్రి ఇస్తామన్న కట్నం నచ్చడంలేదు. ఇవి రెండూ నచ్చే వాళ్ళు ఎవరూ రావడంలేదు.

రోజులు జరిగిపోతున్నాయి. నాసరయ్యా, రాగమ్మా తొందరపడి పోతున్నారు. తమ బిడ్డకి వయసు మించిపోతుందేమో అని ఆందోళన చెందుతున్నారు. ఎప్పుడెప్పుడు పెళ్ళి చేద్దామా, ఎంత తొందరగా చేద్దామా అని ఉబలాటపడుతున్నారు.

"సుశాయ్... ఏం చేస్తున్నావే? మీ అమ్మ వుందంటే ఇంట్లో" అంటూ వాళ్ళ ఇంటికి పది ఇళ్ళ అవతల వున్న అంజమ్మ ఒక రోజు సుశీల వాళ్ళ ఇంటికి వచ్చింది.

"చిల్లరకొట్టుకి పోయింది అత్తా. ఏందీ పని మీద వచ్చావు? దా... కూచో, కొట్టు దగ్గరనించి ఇప్పుడే వచ్చిద్ది?"

"ఇయ్యేడన్నా పప్పుకూడు పెట్టవంటే! తొందరగా పెళ్ళిచేసుకోవే, నీ పెళ్ళి పుణ్యాన రెండు రోజులు పప్పుకూడు తింటాం"





"ముందు నీ కొడుక్కి పెళ్ళి చెయ్యి అత్తా! వాడి కంటే ఏడాది చిన్నదాన్నేగా నేను" అంది సుశీల.

"చేస్తాలేవే, ఎగతాలి చేయవాకు! వాడికి పదమూడో ఏడు, మగపిల్లోడు! వాడికి ఏం తొందరవచ్చింది? ముందు నీ పెళ్ళికానీ...''

"ఏం వదినా... మొన్న మీ బఱ్ఱె పోయిందంటగా విప్పితోలితే! వచ్చిందా, ఇంకా రాలేదా? " కొట్టుదగ్గరనించి వచ్చిన రాగమ్మ నవ్వుతూ అంజమ్మని పలకరించింది.

"నిన్న సందకాడ వచ్చింది. ఆ బఱ్ఱెకోసం మూడు రోజులు మీ అన్న ఎండకీ, గాలికీ వూరూరూ తిరిగి అల్లాడిపోయాడు. ఎక్కడని ఎతుకులాడతాం? నిన్న సందకాడ దానంతటదే వచ్చింది, ఎక్కడెక్కడో తిరిగి!"

"పోనియ్యిలే, మొత్తానికి వచ్చింది. నయం కదూ! ఏదో ఒక వూళ్ళో ఎవరో ఒకరు కట్టేసుకుంటే మనం ఎక్కడని ఎతుకులాడతాం? "

"ఎండాకాలం చేలమీద తిరిగొస్తయ్యని మనం విప్పితోలటం, అయ్యి తప్పిచ్చుకపోవటం! కట్టి పడెయ్యటమే మంచి దనిపిస్తంది"

"అంతే వదినా" అంది రాగమ్మ.

"సరే రాగమ్మా... మన సుశీలకి సమ్మంధాలు చూస్తున్నారంటగా? ఇయ్యేడు పెళ్ళి చేస్తారేంది? " సంబంధాలు చూసే వాళ్ళు సరదాగా చూస్తారా? ఆమెకి అన్నీ తెలిసినా రాగమ్మ నోటినించి విషయం చెప్పించుకోవడానికి అలా అడిగింది.

"చేద్దాం అనుకుంటన్నాం వదినా! నీ ఎరికలో ఎవురన్నా వుంటే చూడరాదూ? "

"కట్నం ఎంత ఇస్తారేంది? "

"ఎంతోనా? మన శక్తి ఎంత? ఏ రోజు కారోజు కూలికిపోయి ఎసుట్లోకి తెచ్చుకునే వాళ్ళమి! కూటికి జరగడమే గగనంగా వుంది. రెక్కల కష్టం తప్ప నీకు తెలియని ఆస్తి మాకు ఏం వుంది? మడులా, మాన్యాలా? ఉంటానికి ఒక ఎకరం పొలం వుంటే అది పండుతందా, చస్తందా? ఒక ఏడు కాస్తాకూస్తో పండితే రెండేళ్ళు ఎండుతండే!" అంది రాగమ్మ.

"సరేలే, ఎంతో కొంత ఇవ్వాలి కదా కట్నం అసలు? మనకి ఆస్తిపాస్తులు లేవని చేసుకునే వాడు వూరక వచ్చి చేసుకోడుగా!'
'

"నాలుగువేలు డబ్బు వుంది. ఆ డబ్బు ఇచ్చి ఒక అరసవర బంగారం పెడతాం. అంత మట్టుకే మా తాహతు!"

"మనకులంలో ఇది ఒక కట్నమంట రాగమ్మా! అనకూడదు కానీ అమ్మాయికి కొద్దిగా అవుడువుండె!"

"ఏం అవుడు వదినా అది? ఎంత అవుడు? అమ్మాయి అన్ని పనులూ చేయటంలా? అప్పుడు మేం డబ్బు దగ్గిర యెనకాడి, గడ్డి తినబట్టి కానీ లేకపోతే కాలు మామూలుగానే రాకపొయ్యిందీ? "

"అయినా సరే, వచ్చిన వాళ్ళు ఏదో పేరు పెడతారు కదా!"

"ఎందుకు పెడతార్లే! అమ్మాయి కాలు కొద్దిగా ఎత్తివేసిద్ది. అంతే కదా? " అంది రాగమ్మ.

"మా పెద్దమ్మ మనమడు వున్నాడు రాగమ్మ. మన అమ్మాయికి ఈడు అవుతాడు. మాట్టాడమంటా? "

"ఏ వూరు ఏంది వాళ్ళది? "

"మా వూరే అనుకో, అంటే పిల్లోడు వుండేది మా వూళ్ళోనేలే! వాళ్ళ అమ్మా నాన్నది మా వూరికి చాలా దూరం. చిన్నారి కట్లవాళ్ళది"

"అమ్మా నాన్నల దగ్గర కాకుండా, మీ

వూళ్ళో మీ పెద్దమ్మ దగ్గర ఎందుకు వుంటున్నాడు పిల్లవాడు? "

"మా పెద్దమ్మకి వీడు దత్తు. ఆమెకి నలుగురు ఆడపిల్లలు రాగమ్మా! పెద్దకూతురికీ, చిన్నకూతుళ్ళ ఇద్దరికీ పిల్లలు లేరు. అసలు ఇద్దరు మొగుళ్ళని వదిలిపెట్టారనుకో! ఒకామెకేమొ చిన్నప్పుడే మొగుడుపోయాడు. ఆ కూతుళ్ళు ముగ్గురూ కూడా పుట్టింటికి చేరి, తల్లిదగ్గర, అదే మా పెద్దమ్మ దగ్గర వుంటున్నారు. వీడు రెండో ఆమె కొడుకు. ఆ రెండో ఆమెకి ముగ్గురు కొడుకులు. మా పెద్దమ్మ కూతుళ్ళు ముగ్గురూ చిన్నప్పట్నించీ పెంచుకుంటూ, దత్తత తీసుకున్నారు!"

"అయితే ఆస్తి పాస్తులు ఏమాత్రం వున్నయ్యేంది వదినా? "

"చెప్పొద్దూ, పెద్దగా ఆస్తి మాత్రం ఏం లేదు. ఒక పెద్ద పెంకుటిల్లు వుంది. అంతే. చెరువంత ఇల్లు అది. ఆ ఇంటిని పిల్లలు లేని బేమ్మలామె ఒకామె మా పెద్దయ్యకి ఇచ్చింది"

"బేమ్మలామె మీ పెద్దయ్యకి ఇల్లు ఎందుకు ఇచ్చింది? "

"ఆమెకి పిల్లలు లేరు. ముసలితనంలో ఆమెని వీళ్ళు చూసార్లే, అందుకు ఇచ్చింది. తల్లి దగ్గర వుంటున్న ముగ్గురు కూతుళ్ళూ రాకాసులంటే నమ్ము! గడియ వూరకుండరు. ఎప్పుడూ కూలికి ఏమాలరు! పని ఎక్కడుందో ఎతుకులాడుకుని కూలికి పోతారు. కూలిమీద వాళ్ళు ఏమైనా మిగిల్చారేమొ మనకి తెలియదూ, మనకి చెప్పరు!"

"మిగిల్చినా పిల్లవాడికి ఇస్తారా? "

"ఇవ్వక వాళ్ళు ఏం చేసుకుంటారు? మా పెద్దమ్మకే కాదు. కూతుళ్ళు ముగ్గురికి కూడా వీడేదత్తు! వీడ్ని వాళ్ళు ఎంత బాగానో చూసుకుంటారంటె నమ్ము! కన్నబిడ్డల్ని కూడా ఎవురూ అట్టసాకరు. అంత బెమ, వీడంటే వాళ్ళకి!"

"పిల్లవాడు ఏం చేస్తుంటాడు? " రాగమ్మ అడిగింది.

"కూరగాయల బేరం చేస్తాడు. సైకిలు మీద కూరగాయల తట్టకట్టుకుని రెండు మూడు వూళ్లలో తిరిగి అమ్ముకుంటాడు. రోజుకి పాతికా, ముప్పయ్ రూపాయలు కళ్ళ చూస్తాడనుకుంటా! పిల్లవాడు కొద్దో గొప్పో చదువుకున్నాడు"

"ఏం చదువుకున్నాడేంది? "

"పదో తరగతిదాకా చదువుకున్నాడు. పదో తరగతి తప్పాడనుకుంటా! పుటక కూడా బాగుండిద్ది రాగమ్మా. బాగా ఒడ్డూ, పొడుగూ చుట్టానికి చక్కగా వుంటాడు"

"అయితే మనం ఇచ్చేకట్నానికి మనకి అందుతారంట వదినా? "

"ఎందుకు అందరు? వాళ్ళేం లక్షాధికారులు కాదులే! వాళ్ళకి మాత్రం ఆస్తి పాస్తులు ఏమున్నయ్యి ఇల్లు తప్ప!" అంది అంజమ్మ.

"మంచీ చెడ్డా నీకు తెలుసుకదా? మంచి సమ్మంధం అయితే మాట్టాడు వదినా! పిల్లవాడు మంచివాడు అయితే కావాల్సిందేం వుంది. పిల్ల జీవితపర్యంతం నీ పేరు చెప్పుకునిద్ది"

"నా పేరు చెప్పుకోవడానికి ఏముంది? మాట్లాడదామనేగా నేను మీ ఇంటికి వచ్చింది. రేపో, ఎల్లుండో మా వూరికి పోతాను. ఏవైనమూ కనుక్కుని వస్తా!" అంది అంజమ్మ.

నిజానికి ఆమె అంతకుముందే అన్ని విషయాలూ తెలుసుకుని వచ్చింది. వాళ్ళు సంబంధం మాట్లాడమని అడిగితేనే, అదే పనిమీద సుశీల వాళ్ల ఇంటికి వచ్చింది.




అయితే ఆ విషయాన్ని ఆమె వెల్లడిచేయ లేదు.

★ ★ ★

మూడురో ులు తరువాత వాళ్ళ వూరు వెళ్ళిన అంజమ్మ పెళ్ళి చూపులకోసం ఏకంగా వాళ్ళ పెద్దమ్మ మనవడ్ని తీసుకువచ్చింది. అంజమ్మ వెంట అతను ఒక్కడే వచ్చాడు.

"మన అమ్మాయి విషయం అంతా వాళ్ళకి చెప్పాను రాగమ్మా! వాళ్ళు అన్నిటికీ వప్పుకున్నారు. పిల్లని చూడటం కోసమని మావాడు కూడా వచ్చాడు. ఒకరికొకరు నచ్చితే మిగతా విషయాలు తరువాత మాట్లాడుకుందాం"

"నువ్వు మీ వూరు ఎప్పుడు పొయ్యావూ; ఎప్పుడు వచ్చావు వదినా? " ఆశ్చర్యంగా అడిగింది రాగమ్మ.

"పోవటం ఎంతసేపూ, రావటం ఎంతసేపూలే రాగమ్మా! ఎంత దూరం, ఎంత కత? మా పెద్దమ్మ అనుకోకుండా మంచంలో పడింది, మనిషికూడా పెద్దది అయిందిలే! యములోళ్ళు రమ్మంటన్నారంట! మనమడి పెళ్ళి చూసి పోవటం కోసమని ఆగింది. అన్నీ నచ్చితే తొందరగా లగ్గాలు పెట్టుకుని పెళ్ళి చేయటమే!" చెప్పింది అంజమ్మ.

"ఇప్పుడు వీళ్ళ అయ్య కూడా లేడే, కూలికి పోయాడు!"

"అన్న ఇప్పుడు లేకపోతే ఏం పోయిందిలే? అమ్మాయిని వాడు చూసి పోతాడు. ఇప్పుడు పెళ్ళిచూపులు అయిపోతే రేపు మీరు మావూరు వెళ్ళి, వాళ్ళ ఇల్లూ వాకిలీ, మంచీచెడూ తెలుసుకుని రండి. మీక్కూడా అన్నీ నచ్చాలి కదా! అన్నీ నచ్చిన తరువాత మాట్లాడుకుందాం!"

సుశీలని ముస్తాబు చేసారు. పావడా, జాకెట్లూ, వోణీలూ తొడుక్కునే సుశీలకి చీర కట్టి, సొమ్ములు పెట్టి సింగారించారు.

అసలే సుశీల పొట్టి. ఆ పొట్టి మనిషికి చీర కడితే పిల్లలు ఆడుకునే బొమ్మకు చీర కట్టినట్లు వుంది.

అంజమ్మ వెళ్ళి, వాళ్ళ ఇంటి దగ్గర వున్న పిల్లవాడ్ని సుశీల వాళ్ళ ఇంటికి తీసుకువచ్చింది.

అతని పేరు సింగయ్య.

మనిషి బాగా పొడవుగా వున్నాడు. చామనఛాయ. తెల్లప్యాంటూ, షర్టూ తొడుక్కున్నాడు. అతనికి దాదాపు 18 సంవత్సరాల వయస్సు వుంటుంది.

ఎవరి ఇంటిదగ్గర నించో కుర్చీ తీసుకు వచ్చి వేసారు. కుర్చీమీద కూర్చున్న సింగయ్యకు టిఫిన్ తీసుకువచ్చిపెట్టారు.

"నీకు కాబోయే మొగుడేలే సుశీలా! సరిగా చూడు, సిగ్గుపడవాకు! రేపు మళ్ళీ నచ్చలేదనో, గిచ్చలేదనో, గిల్లలేదనో పేచీలు పెడతావు! నువ్వు సామాన్యురాలివి కూడా కాదు" అంది అంజమ్మ.

సుశీల ఏం మాట్లాడలేదు. సుశీలకి భయంగా, బెరుకుగా, ఆందోళనగా వుంది. ముఖంలో రంగులు మారిపోయాయి. ఏడుపు ముఖం పెట్టింది.

"ఏడుపు ముఖం పెట్టావు ఏందే సుశీలా? నవ్వు... నవ్వుతూ వుండాలి. ఎప్పుడూ కిలకిలా నవ్వేదానివి ఏమైందే నీకు? " అంది రాగమ్మ.

"నాకు భయంగా వుందమ్మా" అంది సుశీల కొద్దిగా వణికిపోతూ, భయపడుతూ.

"భయం ఎందుకే? అతను ఏం చేస్తాడు? మేం అందరం లేమా? నిన్ను వూరక చూసిపోతాడు. అంతే. నవ్వుతూ వెళ్ళమ్మా!" అంది రాగమ్మ.

"భయం ఎందుకే సుశీలా... పిచ్చి ముకమా... వాడు మనవాడే లేవే! నవ్వుతూ వెళ్ళి చూడు. నీకు నచ్చాడ్దూ?

పెళ్ళి చేసుకునే దానివి నీకు నచ్చకపోతే యట్ట? నీకే కాదు, వాడికి కూడా నువ్వు నచ్చాలి. ఇట్ట వుసూరుముకంతో వెళ్తే వాడికి నచ్చవు. కొద్దిగా నవ్వు" సుశీలని అనునయించడానికి చూస్తూ, చక్కలిగిలి పెట్టింది అంజమ్మ.

వాళ్ళ మాటలకి భయం వదలకపోయినా, నవ్వు తెచ్చుకోవడానికి ప్రయత్నించింది.

వణికిపోతున్న సుశీల చేతులు పట్టుకుని అతని ఎదురుకి తీసుకుపోయింది అంజమ్మ.

సుశీల వాళ్ళ ఇంటికి దగ్గరగా వున్న ఒక ముసలమ్మ కూడా వచ్చింది కాబోయే పెళ్ళి కొడుకుని చూడటానికి. ఆమె సింగయ్యతో కబుర్లు పెట్టుకుంది. ఏవో తనకి తోచిన కబుర్లు చెప్పిన తరువాత ఇంటర్వ్యూ చేయడం మొదలుపెట్టింది. "ఏం చేస్తుంటావు? ఏం చదువుకున్నావు? ఎంతమంది అన్నదమ్ములూ, అక్క చెల్లెళ్లూ? ఆస్తి ఏ మాత్రం వుంది? " అని రకరకాల ప్రశ్నలతో ఆ ఇంటర్వ్యూ సాగింది.

ఆమె ప్రశ్నలకి సింగయ్య తొణక్కుండా, బెణక్కుండా జవాబులు చెప్పాడు. ఆమె దాదాపు 15, 20 నిముషాలు మాట్లాడింది. ఆ కొద్ది సమయంలోనే సింగయ్య 3 సిగిరెట్లు తాగాడు. ముక్కులోనించీ, మూతిలో నించీ వివిధరకాలుగా పొగని వదిలాడు. స్టయిల్‌గా చేతిలోసిగిరెట్‌ని పట్టుకున్నాడు.

"అబ్బా... ఆ గబ్బు సిగిరెట్‌ని తాగకపోతేనేం నాయనా? ఇంత దూరంలో కూచున్న నాకే ముక్కులు పగిలిపోతున్నాయి. అది తాగితే ఏం వచ్చిద్ది? " ఆమె లేచి ఇంటికి వెళ్ళబోతూ చివరి ప్రశ్నగా వేసింది.

ఆమె మాటలకీ, ప్రశ్నలకీ అప్పటివరకూ తీవీగా జవాబులు చెప్పిన సింగయ్య చివరి ప్రశ్నకు తొట్రుపడ్డాడు. ఏంచెప్పాలో తోచ లేదు.

"ఏం వచ్చిద్దో తాగిచూడు అవ్వా తెలిసిద్ది! ఇందులో వుండ మజా నీకేం తెలుసు? " అని పెద్దగా వెకిలినవ్వు నవ్వాడు.

సింగయ్య ఎదురుగా చాపవేసి సుశీలని కూర్చోపెట్టారు. తల వంచుకుని, మౌనంగా కూర్చున్న సుశీలని పరిశీలనగా, రెప్పవాల్చకుండా చూసాడు సింగయ్య.

"అమ్మాయికి వంక అనే మాట లేదురా! చిన్నప్పుడు, తెలిసీ తెలియని ఈడులో కాలు విరిగింది. అప్పుడు డాక్టరు సరిగా కట్టుకట్టకపోయేసరికి కాలు కొద్దిగా వంకరవచ్చింది. నూలు వారేలే! ఇప్పుడు అన్ని పనులూ చేసిద్దీ, అందరితో పాటే కూలికి పోయిద్దీ, పరిగెత్తిద్దీ, నడిచీద్దీ! కాల్లో తేడా ఏం లేదు కానీ, కొద్దిగా కాలు ఎత్తివేసిద్ది" చెప్పింది అంజమ్మ.

"నువ్వు మనవూళ్ళోనే ఆ విషయం చెప్పావుగా? " అన్నాడు సింగయ్య.

"కొద్దిగా నడవ్వే! అటు పోయి, ఇటురా చూస్తాడు" అని సుశీలతో నడిపించింది ఆమె.

సుశీలని కొద్దిసేపు చూసిన తరువాత సింగయ్య లేచి అంజమ్మ వాళ్ళ ఇంటికి ఒక్కడే వెళ్ళిపోయాడు.

"ఏమే సుశీలా... నచ్చాడంటే నీకు? " అతను వెళ్ళిన కొద్దిసేపటి తరువాత అడిగింది అంజమ్మ.

సుశీల ఏం జవాబు చెప్పకుండా మౌనంగా నిలబడింది.

"నిన్నేనే అడిగేది... పిల్లవాడ్ని చూసావు కదా... నీకు నచ్చాడా, నచ్చలేదా? "

"దానిముకం, దానికేం తెలుసులే వదినా! పిల్లవాడికేం బాగుంటే! కొద్దిగా రంగు తక్కువేమో కానీ ఇంక లోటేముంది? " అంది రాగమ్మ.





"దీని మనసులో మాట కూడా కనుక్కోవాలిగా! అడిగేది నిన్నేనే అందాల బరిణా... నీ కంటికి నచ్చాడా, నచ్చలేదా? "

"అది ఏం చెప్పిద్దిలే, పసిముండ! పిల్లవాడితో మాట్లాడు వదినా... ఆ అబ్బాయికి మన అమ్మాయి నచ్చిందో, నచ్చలేదో, కట్నం ఎంతలో వున్నారో, ఏమిటో..."

"కట్నం బాధలేదులే రాగమ్మా! మొన్ననే మీరు ఇస్తామన్న కట్నం, మీ తాహతు ఎంతో చెప్పా! అన్నిటికీ వాళ్ల పెద్దవాళ్ళు తలకాయ వూపారు. పిల్లవాడు, వీడిదేంవుందనుకో! ఉంగరం, వాచీ, రేడియో, సైకిలు లాంటివి ఏవో అడుగుతారనుకుంటా పెద్దవాళ్ళు! మీరు ఇవ్వగలిగినవి చెప్పండి. వాళ్ళకి అన్నీ నచ్చితే చేసుకుంటారు, లేకపోతే లేదు" అని అంజమ్మ ఇంటికి వెళ్ళిపోయింది.

ఇంటిదగ్గర వున్న సింగయ్యని కూడా అదే మాట అడిగింది.

"పిల్ల నీకు నచ్చిందంట్రా? "

"పిల్లకేం పిన్నీ, కుందనపు బొమ్మ మాదిరిగా బాగుంటే! కాలు కొద్దిగా వంకరపోయినా పనీపాటా, కూలీనాలీ అన్నీ చేసిద్దంటన్నావు కదా! ఇంక కావాల్సిందేం వుంది?''

"అయితే మాట్లాడుకోవటమేనా? "

"ఇయ్యాల వూరికిపోయి అమ్మా నాన్నకి కబురుచేస్తాను. వాళ్ళు రెండు రోజుల్లో మన వూరు వస్తారు. వీళ్ళని కూడా అక్కడికి రమ్మను. మనకి వున్న ఆస్తిపాస్తులూ, మంచి చెడ్డలూ అన్ని విషయాలూ వీళ్ళు కూడా తెలుసుకోవాలిగా!"

"నేను చెప్పాలే అన్నీ! ఇల్లు తప్ప మరేం ఆస్తి లేదనీ, తెలివితో కూరగాయల బేరం చేసుకుంటూనో, రెక్కల కష్టంతో చాకిరీ చేసుకుంటూనో వుండేవాళ్ళని! అన్నిటికీ వప్పుకునే నిన్ను రమ్మన్నారు"

"మనం చెప్పటం వేరూ, వాళ్ళు వచ్చి తెలుసుకోవడం వేరులే పిన్నీ! వాళ్ళు వచ్చి సొయంగా తెలుసుకుంటే బాగుండిద్ది కదా! లాంచనాలు ఏమి ఇస్తారో, కట్నంగా డబ్బులు ఎన్ని రూపాయలు ఇస్తారో అన్నీ మాట్లాడుకుని కుదిరిన తరువాత లగ్గాలు పెట్టుకుందాం"

"మొత్తంమీద, అన్నీ కలుపుకుని ఆరేడు వేలకంటే ఎక్కువ ఇవ్వలేరబ్బాయి! మనం ఎక్కువ ఆశపట్టం, అంత వాళ్ళు ఇవ్వలేమని వెనక్కి తగ్గటం, చివరకి కుదరకపోవటం ఇవన్నీ ఎందుకు? వాళ్ళ తాహతుమాత్రం అంతకంటే ఎక్కువలేదు" అంది అంజమ్మ.

"కొలకలూరు నించి డబ్బులు పదివేలు ఇస్తామని వచ్చారు పిన్నీ! అయితే పిల్ల నాకు నచ్చలేదులే! కాకి నలుపు. పిల్ల కూడా నాకంటే పెద్ద!"

"దాందేముందిలే? నీకు ఇంకా ఎక్కువ కూడా ఇచ్చేవాళ్ళు వుండొచ్చు! వీళ్ళు మాత్రం అంతకంటే ఎక్కువ ఇవ్వలేరు. మీ పెద్దమ్మకీ, పిన్నమ్మలకీ వీళ్ళ శక్తి ఎంతో చెప్పా! వాళ్ళు వప్పుకున్నారు. నాలుగు రూపాయలు వస్తంటయ్యా, పోతంటయ్యా, డబ్బుదేం వుందిరా? పిల్ల నీకు నచ్చింది కదా, కుటుంబం కూడా మంచి కుటుంబం"

"అది కాదు పిన్నీ..."

"అన్నీ అయిన తరువాత కట్నం దగ్గర పేచీ వచ్చి వెనక్కి పోతే ఎగతాళి చేస్తారు! కట్నం మాత్రం డబ్బుగా నాలుగువేలకంటే ఎక్కువ ఇవ్వలేరు!"

"అంతే అంటావా? "

"అంతే! బస్సు వచ్చే వేళయింది. మాటల్లో పడి మర్చిపోతే బస్సు పోయినా పోవచ్చు ఈబస్సుపోతే ఇక లేదు! బయల్దేరు. రెండు మూడు రోజుల్లో మీ అమ్మా నాన్నని మనవూరు రమ్మని కబురుచేయి.

మాట్లాడుకునేటప్పుడు వాళ్ళు కూడా వుంటే బాగుండిద్ది. తరువాత అపవాదు రాకుండా వాళ్ళ సమక్షంలోనే అన్నీ మాట్లాడుకుందాం! మీ అమ్మమ్మవాళ్ళకి నువ్వు దత్తుకి వచ్చినా, మీ అమ్మా నాన్నకి కూడా అన్నీ నచ్చాలి. పెళ్ళి అంటే మాటలు కాదుగా! వాళ్ళు కూడా మంచీ చెడూ చూస్తే బాగుండిద్ది" అంది అంజమ్మ.

"నిజమేలే పిన్నీ. నూ అమ్మా నాన్నని మనవూరు పిలిపించటమో, లేకపోతే నేను పోయి తీసకరావటమో చేస్తాలే రెండుమూడురోజుల్లో" అని సింగయ్య వాళ్ళ వూరు వెళ్ళిపోయాడు.

★ ★ ★

సింగయ్య చందలూరులో వాళ్ళ అమ్మమ్మ వాళ్ల ఇంటివద్ద వుంటున్నాడు. అక్కడే పెరిగాడు.

ఆ అమ్మమ్మకి మగపిల్లలు లేరు. ఆమెకి నలుగురు ఆడపిల్లలు.

అందరికంటే పెద్ద సుబ్బమ్మ. ఆమెకి పెళ్ళయి 10 సంవత్సరాలు భర్తతో కాపురం చేసింది. ఆ భర్త క్షయవ్యాధితో మరణించాడు. పదేళ్ళ కాపురంలో ఆమెకి పిల్లలు కలగలేదు. భర్త తరపున ఆస్తి కూడా ఏం లేదు. ఆమె చివరకి పుట్టింటికి చేరుకుంది.

రెండో ఆమె వెంకమ్మ. చందలూరుకి 40 మైళ్ళ దూరంలో వున్న చినారికట్లలో ఆమెకి పెళ్ళయ్యింది. వాళ్ళు పెద్దగా ఆస్తి వున్న వాళ్ళు ఏంకాదు. కనకమ్మ నలుగురు కూతుళ్ళలో ఈమె ఒక్కతే భర్తతో కాపురం చేస్తూ పిల్లల్ని కన్నది. ఆమెకి ముగ్గురు కొడుకులు. వాళ్ళలో చిన్నవాడు సింగయ్య. పెద్దకొడుకులు ఇద్దరూ తల్లిదండ్రుల దగ్గరే వుంటారు.

మూడో ఆమె కాంతమ్మ. ఆమె భర్తతో రెండుమూడు సంవత్సరాలు కాపురం చేసింది. ఆ భర్త తాగుబోతు. పగలంతా చాకిరీ చేసినా, సందకాడికి 'చుక్క' పడనిదే వుండలేడు. అతని సంపాదనంతా అతని మందుకే సరిపోతుంది. ఆ తాగుడు కాంతమ్మకి నచ్చలేదు.

సహజంగానే కాంతమ్మని తెలిసినవాళ్ళు గయ్యాళి మనిషి అంటారు. తాగుబోతు భర్తతో జగడం వేసుకునేది. ఎప్పుడూ పోట్లాటలే! ఆమెకీ, భర్తకీ క్షణం పడేది కాదు. చివరకి ఆమె భర్తని వదిలిపెట్టి పుట్టింటికి చేరుకుంది.

నాలుగో ఆమె అంకమ్మ, తండ్రి చిన్నప్పుడే పోయాడు. వయసు మీరిన తల్లి. ఎలాంటి కట్టుబాట్లూ లేవు. ఎవరి పెత్తనమూ లేదు. చిన్నప్పట్నించీ స్వేచ్ఛగా పెరిగింది.

అక్కలు ముగ్గురూ కలసి చెల్లెలి పెళ్ళి విషయం మాట్లాడుకుని ఒక నిర్ణయానికి వచ్చి తండ్రిలేని అంకమ్మకి పెళ్ళిచేసారు.

అయినా ఆమె ఎక్కువ రోజులు కాపురం చేయలేదు. పెళ్ళయిన మొదటి ఏడాదిలోనే భర్తని అతనిదారి అతనిని చూసుకొమ్మని చెప్పి, తన దారిన తాను పుట్టింటికి చేరుకుంది.

అలా రోజులు సాగిపోతున్నాయి.

అక్క చెల్లెళ్ళు ముగ్గురూ తోబుట్టువు వెంకమ్మ చిన్నకొడుకుని చిన్నప్పుడే పెంచుకోవడానికి తెచ్చుకున్నారు.

సింగయ్య చిన్నతనంనించీ పెద్దమ్మా, చిన్నమ్మల మధ్యనే పెరిగాడు. అతని ఆలనా పాలనా అన్నీ వాళ్ళే చూసారు. అతనికి పది తరగతులవరకూ చదువు చెప్పించారు.

ఇప్పుడు అతని అమ్మమ్మ కనకమ్మ మంచంలో పడింది. ఆమెకి వున్న జబ్బేమిటో ఆ పల్లెటూరి వైద్యులకి అంతుబట్టలేదు. దాదాపు ఆమెకి 75 సంవత్సరాల వయస్సుపైబడి వుంటుంది.





మంచంలో పడిన తరువాత ఎంతకాలం జీవిస్తుంది? క్రమంగా శరీరంలోని అవయవాలూ, ఒక్కో భాగమూ పనిచేయడం తగ్గిపోతాయి కదా! ఇప్పుడు ఆమె పరిస్థితి అదే అయింది.

ఆమె క్రమక్రమంగా క్షీణించిపోసాగింది. రోజురోజుకీ అన్నం తినడం కూడా తగ్గించేసింది. ఆమెని చూసిన వాళ్ళు ఇక నెలల మనిషే అన్నారు.

ఆమె మనుమడి పెళ్ళి కనులారా చూసి, తనివితీరా ఆనందించి పరలోకాలకి పోతానంటోంది.

ఆమె కూతుళ్ళకి కూడా సింగయ్యకి తొందరగా పెళ్ళి చేస్తే బాగుండునని వుంది. ఇంట్లోకి మరో ఆడమనిషి వస్తుంది. ముసలమ్మ కోర్కెని తీర్చినట్లూ వుంటుంది.

ముసలమ్మ వంకతో పెళ్ళి చేస్తే, ఆ ముసలమ్మ వున్నన్ని రోజులూ వచ్చిన కోడలితో ఆమెకి కూడా చాకిరీ చేయించుకోవచ్చు.

అన్ని రకాలుగా ఆలోచించిన కూతుళ్ళు సింగయ్యకి తొందరగా పెళ్ళి చేయాలని కుతూహలపడిపోతున్నారు. కొన్ని సంబంధాలు కూడా చూసారు. సింగయ్యకి వాళ్ళు నచ్చితే, వాళ్ళకి సింగయ్య నచ్చడంలేదు. వాళ్ళకి సింగయ్య నచ్చితే ఇతనికి వాళ్ళు నచ్చడంలేదు. ఆ కుటుంబ పరిస్థితీ, కట్నాల గొడవ ఇవి అన్నీ కలిసి ఆ సంబంధాలు బెడిసిపోయాయి.

ఒకసారి మంచంలో పడిన కనకమ్మని చూసిపోదామని అంజమ్మ వాళ్ళ వూరు నించి వచ్చింది. కనకమ్మ భర్తా, అంజమ్మ తండ్రీ స్వయంగా అన్నదమ్ములే!

కనకమ్మ, అంజమ్మకి స్వంత పెద్దనాన్న భార్యే. పెద్దమ్మ అవుతుంది.

అంజమ్మా, ఆమె పెద్దమ్మ కూతుళ్ళూ ఆప్యాయంగా పలకరించుకున్నారు. కనకమ్మ ఆరోగ్యం పరిస్థితీ, బంధువుల విషయం, పొలాల పనుల విషయం, ఊళ్ళో విషయాలూ ఇలాగ కబుర్లు సాగాయి.

చాలా సేపు సంభాషణ అనంతరం కాంతమ్మ అంది. "మనవాడికి మనువు చూడవే మీ వూళ్ళో! అమ్మ మంచంలో పడిన కాడ్నించీ మేం చాలా చూసాం. చివరికి ఒక్కటి కూడా కుదరలేదు. మీ వూళ్ళో మనవాడికి ఈడూజోడూ అయిన వాళ్ళు ఎవరన్నా వున్నారేమొ చూడు. అమ్మ ఏమో మనమడి పెళ్ళి తను బతికి వుండగానే చూడాలంటంది. పాపం ముసలమ్మ కోరి కని ఎందుకు కాదనాలి? "

"కట్నం ఎంతలో వున్నారేంది మీరు? " అంజమ్మ అడిగింది.

"కట్నానిదేముందిలే! మనకి ఆస్తిపాస్తులు ఏమున్నయ్యి కట్నం కోరటానికి! బేపన ముసలమ్మ ఇచ్చిన ఈ ఇల్లు వుంది. ఎవరైనా కట్నం ఇస్తే ఈ ఇంటిని చూసి ఇవ్వాల్సిందే! ముందు మనకి పిల్లని ఇస్తేచాలు, తర్వాత కట్నం విషయం" అంది ఆమె.

"సరే చూద్దాం. పిల్ల దొరక్కపోతుందా మనవాడికి? అసలు ఆడపిల్లలకి కొదువేముందిలే! మావూళ్ళోనే మనకి వరస అయ్యే ఆడపిల్లలు చాలామంది వున్నారు. నాలుగు రోజుల్లోనే మనవాడికి మంచిపిల్లని చూసిపెట్టనూ!"

పెళ్ళి సంబంధాలు చూడటంఅంటే ఆమెకి చాలా సంతోషం కలిగించే విషయం. ఆమె అంతకుముందు రెండు సంబంధాలు మాట్లాడి పెళ్ళి చేసింది.

ఆమె మాట్లాడి పెళ్ళి చేసిన ఆ రెండు జంటలూ అన్యోన్యంగానో, తిట్టుకుంటూ కొట్టుకుంటూనో మొత్తానికి విడిపోకుండా కాపురాలు చేస్తున్నారు. తను పెళ్ళిచేస్తే వాళ్ళు కలకాలం చల్లగా, సుఖంగా వుంటారని ఆమె ప్రగాఢ నమ్మకం.



పెళ్ళి సంబంధాలు మాట్లాడటం అంటే ఆమెకి ఎక్కడలేని వుత్సాహమూ రావడానికి ఇంకా కారణాలు వున్నాయి.

ఫలానా అంజమ్మ మాట్లాడి పెళ్ళిచేసిందని రెండువైపుల వాళ్ళూ తన పేరు చెప్పుకుంటారు. తను పెళ్ళి పెద్దగా వ్యవహరించవచ్చు పెళ్ళినాలుగు రోజులూ పెళ్ళి పెత్తనం చేయవచ్చు

ఇక వేరే వూరి సంబంధం అయితే ఆ సంబంధం కుదుర్చుకునేటప్పుడూ, కట్నాల బేరసారాలు సాగేటప్పుడూ, లగ్నాలు పెట్టుకునేటప్పుడూ, ప్రతాణం సందర్భంలోనూ, పెళ్ళప్పుడూ ఇలా ఐదారురోజులపాటు పెళ్ళికి సంబంధించిన పనులమీద ఇతరుల ఖర్చుతో వూళ్ళమీదపడి తిరగవచ్చు ఇన్ని కారణాలు వున్నాయి కాబట్టే అంజమ్మకి పెళ్ళి సంబంధాలు మాట్లాడటం అంటే అంతులేని ప్రీతి.

కాంతమ్మ నోటినుంచి ఎప్పుడైతే సింగయ్యకి మనువు మాట్లాడమనే మాటలు వచ్చాయో ఆ క్షణంలోనే అతనికి సరయిన జోడీ తమ వూళ్ళో ఎవరు వున్నారా అని అంజమ్మ మస్తిష్కంలో ఆలోచనల సుళ్ళు తిరగడం మొదలుపెట్టాయి.

ఆమె చాలామంది అమ్మాయిల్ని గురించీ, కుటుంబాల్ని గురించీ ఆలోచించింది. అలా ఆలోచించగా చివరికి ఆమెకి నాసరయ్య కూతురు సుశీలే సింగయ్యకి తగిన అమ్మాయిగా, వాళ్ళదే అనువైన సంబంధంగా అనిపించింది.

ఊరినించి వచ్చిన మరుక్షణమే కార్యరంగంలోనికి దూకింది.

పని వున్నట్లుగా నాసరయ్యగారి ఇంటికి వెళ్ళి, సుశీల పెళ్ళి ప్రస్తావన తీసుకువచ్చి వాళ్ళ నోటితోనే సంబంధాలు చూడమనే మాట అనిపించుకుని, సింగయ్యని తీసుకువచ్చింది.

★ ★ ★

పొలంనించి వచ్చిన నాసరయ్యకి సుశీలని చూడటానికి సింగయ్య వచ్చిన విషయాన్ని చెప్పింది రాగమ్మ.

"పిల్లోడు బాగున్నాడా?" అడిగాడు నాసరయ్య.

"బాగున్నాడయ్యా. మంచి మనువే అనిపిస్తుంది పెద్దగా ఆస్తిలేకపోయినా పిల్లవాడు బుద్ధిమంతుడు. లేతవాడు. మన పిల్లకి సరైన జోడీ అనిపిస్తున్నాడు. మంచిరోజు చూసుకుని రమ్మన్నారు"

"అయితే మంచిరోజు చూసుకునేపోదాం"

"మనం ఆలస్యం చేస్తే బాగుండదు. రేపూ, ఎల్లుండిలోనే పోవాలి మనం. పిల్లవాడి అమ్మమ్మ మంచంలో పడిందంట!. ఆమె బతికి వుండగా కళ్ళముందే పెళ్ళి చేయాలని తొందరపడతన్నారు. మన పిల్లని వెతుక్కుంటా ఇంటికి వచ్చిన అద్రుష్టాన్ని ఎందుకు పోగొట్టుకోవాలి? వాళ్ళు తొందరపడతన్నప్పుడు మనం ఆలిస్సెం చేయకుండా, వెంటనే మూడుముళ్ళూ వేయిస్తే సరిపోయిద్ది!"

"కానియ్యవే, కలకాలం కాపురం చేయాల్సిన వాళ్ళు. వాళ్ళ ముసలమ్మ మంచంలో పడిందని మనల్ని వురకమంటేయట్ట? మంచీ చెడూ తెలుసుకోవద్దూ? పిల్లవాడు బాగుండగానే సరిపోయిందా? అన్నీ చూసే చేద్దాం"

"మంచీ చెడూ చూసే చేద్దామయ్యా! అన్నీ చూడకుండా గోతిలో దిగితే కూరకపోతాం. చూడకుండా చేద్దామని నేను అనటంలా? అయితే మనం రోజులు గడపొద్దు. మనం ఆలిస్సెం చేస్తే ఇంకో సమ్మంధంవస్తే వాళ్ళు అటు మొగ్గు చూపుతారు. మనపిల్ల ఏమాత్రపుదేంది. వాళ్ళు మన పిల్లకోసం పడి వుండటానికి! మన పిల్ల మనకి




ఎక్కువైతే వాళ్ళకి ఎక్కువ కాదుగా? "

"సరేలేవే! రేపొద్దున్నే పంతులు దగ్గరకి పోయి మంచి రోజెప్పుడో కనుక్కుని వస్తా, పంతులు చెప్పిన మంచిరోజున పోదాం" అన్నాడు నాసరయ్య.

★ ★ ★

ఒక మంచిరోజు చూసుకుని రాగమ్మా, నాసరయ్యా, అంజమ్మా చందలూరు ప్రయాణమయ్యారు, సింగయ్యకి సంబంధించిన విషయాలు తెలుసుకుని సంబంధం ఖాయ పరుచుకోవడానికి.

"ముగ్గురు కదిలితే ముడిపడదేమొ రాగమ్మా! మనకితోడు నాలుగో మనిషిని ఇంకొకరిని చూడండి. నలుగురు కలిసిపోతే బాగుండిద్దంటారు పెద్దోళ్లు" అంది అంజమ్మ.

"ఇప్పుడు మనకి నాలుగోమనిషి ఎవురు దొరుకుతారబ్బా? బయల్దేరేటప్పుడు రమ్మంటే ఎవురు వస్తారు? " అన్నాడు నాసరయ్య.

"మీ అప్ప ఏమన్నా వచ్చిద్దేమొ కనుక్కుని రాయ్యా! మనం తప్పుపని చేశాం. మనలో మనకి తగాదాలు వుంటే వున్నయ్యిగాక శుభకార్యం అప్పుడు ఏం తగాదలు? ఆమెకి ముందుగానే చెప్పివుండాల్సిందికదూ! ఇప్పుడు బయల్దేరమంటే ఆమె ఎంతగా నిష్టూరపడిద్దో! మేం అనుకోకుండా ఇప్పటికిప్పుడు బయల్దేరుతున్నామని అబద్ధం చెప్పు. మరి ఏం చేద్దాం? " అంది రాగమ్మ.

"మా అప్పకి ముందుగా ఒకమాట చెప్పి వుంటే బాగుండేది. సరే పోయొస్తా" అని వాళ్ళ అక్కగారింటికి వెళ్ళాడు నాసరయ్య.

ఆయన చెప్పిన వెంటనే ఆమె ప్రయాణానికి సిద్ధమైంది.

నలుగురూ చందలూరు వెళ్ళారు.

వీళ్లు ఆ వూరు వెళ్ళిన ముందురోజే సింగయ్య అమ్మా, నాన్నా కూడా వాళ్ళ వూరునించి వచ్చివున్నారు, వీళ్లు వస్తారనే ఉద్దేశంతో ఎదురుచూస్తూ.

"మా ముగ్గురు అక్కచెల్లెళ్ళకీ, మా అమ్మకీ వీడు ఒక్కడేనమ్మా పెంపకం! మేం అందరం వీడంటే పేణం విడుస్తాం. మా అందరికీ వీడంటే అంత బెమ! వాళ్ళ అమ్మ కన్నదీ, మా చేతుల్లో పడేసి వాళ్ళ వూరు పోయిందీ! సరే, పిల్ల మా వాడికి నచ్చింది. వాడికి నచ్చితే చాలు, మా అందరికీ నచ్చినట్టే. అయితే కట్నం మాత్రం మావాడికి తగ్గట్టు ఇవ్వాలి మీరు" అంది సింగయ్య పెద్దమ్మ సుబ్బమ్మ.

"మీ వాడికి తగ్గట్టు అంటే ఎంత వున్నారేంది మీరు? మా తాహతుకొద్దీ, మేం మా పిల్లకి వెనకాడకుండా బాగానే ఇస్తాం కట్నం! మీ వాడికి తగ్గట్టు అంటే ఎంత అనీ? " అంది నాసరయ్య అక్క.

"మొన్న పగివేలు డబ్బూ, అరెకరం పొలం, రెండు సవర్లు బంగారం పెడతామని రామాపురంనించి ఒక మనువు వచ్చింది" అని రెండో ఆమె చెప్పడం ప్రారంభించింది.

"ఆ మాటలన్నీ ఎందుకులే అప్పా! వీళ్ళకి వెనకా, ముందూ పెద్దగా ఆస్తి ఏం లేని వాళ్లు. పెళ్ళికి ఇంకా ఒక పిల్లవాడూ, పిల్లా వున్నారు. రెక్కల కష్టంమీద బతికేవాళ్లు" అంది అంజమ్మ.

"అయినా మనవాడికి తగ్గట్టు ఇవ్వాలి కదా? " అని సింగయ్య చిన్న పిన్ని అక్క మాటనే మాట్లాడింది.

"వీళ్ళకి తగ్గట్టు ఇస్తారుకానీ, మనవాడికి సరిపోయినంత ఇవ్వలేరులే అప్పా! ఎందుకు మాటలు? కట్నంగా నాలుగువేలు డబ్బూ, పిల్లవాడికి సైకిలూ, వాచీ పెడతారు. అంతకంటే ఎక్కువ వీళ్ళని కోసినా ఇవ్వలేరు" చెప్పింది అంజమ్మ.

"అట్ట అంటే ఎట్ట అప్పా? " చిన్నామె



అంది.

"మరీ ఇంత తక్కువ అయితే ఎట్ట కుదిరిద్ది? "

"అమ్మాయికి కాలు కూడా కొద్దిగా అపుడు అంటం(డ్రీ!" అని నలుగురూ నాలుగువైపులనించి ప్రశ్నల వర్షం కురిపించారు.

"వీళ్ళు ఎక్కువ కట్నం ఇస్తే వున్న అవుడు పోయిద్దా? మనవాడికి మాత్రం ఆస్తి ఎంత వుంది? పిల్ల చక్కని చుక్క, అసలు అలాంటి పిల్ల ఎదురుకట్నం ఇచ్చినా మనకి దొరకదు" అని అంజమ్మ వాళ్ళకి తగినరీతిలో నవ్వుతూనే జవాబులు చెప్పింది.

సుశీలకి నాసరయ్య కట్నం ఎంత ఇవ్వగలడో సింగయ్య వాళ్ళకి స్పష్టంగా తెలుసు. అంజమ్మ మొదటిసారి వచ్చినప్పుడే వాళ్ళకి అన్ని విషయాలూ వివరంగా చెప్పింది.

అయినా ఇంకా ఎక్కువ కట్నం రాబట్టాలని వాళ్ళ ఆశ.

గంటా, రెండు గంటలసేపు బేరసారాలు సాగాయి. చాటుగా వెళ్ళి మాట్లాడుకోవడం, ఒకర్ని ఒకరు అరుచుకోవడం, మళ్ళీ నవ్వుకోవడం, అంతకు కాదు పొమ్మనడం, అంతకంటే ఇవ్వలేమనడం, కోపాలూ, ఆ వెంటనే పరిహాసాలతో బేరసారాలు ముగిసాయి.

చివరకు కట్నంగా ఐదువేలు డబ్బూ, వాచీ, సైకిలూ అరసవర బంగారంతో ఉంగరం చేయించేటట్లు అంగీకారం కుదిరింది.

తను అనుకున్నదానికంటే వెయ్యి రూపాయలు అదనంగా పడ్డాయని నాసరయ్య గునుస్తూనే వున్నాడు.

"మరి లగ్గాలు ఎప్పుడు పెట్టుకుందాం? " అడిగింది రాగమ్మ.

"మేం కూడా మాకు కాబోయే కోడల్ని చూడాలికదా! ఆరోజు లగలగమని పిల్ల వాడ్ని ఒక్కడ్నే మా అంజమ్మ తీసుకుపోయి పిల్లని చూపెట్టే! సరే, వాడికి నచ్చితే మా అందరికీ కూడా నచ్చినట్టే అనుకోండి. అయినా చూడకుండా పేణం వూరుకోదుగా. రేపు మేం మీ వూరు వస్తాం. అక్కడ పెట్టుకుందాం లగ్గాలు" అంది సింగయ్య అమ్మ.

"మరి మీకు పిల్ల నచ్చకపోతే? " సందేహపడింది రాగమ్మ.

"నచ్చకుండా ఎందుకు వుండిద్దిలే! ఏదో చూడాలంటే చూడాలనుకోవడమే! అసలివాడికి నచ్చిన తరవాత ఇంక మాదేముంది, కొసరివాళ్ళమేగా మేం. చేసుకునేది వాడు. వాడి కంటికి నచ్చింది. ఏదో నామకార్థంగా మేం చూడటమే"

"మా ఇళ్లలో ఆడపిల్లగారింటిలోనే లగ్గాలు పెట్టుకోవడం ఆనవాయితీ! అట్టయితేనే మాకు కలిసొచ్చిద్ది. పెళ్ళికొడుకు ఇంటో లగ్గాలు పెట్టుకుంటే మాకు అచ్చుబాటు కాదు. రేపు మీ వూళ్ళోనే లగ్గాలు పెట్టుకుందాం. మేం పిల్లని చూసినట్టూ వుండిద్దీ, వెనకటినించీ వస్తున్న ఆచారాన్ని పాటిచ్చినట్టూ వుండిద్దీ" అంది సింగయ్య పెద్దమ్మ.

"సరే, అట్టే కానివ్వండి. అయితే మనువు కుదిరినట్టు ఇయ్యాల పండూ పసుపూ తీసుకుందాం. తరవాత మాట పోకుండా అందరికీ బాగుండిద్ది" అంది అంజమ్మ.

"సరే" అన్నారు అందరూ.

సుశీలకీ, సింగయ్యకీ మనువు కుదిరినట్లూ, వాళ్ళ ఇద్దరికీ పెళ్ళి నిర్ణయమైపోయినట్లే అనీ నిశ్చిత తాంబూలాలు అంటే ఒకరినించి ఒకరు ఆకులూ, పండ్లూ, పసుపూ ఇచ్చిపుచ్చుకున్నారు.

మరుసటిరోజు సింగయ్య తండ్రీ, తల్లీ, పెద్దమ్మా, పిన్నమ్మలు అందరూ నాసరయ్య వాళ్ళ వూరు వెళ్ళి, సుశీలని చూసి, వాళ్ళ




పెండ్లికి లగ్నాలు పెట్టుకున్నారు.



సుశీలకి ఇంకా పదమూడో ఏడు కూడా రాలేదు. సింగయ్యకి పద్ధెనిమిదో ఏడు కొద్ది రోజులముందు వచ్చివుంటుంది.

బాల సుశీలకీ, బాల సింగయ్యకీ వివాహమైంది.

ప్రభుత్వం ఒకవైపు బాల్యవివాహాల్ని నిషేధించామనీ, బాల్యవివాహాలు చేయడం చట్టప్రకారం శిక్షార్హమనీ ప్రకటిస్తుండగానే, మరోవైపు స్వేచ్ఛగా, యధేచ్ఛగా, భారీ సంఖ్యలో బాల్యవివాహాలు జరుగుతూనే వున్నాయి.

1981 జనాభా గణాంక వివరాల ప్రకారం ప్రతి సంవత్సరం దేశంలో 45 లక్షల పెళ్ళిళ్లు జరుగుతున్నాయి. ఆ 45 లక్షల పెళ్ళిళ్ళలో 35 లక్షల మంది పెళ్ళికుమార్తెల వయస్సు 12-17 సంవత్సరాల మధ్యనే వుంటున్నదట. దేశంలో పెళ్ళవుతున్న ఆడపిల్ల సగటు వయస్సు పరిగణిస్తే 15.7 సంవత్సరాలుగా వుంటున్నదని ప్రభుత్వ లెక్కలే చెబుతున్నాయి.

పల్లెటూరూ లేదూ, పట్టణమూ లేదూ, నగరమూ లేదు.

కులం, మతం, జాతీ, తెగా ఏదీ లేదు.

విద్యావంతులూ లేదూ, విద్యావిహీనులూ లేదు.

అన్ని ప్రాంతాలలోనూ, అన్ని కులాలు, మతాలలోనూ, అన్నివర్గాలలోనూ బాల్యవివాహాలు పెద్ద ఎత్తునే జరుగుతున్నాయి. ఏ ఒక్క ప్రాంతానికో ఇవి పరిమితం కాదు. దేశవ్యాప్తంగా జరుగుతూనే వున్నాయి.

అయినా ఏ సంఘసంస్కర్తా ఈ బాల్యవివాహాలకి వ్యతిరేకంగా, వీటిని నిరసిస్తూ కృషిచేయడంలేదు.

ఏ ఉద్యమకారుడూ ఈ అనాగరిక, ఆటవిక, అసహ్యకర సంస్కృతికి వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్వహించడంలేదు. పోరాడటంలేదు.

కందుకూరి, గురజాడలాంటి మహనీయుల కృషివలన పాలుతాగే పసిపిల్లలకి వివాహాలు చేసే దుష్ట సంస్కృతి అంతరించిపోయింది. అయితే ప్రస్తుతం 10-15 సంవత్సరాల మధ్య వయస్సుగల బాలికలకు పెళ్ళిళ్లు చేసే సంస్కృతి అమలులో వుంది. ఈ నీచసంస్కృతికి వ్యతిరేకంగా మరో ఉద్యమం లాంటిది నిర్వహించకపోతే తప్ప ఇవి ఆగేలా లేవు.

ముఖ్యంగా ఈ వివాహాలు పేద, మధ్య తరగతి కుటుంబాలలోనే ఎక్కువగా జరుగుతున్నాయి.

ఈ బాల్యవివాహాలు భావితరాల్ని ఎదగనీయడంలేదు.

కొన్ని లక్షలమంది ఆడపిల్లల శారీరక, మానసిక వికాసానికి ఈ వివాహాలు ప్రతిబంధకంగా వుంటున్నాయి.

మనుషులుగా ఎదగకముందే, మానసిక పరిపక్వత రాకముందే జరుగుతున్న ఈ పెళ్ళిళ్లు వాళ్ళ పాలిట శాపాలుగా, వాళ్ళకి పెద్ద గుదిబండలుగా పరిణమిస్తున్నాయి. సంపూర్ణంగా ఎదగనీయక మొగ్గలోనే వాళ్ళ భావిజీవితాల్ని భస్మీపటలం చేస్తున్నాయి.

పూర్తిగా బాల్యం అనుభవించకుండానే, ఆడుతూ పాడుతూ సంతోష తరంగాలతో నిండిపోయే వాళ్ళ బాల్యం పూర్తిగాకముందే వాళ్ళ జీవితాలే పరిసమాప్తమవుతున్నాయి.

పసివాడకముందే బుసబుసమని పొంగే బాల్యం బుగ్గిపాలవుతోంది.

రోగాలతో, అకాల వృద్ధాప్యంతో, ఉసూరుమంటూ జీవశ్ఛవాలుగా నిస్తేజంగా వాళ్ళు జీవితాల్ని వెళ్ళదీయాల్సివస్తోంది.

1929లోనే బాల్య వివాహనిరోధకచట్టం వచ్చినా ఈనాటికి కూడా పకడ్బందీగా, ఖచ్చి

తంగా, నిర్మాణాత్మకంగా, ఒక నిబద్ధత ప్రకారం అమలు జరపకపోవడంతో ఎందరెందరో ఆడపిల్లలు కన్నకలలు కల్లలవుతున్నాయి.

పచ్చగా, కళకళలాడుతూ వుండాల్సిన వారి వదనాలు కళావిహీనంగా, నిస్సారంగా మోడులైపోతున్నాయి.

★ ★ ★

పెళ్ళయినకొద్దిరోజులకి తల్లి రాగమ్మ కన్నీటి వీడ్కోలుతో భర్త నీడలో జీవితాంతం గడపటానికి సుశీల మెట్టినింటికి కాపురానికి వెళ్ళింది.

"అమ్మాయి సుశీలా... ఆ ముసిల్ది ఆకలో ఆకలో అని ఒకటే గోల చేస్తోంది. దాని ముకాన కుండలో కూడుయేసి, కొద్దిగా కూరాకు కూడాయేసి పెట్టమ్మా! మనల్ని చంపక తింటానికి అది ఇంకా బతికివుంది" విశ్రాంతిగా మంచంమీద పడుకుని, అట్టతో గాలి విసురుకుంటూ పెద్ద సుబ్బమ్మ సుశీలకి పని పురమాయించింది.

అప్పుడే చెరువుకి వెళ్ళి ఇంట్లో వున్న అందరి బట్టలూ వుతుక్కువచ్చింది సుశీల. చెరువునించి లోనికి అడుగుపెట్టిన క్షణమే సుశీలకి పనిచెప్పింది ఆమె.

చెరువునించి తెచ్చిన బట్టలు అన్నీ ఆరవేసిన సుశీల, కంచంలో అన్నం పెట్టుకుని ముసలమ్మ దగ్గరకి తీసుకుపోయింది.

"ఆ కూడు చూస్తుంటే ఏందో పురుగుల్ని చూసినట్టు నాకంటికి అగుపిస్తందే! నా అంతట నేను కలుపుకుని చూస్తా చూస్తా తినలేను. కొద్దిగా కలిపి నోట్లో పెట్టు తల్లీ, ఎట్టో కట్ట దిగమింగుతాను" అంది ముసలమ్మ.

సుశీల అన్నం కలిపి ఆమె నోట్లో పెట్టింది.

"నన్ను యములాళ్లు రమ్మంటన్నారు. మనమడి పెళ్ళి కళ్ళారా చూసిపోతా... పోతా... పోతా..." అని కలవరించిన కనకమ్మ, పెళ్ళయిన వెంటనే జవసత్వాలు పుంజుకుని పునరారోగ్యవంతురాలైంది.

ఆ జీవం వుండటానికి మంచంమీదనే వున్నా కూతుళ్ళకి పనులు పురమాయించడం, వాళ్ళని తిట్టడం, పడుకునే గలగలా అరవడం, ఎక్కువగా మాట్లాడటం ఆమెకి వున్న లక్షణాలు.

కూతుళ్ళు ఆమెని ఏం పట్టించుకోరు. మంచంలో పడిన మొదట్లో కొద్దిగా బాధ్యతగా ఆమెని చూశారు. ఆమెకి అవసరమైన పనులు చేశారు.

నిజానికి ఆ కూతుళ్ళకి వాళ్ళ పనులు చేసుకోవటానికే వాళ్ళకి వళ్లు కాదు. అలాంటిది మంచంలో పడిన తల్లిపని చేయాలంటే వాళ్ళకి ఎక్కడ లేని విసుగూ, చిరాకూ కలుగుతోంది.

ముసలమ్మ వాళ్ళకి చాలా బరువుగా భావిస్తున్నారు. ఆమెకి చేసే పనులు అనవసరమైనవిగా, వృధాగా కనబడుతున్నాయి.

"ఎప్పుడైనా చచ్చేదేకదా! తొందరగా చస్తే పీడా వదిలిపోతుంది. బతికి, మనల్ని బాధలు పెట్టడం తప్ప ఏం ఉపయోగం?" అని పెద్దగానే తేల్చి మాట్లాడుతున్నారు.

"చావు వస్తే చెప్పి వచ్చిద్దా? నాకూ చద్దామనే వుంది. కానీ ఏం చేసేదీ, చావు రాకపోతందే" అని ముసలమ్మ అంటోంది.

ముసలమ్మకి చాకిరీ చేయడం కూతుళ్ళకి సమస్యగా కూడా తయారైంది. తిండి తినడానికి సిద్ధంగానే వుంటుంది కానీ స్నానం చేయాలంటే ససేమిరా కాదంటుంది.

మంచంలో పడిన మనిషి! స్నానం లేకపోతే ఎలా? వాసన కూడా భయంకరంగా వస్తోంది అప్పుడప్పుడూ!

ఆ తల్లికి స్నానం అంటే ఎంత చీదరో, కూతుళ్లకి కూడా ఆమెకి స్నానం చేయించాలంటే అంతే చీదర కలుగుతోంది.




అలాంటి సమయంలోనే సుశీల ఇంట్లో అడుగుపెట్టింది.

ముసలమ్మ అంటే కూతుళ్లకి బాగా విరక్తి పుట్టినదశలోనే సుశీల ఆ ఇంట కాలు మోపింది.

ఏ తల్లి కన్నబిడ్డో, వేరే వూళ్లో పుట్టి, పెరిగి, కనకమ్మకీ, ఆమె ముగ్గురు కూతుళ్ళకీ, వాళ్ళ పెంపుడు కొడుక్కీ సేవలు చేయడానికీ, వాళ్ళకి చాకిరీ చేయడానికీ వచ్చిన యంత్రం మాదిరిగా సుశీల వుంది.

సింగయ్య సుశీలని వివాహం చేసుకున్నది ముసలమ్మకి చాకిరి చేయడానికీ, ఆ తల్లులకి సేవలు చేయడానికీ, తనకి సేవలు చేయడానికీనూ!

వివాహం అయిన తక్షణమే సుశీల శరీరంమీదా, మనసుమీదా, భావాలమీదా, కదలికలమీదా, ఆమె శరీరంలోని అణువణువు మీదా అధికారం వచ్చినట్లే ఆ ఇంట్లోనివాళ్లు ప్రవర్తించడం మొదలుపెట్టారు.

అయితే ఒక్కొక్కరిదీ ఒక్కోరకం ధోరణి. ఒక్కోరకం తెలివి!

పెద్దావిడ సుబ్బమ్మ తెచ్చిపెట్టుకున్న ఆప్యాయత కుమ్మరించి మాట్లాడుతుంది. సౌమ్యంగా, మెత్తగా, చావుకబురు చల్లగా చెపుతుంది. 'అమ్మా, అయ్యా' అంటూనే అన్ని పనులూ చక్కగా చేయించుకుంటుంది.

ఎప్పుడూ కోప్పడదు. కోపం తెచ్చుకునే పరిస్థితులు ఆమె కల్పించుకోదు. మంచిగానే, మర్యాదలు చెడకుండానే, లౌక్యంగానే ఆమె తన పనులు అన్నీ సుశీలతోనే చేయించుకుంటుంది.

"అబ్బా... మోకాళ్లు పట్టుకున్నయ్యి. ఆ బొక్కెనలో రెండు చెంబులు వేడినీళ్లు తోడి దొడ్డి దగ్గర పెట్టమ్మా! ఆ చెంబుతోనే రెండు చెంబులు చన్నీళ్లు కూడా పోయి తల్లీ బొక్కినలో..." అని స్నానానికి నీళ్లు దొడ్లో పెట్టించుకుంటుంది.

"అన్నం పొంగు వస్తుందట్టుగా వుందమ్మా సుశీలా... తొందరగా గంజివార్చు" అని పొయ్యికి దగ్గరలో కూర్చుని అన్నం వండిస్తుంది.

"ముసిల్ది నిన్న గుడ్డలన్నీ రోతరోత చేసి వదిలిపెట్టింది. అవి వేరేగా చెరువు దగ్గరకి తీసుకపోయి వుతుక్కురా తల్లీ! ముసిల్ది తొందరగా పోతే బాగుండు! ఉండి మాత్రం మనల్ని అల్లాడించటం తప్ప ఏం లాభం? "

ముసలమ్మ భారం అయినట్లు తిడుతూ. తప్పనిసరి అయినట్లుగా ఆ రోత బట్టలు సుశీలతో ఉతికిస్తుంది.

"ముసిల్ది గంటనించీ కూడో కూడో అని గోల చేస్తుంది. దాని పళ్లెంలో రెండు ముద్దలు కూడువేసి దాని ముకాన తగలెయ్యమ్మా!" అని సుశీలతో ముసలమ్మకి అన్నం పెట్టిస్తుంది.

"ఎలాగూ కూటికుండలో చేయిపెట్టి చేతికి చేసుకున్నావుకదా! ఆ చేతులతోనే నాక్కూడా నాలుగుముద్దలు వేసి తీసుకు రామ్మా తల్లీ!" అని నడిమంచంమీద కూర్చుని కంచంలో భోజనం కూడా పెట్టుకోకుండా సుశీలతో పెట్టించుకుని తింటుంది.

ముసలమ్మ మూడో కూతురు కాంతమ్మది అక్కకి పూర్తి విరుద్ధ స్వభావం.

వాళ్ళకి ఒక గేదెవుంది. ఆ గేదెకి సంబంధించిన పనులు అన్నీ కాంతమ్మే స్వయంగా చేసుకుంటుంది.

అది ఆమె స్వంతగేదె. తనకి పాడివుంది. ఆ పాడిని ఇంట్లో అందరూ తాగుతున్నారు కాబట్టి, అందరూ తనకి అణిగిమణిగి వుండాలనీ, లొంగివుండాలనీ ప్రత్యక్షంగా గాకపోయినా పరోక్షంగా హెచ్చరిస్తుంది.

ఆ గేదెని విప్పుకుపోయి వాగులవెంట మేపుకుని తోలుకువస్తుంది.

"అబ్బా... ఇవ్వాళ అంతా ఎండలో బర్రె చేలల్లోపడీ, చెరువుల్లో పడీ తెగతిప్పి అల్లాడించింది. పాడుబర్రె, అమ్మేసినా అడ్డం లేకుండాపోయిద్ది" అంటుంది ఒకసారి.

"తిండికి తిమ్మరాజూ పనికి పోతరాజని ఇంట్లో అందరూపడి పాలూ, పెరుగూ, మజ్జిగలూ తాగేవాళ్ళే! దానికి ఒక్కరు గాక పోతే ఒక్కరు ఒకపూట గడ్డో, గాదమో తీసుకొచ్చి మేపరు. అన్నిటికీ నేనొక్కదాన్ని చావాలి" అంటుంది మరోసారి.

ఒకరోజు పెద్ద గంపనిండా బట్టలు చెరువుకి తీసుకుపోయి ఉతుక్కువచ్చింది సుశీల. అయితే ఆ బట్టల్లో కాంతమ్మ చీరలేదు. ఉతుక్కు తీసుకుపోవటం మర్చిపోయింది సుశీల.

ఇక ఆ పూట అంతా కాంతమ్మ తిట్టిన తిట్టు తిట్టకుండా సుశీలని తిట్టివదిలిపెట్టింది. "పూటకి సోలెడు మజ్జిగ అయితే దూడ తాగినట్టు తాగుతా? మూడు పూటలా మూడు కంచాలు అయితే మింగుతా? ఆ కోక కనపడలా నీకు? అదేం చిన్నదా చితకదా? రవిక ముక్కా కనపడలేదు అనుకోవటానికి! అన్నీ ఉతుక్కుని వచ్చేదానికి నా ఒక్కదాని కోక ఎక్కువయిందీ? నా కోకని ఉతుక్కురావడం నీకు బరువైనప్పుడు నా బర్రె పాడి కూడా తాగవాకు! నీకు సిగ్గూశరం, చీమూ నెత్తూరూ, రోసం కేసం వున్నదానివయితే రేపట్నించీ నా గుడ్డలు ఉతుక్కుని రావాకూ, నా బర్రె పాడి తాగవాకూ!" అని కాంతమ్మ హీనంగా, సుశీలని చెడామడా తిట్టింది.

అన్నిటికీ సుశీల మౌనంగా వుంది.

ఎవరు తిట్టినా సుశీల ఎదురుమాట్లాడదు. బదులు చెప్పదు. ప్రతిగా మాట్లాడితే ప్రయోజనం శూన్యం అని సుశీల గ్రహించి, మౌనంగా వుండటమే శ్రేయస్కరమని అలాగే అలవాటు చేసుకుంది.





సుశీల మౌనంతో ఆమె ఇంకా పేట్రేగి తిట్టింది.

కాంతమ్మ గేదెపనులు స్వంతంగా చేసుకున్నా తన పనులు మాత్రం అరచీ, గొడవపడీ, కోప్పడీ, తిట్టీ చేయించుకుంటుంది. రోజుకి ఒక్కసారి అయినా ఏదో ఒక సందర్భంలో, ఏదో ఒక వంకపెట్టి సుశీలని తిట్టనిదే ఆమెకి నిద్రపట్టదు.

ఇక సుశీల నాలుగో అత్తా, చిన్న అత్తా అంకమ్మ. సుశీలని ఎప్పుడూ ఒక్కమాట కూడా అనదు. తనకి నీళ్లు తోడమనీ, అన్నం పెట్టమనీ, ఆ పని చేయమనీ, ఈ పని చేయమనీ ఎప్పుడూ పనులు పురమాయించదు. అయితే తను మాత్రం పనులు చేయదు.

పని చేయాలంటే ఆమెకి ఎక్కడా లేని వీరబద్ధకం వస్తుంది. ముగ్గురు అక్కల తరువాత పుట్టింది కాబట్టి వంటపని అనేది ఆమెకి అలవాటు కాలేదు. చిన్నప్పట్నించీ వాళ్లే చేసుకుంటూపోయేవాళ్లు కనుక ఆమెకి వంట చేయటం రాదు.

ఇరుకూ ఇబ్బందీ అయినప్పుడైనా పొయ్యి ముందుకి వెళ్ళాలంటే ఆమెకి చాలా కష్టం. ఇబ్బంది అనిపిస్తుంది. అందుకే ఎప్పుడూ పొయ్యి దగ్గరకి వెళ్లదు.

ఇంట్లోనూ, ఇంటిముందు మాత్రం రోజుకి రెండుసార్లు చక్కగా చిమ్ముతుంది. ఇంట్లో ఎక్కడ చెత్తా, పీచూ కనపడ్డా విజృంభించి చీపురు అందుకుంటుంది. పొయ్యి ముందుకి వెళ్ళటం ఆమెకి ఎంత కష్టమో చిమ్మటం అంత ఇష్టం.

ఇక రోజూ అరకిలోమీటరు దూరంలో వున్న మంచినీటి బావికి వెళ్ళి మంచినీళ్లు తీసుకువస్తుంది. దగ్గిరలో వున్న బావినించి ఉప్పునీళ్లు తెస్తుంది.

చిల్లరకొట్టుకి వెళ్ళి బియ్యం, కందిపప్పూ, చింతపండూ లాంటివి ఏరోజుకారోజు కొనుక్కువస్తుంది. అంతే. ఆమె పని తీరిపోతుంది.

ఇక నిద్రే! ఆ నిద్రమాత్రం కుంభకర్ణుడి నిద్రే. కూలిపనులు లేని రోజుల్లో ఉదయం తొమ్మిదీ, పదీ గంటలకి మంచం ఎక్కితే, ఇక సాయంత్రం ఐదు గంటలు అయితేనే ఆ మంచంమీదనించి కిందకు దిగుతుంది. ఈమధ్యలో ఏ ప్రళయం, ఉపద్రవం వచ్చినా ఆమె మాత్రం తన నిద్రకి భంగం కలిగించుకోదు.

అంకమ్మవలన సుశీలకి పెద్దగా ఇబ్బంది ఏంలేదు. పెత్తనం చేయదు. మాట అనదు. పనులు చెప్పదు.

అంకమ్మకి చెందిన బట్టలు ఉతికేపనీ, వంటపనీ సుశీల ఇష్టంగానే చేస్తుంది. అంకమ్మవలన ఇంట్లో కొంతపని తను చేయకుండా తగ్గుతోంది. ఆమే నీళ్లు తెస్తుందీ, చిమ్ముతుందీ, కళ్ళాపి చల్లుతుందీ! ఆమె కానీ చేయకపోతే, చచ్చినట్లు ఆ పనులు అన్నీ తన భుజస్కంధాలమీద పడేవే!

వాళ్ళకి తెలియకుండానే శ్రమ విభజన వుంది కాబట్టి వాళ్ళ మధ్య స్నేహపూరిత వాతావరణమే వుంది. సుశీల కూడా అంకమ్మ అంటే బాగా ఇష్టపడుతుంది.

“రేపు చస్తాను, మాపు చస్తాను, చావు రావడంలేదు” అని కేకలు పెడుతున్న కనకమ్మ సుశీల రావడంతో గట్టిపడింది. చావుకి సిద్ధమైన మనిషి కాస్త తిప్పుకుంది.

అంతకుముందు ఆమెకి వేళకి ఎవరూ అన్నం పెట్టేవాళ్ళు కాదు. ఆమె అడగగా, అడగగా ఎప్పుడో ఒక సమయంలో కంచంలో కాస్తంత వేసుకువచ్చి “తిని చావ్వే ముండా. మాకు ఎందుకు పంపకం అయ్యావే నువ్వు” అని తిడుతూ కంచం ఆమెముందు పడేసి వెళ్ళిపోయేవాళ్లు.

“అయింది రాండే... అయింది మజ్జిగ కూడు వేయండే!” అని మజ్జిగ అన్నంకోసం ఇరుగింటికో, పొరుగింటికో వెళ్ళిన వాళ్ళని, ఆ తిన్నకూర తిండి అరిగిపోయేవరకూ పిలిచినా వచ్చేవాళ్లు కాదు.

పిలిచీ పిలిచీ విసుగుపుట్టి ముసలమ్మ ఇక కంచం కిందపడేసి మంచంపై పవళించేది.

కనీసం ముసలమ్మ మంచినీళ్లు కావాలని అడిగినాసరే, అవి ఇవ్వడానికి బద్ధకించి, ఒక తిట్టు తిట్టికానీ ఇచ్చేవాళ్లు కాదు.

ఇప్పుడు సుశీల వచ్చిన తరువాత ఆ పరిస్థితి లేదు. పనిపిల్ల దొరికినట్లయింది వాళ్ళకి. ముసలమ్మకి అన్నం పెట్టమని కొత్తలోనూ, మొదట్లోనూ అత్తలు సుశీలకి చెప్పేవాళ్లు.

ఇప్పుడు వాళ్లు చెప్పినా, చెప్పకపోయినా టంచన్‌గా సుశీల వేళకి అన్నం తీసుకుపోయి ముసలమ్మకి పెడుతుంది. తనకి చేతనయినంతలోనే అన్ని సపర్యలూ చక్కగా చేస్తుంది.

రౌతు మెత్తన అయితే గుర్రం కుంటిందట. అలాగే వుంది ముసలమ్మ ధోరణి కూడా!

సుశీల అన్నం తీసుకుపోయి ఇస్తే “చేయి బాగలేదు, చూపు బాగలేదు. కలిపి నోట్లో పెట్టమ్మా” అనేది.

“కూరలు బాగులేవు. అన్నం బాగులేదు, మజ్జిగ బాగులేదు. ఎప్పుడైనా చేసిన ముకం, తిన్న ముకం. అయితే కదూ చేయడం చేతకావడానికి” అని చడామడా తిట్టేది. విసుక్కునేది. కోప్పడేది. సుశీలతో గొడవపడేది.

“ఆ ముసిల్దానికి మైండుపోయి పిచ్చెక్కింది. దాని మాటలు పట్టిచ్చుకోవాకు సుశీలా! దానికి వేళకి కూడు వేయకూడదు. మాడిస్తేనే దాఖి నోరు బాగుపడిద్ది!” అని అంకమ్మ సుశీలకి నచ్చచెపుతూ తల్లిని తిట్టేది.

ముసలమ్మది విచిత్రతత్వం. ఒక్కోసారి బ్రతిమిలాడుతూ మాట్లాడుతుంది. మరోసారి మంచంలో పడుకునే గలగలమని

గయ్యాళిలా పోట్లాడుతూ మాట్లాడుతుంది. అసహ్యంగా తిడుతుంది.

మనుమడి పెళ్ళి ఉత్తేజమో, సుశీల సపర్యల ప్రభావమో మొత్తానికి ముసలమ్మ ముఖంలో చావు కళ అదృశ్యమై జీవకళ ఉట్టిపడుతోంది.

"ముసిల్ది నెలల మనిషే అనుకున్నాం పెళ్ళికిముందు! పర్లేదు. మనిషి తిప్పుకుంది. ఇంకా కొంతకాలం బతికేటట్టు వుంది చూడబోతే! మనుమరాలి చేతిమహత్యమే ఇదంతా" అన్నారు చాలామంది.

"ఓసాయ్... ఎక్కడికి పొయ్యావే... తొందరగా రావే. జాము కాడ్నించీ కడుపులో మెలి తిప్పి అల్లాడిపోతన్నాను. తొందరగా ఇటుచావు. ఆ బొచ్చె తీసుకొచ్చి మంచం కింద పెట్టి నన్ను కూసోపెట్టు" అని ముసలమ్మ సుశీలని పిలిచింది.

బయట తొట్టి దగ్గర బండెడు అంట్లు వేసుకుని, బూడిదతో సుశీల వాటితో కుస్తీ పడుతోంది.

ఆరోజు ఉదయం వానజల్లుపడి ఇంట్లో ఎవరూ పనికి వెళ్ళలేదు.

కేబుల్ టీవీలో సినిమా వస్తుంటే అంకమ్మ టీవీ వున్న వాళ్ళింటికి వెళ్ళింది.

పెద్దత్త సుబ్బమ్మ ముసలమ్మకి కొంచెం దూరంలో మంచంమీద కూర్చుని వుంది. ఆమె అప్పటివరకూ నిద్రపోయింది. అరగంట క్రితమే నిద్రలేచి, అలాగే మంచం మీద కూర్చుంది.

తరువాత అత్త కాంతమ్మ గేదెని మేపుకుని వచ్చి కట్టేసి, దాని పని పూర్తిచేసుకుంది. ఒక పక్కగా క్రింద కూర్చుని తలదువ్వుకుంది. కాళ్ళు నొప్పిగా బడలికగా అనిపించటంతో కూర్చున్న మనిషి లేవలేదు. పని లేకపోవటంతో కొద్దిసేపు కూర్చుని లేద్దామనుకుంది.




సింగయ్య అన్నం తినివచ్చి సిగరెట్ ముట్టించాడు. సింగయ్యకి అన్నంపెట్టి వచ్చి సుశీల అంట్లు ముందుకూర్చుంది.

ముసలమ్మ పిలిచేటప్పుడు పెద్దత్తలు ఇద్దరూ అలాగే తమని కాదన్నట్లు మౌనంగా కూర్చున్నారు.

అంట్లు తోముతున్న సుశీల ముందు ముసలమ్మ మాటల్ని వినిపించుకోలేదు. వినపడిన తరువాత వెనక్కి తిరిగి చూస్తే అత్తలు ఇద్దరూ తమకేమీ పట్టనట్లు మామూలుగానే కూర్చున్నారు.

వాళ్ళ ఎంతసేపు అలా కూర్చుంటారో చూద్దామనే వుద్దేశంతో సుశీల కూడా అలాగే అంట్లు తోముతూ కూర్చుంది.

"ఓసేయ్ ముండా... రండా... సవితే.. తొందరగా బొచ్చెవేసి నన్ను కూసోపెట్టవే!" అని ముసలమ్మ తిడుతూ పిలుస్తోంది.

"అమ్మాయి సుశీలా.. ముసిల్దానికి బొచ్చె తగలేసి కూసోపెట్టమ్మా! తినటం, ఏరగటం... రెండో పని లేదు దీనికి" అంది సుబ్బమ్మ.

"బూడిద చేతులు అత్తా నాయ్యా! అదుగో బొచ్చె, ఆ గోడ పక్కన వుంది" అంది సుశీల, పరోక్షంగా ఆ పని మీరు చేయండి అని సూచిస్తూ.

"అయినా పర్లేదులేమ్మా! చేతులు కడుక్కునిరా" అంది సుబ్బమ్మ.

"బూడిద చేతులు అయితేం, కడుక్కుని రాకూడదూ? ముసిల్ది ఇందాకట్నించీ దొడ్డికో అని గోల చేస్తుంటే" అన్నాడు సింగయ్య.

"ఇక్కడ నేనేం వూరక కూసున్నానేంది. వూరక కూసున్నట్టు మాట్లాడతావు? అంట్లు తోమటం కనపట్టంలా? "

"ఎందుకు కనపట్టంలా? బాగానే కనపడుతుంది. ముసిల్దాన్ని ఎవుడు కూసోపెడతాడు, నీ అబ్బ!"

"నా అబ్బ వచ్చి ఎందుకు కూసోపెడతాడ్లే

నీ అప్పని! ఎందుకు అట్ల మాట్లాడతావు? ఎప్పుడూ నేను కూసో పెట్టటంలేదా? అక్కడ కూసోపెట్టి, ఆ చేతుల్తోటి కూడు తినే అంట్లు ఎట్టతోమేది? ఆమె మైనంగా కూడా కూసోదు!"

"చేతులు సుబ్బరంగా కడుక్కుంటే ఏమ యిద్ది? కడుక్కుని వచ్చి కూసోబెట్టమ్మో! ముసిల్దానికి నువ్వంటే బాగా బెమ కలి గింది. నిన్న పొద్దున మేం ఎవ్వురిమి కూడు పెట్టబోతన్నా వద్దంటే వద్దంది. ఎక్కడికో పోయిన దానివి నువ్వు వచ్చిందాకా నీకోసం ఎదురుచూసి, నీ చేతుల్తోటి పెట్టించుకుని తింది. ఎనకటికి అంటారు చూశావూ... ముందు వచ్చిన చెవులకంటే యెనక వచ్చిన కొమ్ములు వాడనీ.... కనీ, పెంచీ, పెద్దచేసి ఇంటో వుంచుకున్న మాకంటే, నిన్నగాక మొన్న వచ్చిన నువ్వు దానికి ఎక్కువ య్యావు! నువ్వంటే దానికి అంత ఇష్టం కలి గింది" అంది సుబ్బమ్మ సుశీలని వుబ్బించ డానికీ, అలా వుబ్బించి పని చేయించుకోవ డానికీ.

"తొందరగా రావే... నువ్వొచ్చేసరికి ఆ ముసిల్ది మంచం అంతా గబ్బు పట్టిచ్చిద్ది. రేపు మళ్లీ ఆ దుప్పట్లూ, జమకాణాలూ అన్నీ నువ్వే వుతుక్కుని రావాలి. తొంద రగా కూసోబెడితే ఏ బాధా వుండదు" అన్నాడు సింగయ్య.

అంట్లు తోముతున్న సుశీల వాటిని అక్కడే పడేసి, చేతులు శుభ్రంగా కడు క్కుని, ముసలమ్మ దగ్గరకి వచ్చింది.

సింగయ్య బయటకు వెళ్లిపోయాడు.

సింగయ్య భార్యగా ఆ ఇంట అడుగుపెట్టి నందుకు సుశీల ఆ ముసలమ్మ మలమూ త్రాదులు ఎత్త వలసి వచ్చింది. ఒకరోజు కాదు, కొద్దిరోజులుగా సుశీలకి అది నిత్య కార్యక్రమం అయింది.

వేలాదిమంది ఆడపిల్లలకి మల్లే ఇంటి కోడలు సుశీలకి ఆ ఇంట్లో సమున్నతమైన స్థానం దాసి స్థానం లభించింది.

ఆ ఇంటికి వంటగత్తె సుశీల. దాసి సుశీల. పనిపిల్ల సుశీల. వాళ్ల అందరికీ సేవలు చేసే ఒక యంత్రం, ఒక రోబోట్ సుశీల.

సింగయ్య పక్కలో పడుకుని, అతని శారీ రక అవసరాలు తీర్చే ఒక మిషన్ సుశీల. అతడి కామోద్రేకాల్ని చల్లబర్చే సాధనం ఆమె.

★ ★ ★

"ఎక్కడికి పోయాడే వీడు?" గేదెని మేపుకు తోలుకుపోయి, తోలుకు వచ్చిన కాంతమ్మ సాయంత్రం అడిగింది సుశీలని.

"ఏమో, పొద్దున అనంగా పోయాడు. ఇంతమట్టుకి రాలా! పొద్దున అట్లు చేస్తే తినిపోయాడు, ఇంకా కూటికి కూడా రాలా!"

"ఇట్ట అయితే ఎట్ట? కూరగాయల బేరా నికి పోతే రోజుకి ఇరవయ్యో, పాతికో వచ్చేయ్యి! నిన్నా, ఇయ్యాల బేరానికి కూడా పోలేదుగా! ఇట్ట చేస్తంటే కొంప ఎట్ట జరి గిద్ది? నీకు ఏమని చెప్పిపోయాడు?"

"నాకు ఏం చెప్పిపోతాడు? నిద్రలేచి సరిగా ముకం కూడా కడుక్కోకుండా అట్లు తిని పోయాడు, తొందర తొందరగా ఏదో మునిగిపోతన్నట్టు..."

"నిన్నటి రేత్రి నేను పడుకునేటప్పటికి ఇంటికి రాలా! రోజూ ఇదేందీ? నిన్నరేత్రి వాడు ఏ జాముని వచ్చాడే ఇంటికి?"

"ఎప్పుడో ఏకువజాం గట్ట కోడికూసిన ప్పుడు వచ్చి పొణుకున్నాడు. ఇయ్యాల బాగా ఎండబడి లేచిపోయాడు"

"బాగానే వుండిద్ది ఇట్టయితే! రేయింబొ గుళ్లూ పేకాట ఆడితే మనకి కూడు వచ్చిద్దీ? ఎవురికో జరిగిన అయ్యకి అసుం టియ్యన్నీ జరుగుతయ్! మనసుంటోళ్లం అసుంటి పాటుపడితే తొందరగానే ఆరి

పోతాం! ఇంతకీ వాడికి పేకాటకి డబ్బులు ఎక్కడనించి వచ్చినట్టూ? ఎవురిచ్చారు డబ్బులూ? "

"ఏమో నాకు తెలియదు" అంది సుశీల.

"నువ్వేమన్నా మన సింగాయ్‌కి డబ్బులు ఇచ్చావంటే అప్పా? " సుబ్బమ్మని అడిగింది కాంతమ్మ.

"బొడ్లో సంచిలో ఇరవై రూపాయలు వుంటే చూశాడు. అవి కావాలని అడిగి తీస కపొయ్యాడు"

"నీకు ఎన్నిసార్లు చెప్పానూ, వాడికి డబ్బులు ఇయ్యొద్దనీ! నువ్వు ఇట్ట చేస్తంటే వాడు బాగానే బాగుపడతాడు? పని చెయ్యకుండా, బేరానికి పోకుండా, పేకముక్కల ఆటకి పోతంటే కూడు ఎట్టవచ్చిద్దీ, ఇల్లు ఎట్ట జరిగిద్దీ? "

"పోనీయిలేవే, పసోడు! ఏదో పిల్లతనంగా ఆటకి పోయాడేమొ! ఇంతలోనే ఏందో మునిగిపోయినట్టు అరుస్తావేం? " సుబ్బమ్మ సింగయ్యని సమర్థిస్తూ అంది.

"పసోడు ఏందే? ఎల్లకాలం పసోడేనా? నువ్వు ఇట్ట యెనకేసుకుని వస్తాకదూ వాడ్ని పాడుచేసి వదిలిపెట్టటం! కూర్చుని తింటే కొండలైనా కరిగిపోతయ్యంట! మన మేమన్నా వున్నోళ్లమా, పెద్దోళ్లు సంపాయించిన ఆస్తులు ఏమన్నా వున్నయ్యా, వాడే ఎట్టోకట్ట బతుకుతాడ్లే అనుకోటానికి!"

"సైకిలుకి టైర్లో ఏయ్యో బాగలేవంటలేవే! అవి బాగుంటే బేరానికి పొయ్యే వాడేమొ! అయ్యి బాగలేకపోయేసరికి పోలేదు"

"బాగలేకపోతే బాగు చేయించుకునేది! రేపు అయినా బాగు చేయించుకోవాలిగా! రేపు ఎవురన్నా వచ్చి బాగుచేయిస్తారూ? మగపిల్లోడు అయినవాడు ఇంటిదగ్గర ఏదో ఒక పని చేసుకోవచ్చుగా! నీళ్లు తెచ్చుకోకూడదా, పుల్లలు తెచ్చుకోకూడదా, ఇంకోపని చేసుకోకూడదా, ఏ పని చేసుకోకూడదూ? అన్నిటికీ ఆడముండలు ఎక్కడ తంటాలు పడతారు? సరే పనులు వల్లకాదనుకుంటే ఇంటి దగ్గర వూరకనే కూసోవచ్చుగా! పేకాటకి పోవటం ఎందుకూ? ఇయ్యాల పేకాట అయిద్దీ, రేపు సారయి తాగటం అయిద్దీ, ఎల్లుండి ఇంకొకటి అయిద్దీ, మరొకటి అయిద్దీ! ఎందుకు ఇవన్నీ? " అని కాంతమ్మ కోపంగా మాట్లాడింది.

సుబ్బమ్మ గారాబం, మెతక ధోరణి కారణంగానే సింగయ్య పేకాటకి వెళ్లాడని కాంతమ్మ అభిప్రాయం. అందుకే ఆమె సుబ్బమ్మ మీద కోప్పడింది. అలాంటి విషయాల్ని కాంతమ్మ అసలు అంగీకరించదు.

కాంతమ్మ కోపం చల్లారకముందే, కొద్దిసేపటికి సింగయ్య మెల్లగా, పిల్లిలా ఇంటికి వచ్చాడు.

కాంతమ్మ పొలం నుంచి, గేదెని తోలుకు రాకముందే సింగయ్య ఇంటికి రావాలనుకున్నాడు. అయితే సందేహిస్తూనే, ఇంకొక్క గేమ్ వేసి వెళ్దామనుకుని, గేమ్ ఆడుతూ సమయానికి రాలేకపోయాడు. కాంతమ్మ అంటే సింగయ్యకి మనసులో కాస్త భయమే! అలాంటి ఆటలకి వెళ్తే ఆమె వూరుకోదని అతనికి తెలుసు.

"ఎక్కడికి పోయావురా? " సింగయ్య వచ్చిన వెంటనే తీవ్రస్వరంతో అడిగింది కాంతమ్మ.

"ఇక్కడికేలే..." నసుగుతూ అన్నాడు సింగయ్య.

"ఇక్కడికి అంటే ఎక్కడికి? దానికి వూరూ పేరూ లేదా ఏంది? " కోపంగా ప్రశ్నించింది కాంతమ్మ.

"... ..."

"అడిగిన దానికి బదులు చెప్పకుండా, అట్టమూగమొద్దు మాదిరిగా వుంటే యట్ట, చేసే పని చేస్తా! నువ్వు పొద్దుట్నించీ కూడు తిన్నా? పేకాటకి పోతే కూడూ నీళ్లూ

కూడా పట్టవా ఏందిర? "

"పేకాటకి ఎవురు పొయ్యారు? "

"మరి ఎక్కడికి పొయ్యా? దేశాల మీదకి పెత్తనాలకి పొయ్యావా ఏంది? కూడు కూడా తిననంత రాచకార్యాలు ఏముం టాయి నీకు? పేకాటకి పోయి అక్కడికి పోలేదని దొంగకూతలు కూడా నేర్చుకున్నా వేందిరేయ్! పేకాటా, అబద్ధాలూ ఇట్ట ఒక దానియెనికీడిటీ ఒకటి పనికిమాలిన బుద్ధులు అన్నీ అబ్బుతయ్! ఇట్టయితే లాభం లేదబ్బాయి, నువ్వు మీ వూరి దారి పట్టాల్సి వచ్చిద్ది! నువ్వు పద్ధతిగా వుంటేనే ఇక్కడ చెల్లుతావు, లేకపోతే తొందరలోనే అంపకాలు కావాల్సి వచ్చిద్ది, ఏమనుకు న్నావో!"

"ఇంక వూరుకోవే, వాడు ఇంక పేకాట జోలికి పోడులే! వాడ్ని ఎందుకు వూరకనే అట్ట గదమాయిస్తావు? " అంది సుబ్బమ్మ సింగయ్యని వెనుకేసుకొస్తూ.

"ఏందప్పా నువ్వు మాట్టాడేది! వూరుకు నేది ఏందీ? వూరుకోక వాడ్ని ఇప్పుడు ఎవురు ఏం చేశారూ? అసలు నీ అలుసు చూసుకుని కదూ వాడు ఇట్ట పాడు కావటం! మన బిడ్డా, పోనియ్యిలే పాడయితే పాడయ్యాడూ అనుకోవటానికి! మొక్కప్పుడు వంగనిది రేపు మానైన తరువాత వంగు తాడూ? వాడు చెడుదారి పడితే లోకులు మనల్ని ఆక్షేపిస్తారు!"

"మనం ఎవురి సొమ్ముకావాలంటే ఆక్షేపి స్తారే? మనం ఏం తప్పు చేస్తే ఆక్షేపి స్తారూ? "

"లోకులు ఆక్షేపించడానికి మనం ఏమన్నా తప్పు చెయ్యాలీ! పెద్దవాళ్లు మంచి వాళ్లు అయితే పిల్లవాడు ఎందుకు పాడు అవుతాడు అనే మాట ఒకటి చాలదూ లోకులు అనుకోవడానికి! అసలు ఇప్పటికే లోకులు ఎట్ట అంటే అట్ట వాగుతున్నారు అనుకో! ఇంకా అనిపిచ్చుకోవాలీ, ఎక్కడె క్కడి అడ్డమైన వాళ్లచేత కూడా"

"లోకులు కాకులు. ఏదో వాగుతుంటారు"

"వూరకనే వాగరు, తప్పుంటేనే అంటారు"

"అసలు లోకులు ఏదో అంటారని నీకు నువ్వు అనాల్సిందే! మనల్ని గురించి లోకులు ఏమంటారేంది? "

"ఏమంటారా... ముండమోపులంటారు! మొగుళ్లని వదిలిపెట్టిన రకాలం అంటారు! గొడ్డుబోతులంటారు! అవి చాలవా, ఇంకా అనిపించుకోవాలా? "

"లోకులకేం మాయరోగం, పెద్దరోగం, పోయేరోగం మనల్ని గురించి వాగటానికి? కుక్కలు! కుక్కలు ఏదో మొరిగినంత మాత్రాన పట్టించుకుంటే ఎట్ట? " అంది సుబ్బమ్మ.

"ఇంక అరవ్వాకండి! ఎందుకు మీరు తగువులాడుకుంటారు? ఎప్పుడూ పోట్లా టేనా కొంపలో? వాడు పేకాటకి పోతే వాడ్ని తన్నబోతే సరిపోయేదానికి మీలో మీరే ఎందుకు పోట్లాడుకుంటారు? నోర్మూ సుకుని కూసోండి..." అంది అంకమ్మ.

"మజ్జెలో నువ్వేందే? " సుబ్బమ్మ అంకమ్మ మీదకు లేచింది.

"ఒరేయ్.. నీకు ఇదే చెప్పటం. నువ్వు ఇంకోసారి పేకాటకి పొయ్యావంటే బాగుం డదు. ఇంతకుముందు మాదిరిగా నువ్వు చిన్నవాడివీ, చితకవాడివీ కాదు! అప్పుటి మాదిరిగా ఆడతాపాడతానంటే కుదరదు! పెళ్లయ్యింది. పెళ్లాం కాపరానికి వచ్చింది. నువ్వు తినినా, తినకపోయినా దాని పొట్టక యినా తిండిపెట్టాలి నువ్వు! కూలికిపో, బేరంచేసుకో, ఏదయినా చేసుకో! రోజుకి పదో, ఇరవయ్యో ఎంతోకొంత సంపాయిం చుకుని వస్తేనే ఇంటికిరా!"

"రేపు దోసకాయలకి పోతా! సుబ్బయ్య



గారి చేలో వున్నయ్యి కాయలు. ఆయన డబ్బు చేతిలో పడితేనే కాయలు తూకం వేస్తాడు. అప్పియ్యడు" నసిగినట్లు అన్నాడు సింగయ్య.

"పొద్దున్నే యాభై రూపాయలు ఇస్తాలే, నువ్వు కాయలు కొనుక్కుని తీసకపోయి అమ్ముకుని సందకాడిక నా డబ్బులు నాకియ్యి. సైకిలు కూడా బాగాలేదంటన్నావుగా, ఇప్పుడే తీసకపోయి బాగు చేయించుకో!" అని కాంతమ్మ సైకిలు బాగు చేయించుకోవడానికి పది రూపాయలు డబ్బులు తీసి సింగయ్యకి ఇచ్చింది.

సింగయ్య అన్నం తిని, డబ్బు తీసుకుని వెళ్లిపోయాడు.

సమస్త సద్గుణాల సంపన్నుడు సింగయ్య! లేని లక్షణమేలేదు. వయస్సు అయితే ఎక్కువ లేకపోయినా, చిన్న వయస్సులోనే అన్ని దుర్లక్షణాలూ నేర్చుకున్నాడు.

చేతిలో డబ్బులు వుండాలికానీ, వుంటే రోజుకి యాభై రూపాయల సిగరెట్లు అయినా అవలీలగా తాగుతాడు. నిద్రాహారాలు లేకుండా వరుసగా ఏకధాటిగా మూడు రోజులు కూడా పేకాట ఆడగలడు. అప్పుడప్పుడూ మిత్రులతో మందు సేవిస్తుంటాడు.

అతనికి పని చేయాలంటే చాలా బద్ధకం! పని చేయలేడు అనే వుద్దేశ్యంతో కూరగాయల బేరం అలవాటు చేశారు.

ఆ బేరానికి ఒకరోజు వెళితే మూడు రోజులు ఎగనామం పెడతాడు. బేరంలో నాలుగు రూపాయల డబ్బులు మిగిలితే ఉత్సాహంగా పేకాటకిపోయి కూర్చుంటాడు. సింగయ్యని అందరూ పదిరూపాయలు సంపాయిస్తే ఇరవై రూపాయలు ఖర్చు పెట్టే వాడంటారు.

సుబ్బమ్మగారాబం ఎక్కువ. సింగయ్య డబ్బులు అడిగితే ఆమె దగ్గర వుంటే కాదనకుండా ఇస్తుంది. ఎప్పుడూ ఒకమాట కూడా అతనిని అనదు.

కాంతమ్మే సింగయ్యని కొంత అదుపు చేస్తుంది. ఆషామాషీగా వుంటే అంగీకరించే మనిషికాదు ఆమె. తప్పు పని చేసాడని తెలుసుకున్నప్పుడు గట్టిగా కోప్పడుతుంది. మందలిస్తుంది. తల్లిదండ్రుల దగ్గరికి స్వంత వూరు వెళ్ళాలని హెచ్చరిస్తుంది.

సింగయ్య తల్లిదండ్రులుచాలా పేదవాళ్లు. వాళ్లకి కనీసం వుండటానికి కూడా సరైన ఇల్లులేదు. చిన్న పూరిగుడిసెలోనే వాళ్లందరూ వుంటారు. ఆ పూరిగుడిసెకి చుట్టూ కాస్త స్థలం కూడా లేదు, కనీసం కూర్చోవడానికీ, వేసవికాలంలో ఆరు బయట విశ్రాంతిగా పడుకోవటానికి కూడా!

సింగయ్యకి ఇద్దరు అన్నలు. వాళ్ల ఇద్దరికీ కూడా పెళ్లిళ్లయ్యాయి. ఆ చిన్న పూరిగుడిసెలోనే ఆ మూడు కాపురాలూ నివాసం వుంటున్నాయి.

సింగయ్య అమ్మమ్మ కనకమ్మకి మాత్రం లంకంత ఇల్లువుంది. సెంటు పొలంలేదు. మరే ఇతర ఆస్తీలేదు.

కనకమ్మ భర్తా, కనకమ్మా పిల్లాజెల్లాలేని ఒక బ్రాహ్మణ ముసలమ్మని చాలాకాలం చూశారు. ఆమె అవసాన దశలో ఆమెకి అన్ని సపర్యలూ చేశారు.

ఆమెకి పిల్లలేకాదు, తోబుట్టువులు కూడా ఎవరూ లేరు. ఒంటరి మనిషి. కనకమ్మ దంపతులు ఆమెకి విశ్వాసపాత్రంగా వుండి ఎన్నో సేవలు చేశారు. ఆమెని చివరి వరకూ ఎంతో జాగ్రత్తగా కంటికి రెప్పలా కనిపెట్టుకువున్నారు.

ఆమె మరణించేముందు ఇంటిని కనకమ్మ భర్తపేరుతో రిజిస్టరు చేసింది. అలా ఆ ఇల్లు కనకమ్మ వాళ్ల స్వంతం అయింది.

వాళ్లకి వున్న స్థిరాస్తి ఆ ఇల్లు ఒక్కటే.

భాగాల పంపకం జరిగితే నలుగురు





అక్కచెల్లెళ్లకీ ఇల్లు సమానంగా వస్తుంది. అయితే ఆ నలుగురిలో ముగ్గురికి అసలు పిల్లలే లేరాయె!

ఆ ముగ్గురూ సింగయ్యని పెంచుకున్నారు కాబట్టి ఇల్లు ఎప్పటికైనా సింగయ్యా స్వంతం అవుతుంది.

కాంతమ్మ గేదెపాడి మీద కొంత డబ్బు కూడ బెట్టింది. ఆ డబ్బు కూడా సింగయ్యకే ఇస్తుంది.

ఆమెకి డబ్బు వుంది కనుకనే సింగయ్యా మీద పెత్తనం చేయగలుగుతుంది. అతను తప్పు చేశాడని దబాయించగలుగుతుంది. సింగయ్యా ఆమె డబ్బుమీద ఆశపెట్టుకుని వున్నాడు. అందుకే ఆమె మాటలకీ, తిట్లకీ భయపడుతున్నాడు. లేదా భయపడుతున్నట్లు నటిస్తున్నాడు.

కాంతమ్మ మాటల్ని వినకుండా ధిక్కరించి, ఇంట్లో తన తల్లికి కూడా వాటా వుందనీ, పంపకం చేయమనీ అడిగితే, సింగయ్యా తల్లికి నాలుగవ వాటా మాత్రమే వస్తుంది. ఆ వాటాలో మళ్లీ సింగయ్యా అన్నదమ్ములకి భాగం వుంటుంది కాబట్టి ఆ నాలుగవ వాటాలో అతనికి మూడవ వంతే వస్తుంది.

ఇంటి విషయమే గాకుండా పెద్దమ్మా, పిన్నమ్మల మీద అలిగి వాళ్లవూరు వెళితే అక్కడ పరిస్థితి మరీ ఘోరం.

పూరి గుడిసె. అందులోనే మూడు కాపురాలు, వూరు కూడా మరీ చిన్న పల్లె. కనీసం టీ తాగడానికి కూడా ఆ వూళ్లో హోటళ్లు లేవు. ఇంట్లో అసలే దొరకవు. స్నేహితులు వుండరు. అందుకే సింగయ్యకి ఆ వూరు వెళ్లడం అంటేనూ, ఆ గుడిసెలో వుండటం అంటేనూ అసలు ఇష్టం వుండదు.

నిజానికి సింగయ్యా కాంతమ్మకి ఎప్పుడో ఎదురు తిరిగి వుండేవాడు. ఆమెని లెక్కచేసేవాడు కాదు. సమస్యలు చాలా వున్నాయి కాబట్టే ఆమె అంటే మనసులోకోపంగా వున్నా పైకి అణిగి మణిగినట్లు వుంటాడు. ఇబ్బందో, కష్టమో, నష్టమో పెద్దమ్మకీ, పిన్నమ్మలకీ లొంగివుండటమే మంచిదనుకున్నాడు.

వాళ్లు కూడా పిల్లికి బిచ్చం పెట్టేవాళ్లు కాదు. చూస్తూ చూస్తూ అర్ధ రూపాయి పెట్టి అరటికాయ కూడా కొనుక్కుని తినరు. కూలీనాలీ చేసుకుని, పైసా పైసా ముడేసినా, అవి రేపు తన కోసమే కదా అనే విషయం సింగయ్యకి బాగా తెలుసు.

★ ★ ★

"ఎప్పుడొచ్చావమ్మా?"

"ఏం అమ్మాయి, ఎంత సేపవతంది వచ్చి? అందరూ బాగున్నారా?" ఇంటి దగ్గర వున్న రాగమ్మని చూసి, సాయంత్రం కూలికి వెళ్లి వచ్చిన సుశీలా, సుబ్బమ్మా ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"మజ్జెన్నం వచ్చాను. అందరూ బాగున్నారు" అంది రాగమ్మ.

"మీ ఆయన్ని కూడా తీసకరాకపొయ్యా, ఇద్దరూ వస్తే బాగుండేది" అంది సుబ్బమ్మ.

"మాకు అక్కడ పనులు ముమ్మరంగా వున్నయ్యి వదినా, ఆయనకి ఎక్కడ కుదిరిద్ది రావటం? అమ్మాయిని చూసి చాలా రోజులవతంది కదాని నేనొక్కదాన్నే వచ్చా"

సుబ్బమ్మా, రాగమ్మా కుశల ప్రశ్నలు వేసుకున్నారు. కాంతమ్మా, అంకమ్మా, ముసలమ్మా కూడా రాగమ్మతో ఆప్యాయంగానే మాట్లాడారు.

సింగయ్యా ఆ రోజు కూరగాయల బేరానికి వెళ్లాడు.

"పిల్లని తీసుకుని పోదామని వచ్చాను వదినా! వాళ్ల అయ్యా, పిల్లోడూ, చిన్నపిల్లా అందరూ సుశీల మీద దిగులు పెట్టుకు

న్నారు. చిన్నప్పట్నించీ ఎప్పుడూ వదిలి వుండిన వాళ్లు కాదాయె! ఆయన అమ్మాయిని చూసి, తీసకరమ్మని నన్ను పంపించాడు. తీసకపోయి నాలుగు రోజులు అట్టి పెట్టుకుని పంపిస్తాను" రాగమ్మ అంది.

"అమ్మాయి మా ఇంటో అందరికీ తలలో నాలుక అయిందంటే నమ్ము! అమ్మాయిలేనిదే ఇల్లు ఒకపూట కాదుగదా, ఒక గడియ కూడా జరగేటట్టులేదు. అట్ట కలిసిపోయింది మాలో, ఇప్పుడు వద్దులే!" అంది సుబ్బమ్మ.

"రేప్పొద్దున మా వూరుపోతే, రేపూ ఎల్లుండీ వుంచుకుని మూడోనాటికి తీసక వచ్చి వదిలిపెడతా వదినా! వాళ్ల అయ్య గట్టిగా తీసకరమ్మన్నాడు"

"అసలే ఇప్పుడు పనులరోజులు. ఈ రోజుల్లో పిల్లని తీసకపోతానంటే ఎట్ట మ్మాయి? నాలుగు రూపాయలు సంపాయించుకునేది ఈ కాలంలోనేకదా! ఇంట్లో పనికానీ, బయటపనికానీ పిల్లలేనిదే అసలు జరగదు. ఇప్పుడు మాత్రం పిల్లని పంపించటం కుదిరేపనికాదు" సుబ్బమ్మ సుశీలని పంపించటం జరగదని స్పష్టంగానే తేల్చి చెప్పింది.

తల్లిరాక ముందు వూరికి వెళ్తే బాగుంటుందని చాలాసార్లు అనుకుంది సుశీల. అంతలోనే వూరినించి అమ్మ వచ్చింది.

అమ్మని చూసి సుశీల ఎంతో ఆనందపడిపోయింది. మనసు హాయిగా, తేలికగా, సంతోషంగా వుంది.

సుశీల పుట్టి, వూహ తెలిసిన తరువాత వాళ్ల అమ్మని వదిలి ఎప్పుడూ వుండలేదు. అలాంటిది అలవాటు లేకుండా ఒకేసారి తల్లికి దూరం కావడంతో ఆ చిన్ని మనసు కలత చెందింది. దిగులుపడింది.

ఇప్పుడు సుబ్బమ్మ మాటలకి సుశీల ఆందోళన చెందింది.

"నాకు మనూరిమీద గుబులు మళ్లిందమ్మా! నేను వచ్చి గంగమ్మనీ, అన్నాయ్‌నీ చూసి వస్తాను" గట్టిగా తల్లితో వెళ్దామనే కోరికతో వున్న సుశీల అంది. పుట్టింటి మీద బాగా మనసు మళ్లింది ఆ అమ్మాయికి. ఎప్పుడెప్పుడు వూరికిపోయి స్నేహితుల్నీ, తెలిసినవాళ్లనీ చూద్దామా అని వుంది.

"ఇప్పుడు ఎట్టపోతావమ్మాయి నువ్వు. పనుల రోజుల్లో! పండగ దగ్గరకి వచ్చింది కదా! ఇంక నెల రోజులే వుంది పెద్ద పండగ! అంతగా అయితే పండక్కి నాలుగ రోజుల ముందే నువ్వూ, వాడూ పోయి ఒక వారం రోజులు వుండి వద్దురులే!" అంది సుబ్బమ్మ.

"పోయి రెండు రోజులు వుండి వస్తాలే. అత్తా! కూలిదేముంది, ఎప్పుడూ వుండేకూలేగా! నేను పోయి వద్దామనుకుంటన్నాను, ఇంతలోనే మమ్మ కూడా వచ్చింది" ఎలాగైనా వూరికి వెళ్లాలనే ఆలోచనతో అంది సుశీల.

"చెప్పేది నీక్కాదంటమ్మాయి! ఇప్పుడు వద్దంటే ఆలకించరే! పండక్కి నువ్వూ, వాడూ ఇద్దరూ పోయి నాల్రోజులు వుండి వద్దురు అంటున్నాకదా!" గట్టిగా అంది సుబ్బమ్మ.

సుశీలకి మనసులో బాధగా వుంది. దుఃఖంగా వుంది.

తనని తన తల్లిదండ్రుల వూరూ, తోడబుట్టిన వాళ్ల వద్దకీ పంపించరట! కనీసం వాళ్లని చూసి రావడానికి కూడా అనుమతించరట! వీళ్లెవరు తనని తల్లిదండ్రుల వద్దకు వెళ్లొద్దు అనడానికి! వీళ్లకేం హక్కుంది తనని తన పుట్టింటికి పోకూడదని నిరోధించడానికి!

తల్లి వెంట బిడ్డ వెళ్లకూడదా?

ఈ ఇంట్లో అనుభవిస్తున్న హింసనీ,

 

క్షోభనీ, మానసిక అశాంతినీ, నరకాన్నీ బండచాకిరీనీ తల్లికి చెప్పుకుందామని సుశీల లేత మనసు ఆత్రుతపడుతోంది. ఎప్పుడెప్పుడు తల్లికి తన గోడు వెళ్లబోసుకుందామా అని సుశీల ఎదురు చూస్తోంది.

అయితే సుశీలా, రాగమ్మలని వెన్నంటి వుంది సుబ్బమ్మ. వాళ్ల కదలికల్ని క్షణక్షణమూ గమనిస్తుంది.

సుశీల ఇక్కడి పరిస్థితి అంతా తల్లికి చెపుతుందని సుబ్బమ్మకి తెలుసు. అందుకే సుశీల మీద కన్నేసివుంచింది.

రాగమ్మ వరండాలో అంకమ్మతో మాట్లాడుతూ వుంది. సుశీల దేనికోసమో ఇంట్లోకి వచ్చింది. వెంటనే సుబ్బమ్మలేచి ఇంట్లోకి వచ్చి సుశీలతో అంది,

"అమ్మాయి సుశీలా... ఇక్కడి విషయాలు ఏమీ మీ అమ్మతో చెప్పొద్దు. ముసలమ్మకి అది చేస్తున్నానూ, ఇది చేస్తున్నానూ అనీ, నన్ను వాళ్లు పనులు చేయిస్తున్నారనీ, మాటలు అంటున్నారనీ. నీ మొగుడు పేకాటకి పోతాడనీ ఇసుంటి విషయాలు ఏమీ మీ అమ్మతో చెప్పొద్దు. ఆమెకి తెలిస్తే బాధపడిద్ది!"

ఆమె మాటలకి సుశీల జవాబు చెప్పకుండానే, ఇంట్లోనించి బయటకి వచ్చింది మౌనంగా.

సుశీల మౌనంతో ఇక్కడి పరిస్థితి తల్లికి చెపుతుందనే సుబ్బమ్మ అనుమానం గట్టిపడింది.

రాగమ్మ వెంట సుశీల వుంటే, వాళ్ల ఇద్దరినీ సుబ్బమ్మ కనిపెట్టుకువుంది. వాళ్లకి ఏకాంతం దొరక్కుండా చేయడానికి ప్రయత్నిస్తోంది.

రాగమ్మ విషయాన్ని గ్రహించింది. సుశీల ఏదో తనతో చెప్పాలని చూస్తున్నదనీ, సుబ్బమ్మ తమని నీడలా అనుసరిస్తున్నదనీ రాగమ్మ పసిగట్టింది.

★ ★ ★

బాగా చీకటి పడిన తరువాత రాగమ్మ అంది. "సుశీలా... చెంబుకివెళ్ళి రావాలి. మీ వూరి దారినాకు సరిగా తెలియదు. రా వెళ్దాం"

"ఈ జామున కుంటుకుంటా ఆ పిల్ల ఎందుకులే అమ్మాయి. తోడుగా నువ్వు పోయి రావే అంకమ్మా!" చెల్లెలికి చెప్పింది సుబ్బమ్మ.

"నేను ఇప్పుడు పోయి వచ్చాను అప్పా!" అని సుబ్బమ్మతో చెప్పి, రాగమ్మతో అంది. "నేను ఇందాక పోయేటప్పుడు అడిగితే ఇప్పుడు రానంటివే! నువ్వు రానంటే ఒక్కదాన్నే పోయి వచ్చా! సరే, ఇప్పుడేం పోయిందిలే! ఎంత దూరం, ఎంత పని! మళ్ళీ పోయి రాకూడదంటలే, పోదాంరా!"

"ఇప్పుడే పోయి మళ్ళీ నువ్వు ఎందుకులే అంకమ్మా! ఇందాక నువ్వు అడిగినప్పుడు నాకు వెళ్ళాలని అనిపించలా! నేనూ అమ్మాయీ పోయి వస్తాంలే!" అంది రాగమ్మ.

"వాళ్ళకి తోడు నువ్వు కూడా పోయిరావే!" చెల్లెలితో అంది సుబ్బమ్మ.

"నేనెందుకు? సుశీలకి దారి తెలియదా ఏందీ? ఆ అమ్మాయికి కొత్తా? "

"మళ్ళీ అంకమ్మ ఎందుకులే? మేం ఇద్దరం తొందరగా పోయొస్తాం. ఎంత సేపూ" అని రాగమ్మా, సుశీలా బయటకి వెళ్ళారు.

సుశీల రాగమ్మని ఎక్కువదూరం తీసుకుపోయింది. దారిలో చెప్పాలనుకున్నది కానీ, మనుషులు వస్తున్నారూ, పోతున్నారు. ఒక మాట వింటే దానిని పది మాటలుగా పుట్టిస్తారు.

దూరంగా, వూరి వెలుపలకి, 'అంతదూరం ఎవరూ రారు అనుకున్నచోటుకి వెళ్ళిన తరువాత అప్పటివరకూ అణిచిపెట్టుకున్న

దుఃఖం, వేదనా ఒక్కసారిగా సుశీలలో పొంగి పొర్లింది.

"ఎందుకు వచ్చావమ్మా నువ్వు? నీ కూతురు వుందో, చచ్చిందో చూద్దామని వచ్చావా? రెండునెల్లనాడు వచ్చి పోయిన దానివి, మళ్ళీ ఇయ్యాల్టికి గుర్తు వచ్చానా నేను! నువ్వు రాకపోతే ఎవురు ఏడ్చారు? " అంది సుశీల భోరుమని విలపిస్తూ.

సుశీల ఏడుపుతో రాగమ్మ హతాశురాలైంది. సుశీల ఏదో చెపుతుందనుకుంది కానీ, ఇలా విలపిస్తుందని ఆమె వూహించలేదు. సుశీల ఏడుపుతో ఆ తల్లి హృదయం కలతచెందింది.

"ఎందుకమ్మా సుశీలా ఏడుస్తావు. ఏమైందే నీకు? ఎవురేమన్నారు నిన్ను? వాళ్ళు నిన్ను కొట్టారా, తిట్టారా, ఏమైనా చేసారా? వాళ్ళు ఏమన్నా బాధలు పెడతన్నారా? "

సుశీలకి ఏడుపు ఆగలేదు. వెక్కివెక్కి ఏడుస్తోంది.

"నువ్వు ఏడిస్తే నాకు ఏం తెలిసిద్ది? ఏడవ్వాకమ్మా, ఎవురన్నా వింటే బాగుండదు. ఏం జరిగిందో చెబితే నాక్కూడా తెలిసిద్ది కదా! నువ్వు చెప్పకపోతే ఎట్ట తెలిసిద్ది? ఏం జరిగిందమ్మా? "

"మీరు నాకు ఎందుకు పెళ్ళిచేసారు అసలు? నాకు పెళ్ళిచేయకపోతే ఏం పోయింది? మీకు అంత బరువుగా వున్నప్పుడు నన్ను చంపిపారేసి ఏ బాయిలోనో, చెరువులోనో వెయ్యకపోయారా? "

"ఏం మాటలు సుశీలా అయ్యి? నువ్వు మాకు బరువు ఎందుకు అవుతా? నిన్ను వాళ్ళు ఏం అన్నారే? ఏం బాధ పెట్టారూ? "

"వాళ్ళు నన్ను ఏం అంటారూ? ఏం అనరూ, ఏం బాధపెట్టరూ! కోడి కూసినప్పుడే నిద్దర లేవగొట్టి, అద్దరాతిరిదాకా అడ్డమైన చాకిరీ చేయించుకుంటారు. వాళ్ళు ఎద్దులు మాదిరిగా కూర్చుని తింటంటే, ఆ గుంపు అందరికీ నేనొక్కదాన్ని చాకిరీ చెయ్యాలి! ఆ సుబ్బిముండ అయితే ఇటు పుల్ల తీసి అటు పెట్టదు. పని మాత్రం సందుపోకుండా చెప్పిద్ది. ఆ ముసల్ది ఒకతీ, శనిద్రపుది! చావదూ, బతకదూ! ఆ ముసలిముండకి కూడా నేనే చాకిరీ చెయ్యాలి! దానికి కూడు పెట్టాలీ, దాని పెంటా పేడా, వుచ్చా గిచ్చా అన్నీ నేనే ఎత్తిపోయాలి! చెడిముండ అది!" ఏడుస్తూ, గుక్కతిప్పుకోకుండా చెప్పింది సుశీల.

రాగమ్మ తేలిగ్గా వూపిరి పీల్చుకుంది. "అంతే కదా! అంత మాత్రానికే ఏడిస్తే ఎట్టే? చేసిన వాళ్ళు ఎప్పుడూ చెడిపోరమ్మా! నీకు ఓపిక వున్న కాడికి చెయ్యి. పని చేస్తే కండలు ఏమన్నా అరిగిపోతయ్యా, కరిగిపోతయ్యా! ఆ ముసిల్ది ఇయ్యాలో, రేపో గుటుక్కుమనిద్ది! ఈ నాలుగు రోజుల్లో మనం బయటపడితే యట్ట? కాపరం అన్న తరువాత ఒడిదుడుకులూ, లోటుపాట్లూ రాకుండా వుండవమ్మా!"

"నీకు అట్నే వుండిద్ది. చెప్పటానికేం, మాటలేగా! చేసేవాళ్ళకి తెలిసిద్ది కష్టం, సుకం! దూరంగా వుండి మాట్లాడేవాళ్ళకి బాధేం తెలిసిద్ది? "

"పిచ్చిదానా... నేను కాపరం చేయలేదా... బాధలు పడలేదా... మీ నాయనమ్మ నాకు సొయానా మేనత్తే! అయినా ఎన్ని బాధలు పెట్టలేదు! మీ అయ్యా, మా మేనత్తా నన్ను పెట్టిన బాధల్లో వందోవంతు కూడా నువ్వు పడవు. ఏదో తగాదా పడి, అలిగి నేను పని చేయలేదని, మీ నాయనమ్మ అట్లకాడ పొయ్యిలో వేసి కాల్చి, కూర్చున్న దాన్ని నాకు వెనగ్గా వచ్చి వాత పెట్టింది! ఎన్నిసార్లు చూడలేదు నువ్వా వాత! ఇప్పటికి కూడా ఆ గుర్తు అట్నే




వుంది. మీ అయ్య ఇంటిచుట్టూ తిప్పితిప్పి గొడ్డుని కొట్టినట్టు కొట్టేవాడు! మీ అయ్య ఒకసారి మూడు కర్రలు విరిగిపోయిందాకా కొడితే నెలరోజులపాటు నేను మనిషిని కూడా కాలేకపోయ్యా! అలాంటి బాగలు నీకు వుంటే ఒక్క గడియ కాపరం చేస్తా? "

"ఏమో, నాకేం తెలియదు. నేను మాత్రం ఇక్కడ ఈ వూళ్ళో వుండను. నేను కూడా నీతోపాటు మన వూరు వస్తా!"

"మన వూరు వచ్చి అక్కడ మాత్రం కూసుని ఏం బంగారం తింటా? ఎక్కడైనా కూలీ నాలీకి పోవాలి. చాకిరీ చేసుకోవాలి. కూసుని తింటానికి ఎక్కడా కుదరదు. ఆ వుండేదేదో మొగుడి దగ్గిర వుంటే బాగుండి ద్దమ్మా! నేను అనుభవంమీద చెపుతున్నా! నువ్వు మాకు ఎక్కువ కావు. కానీ అక్కడ మనవూళ్లో వుంటే ఎంతకాలం వుంటావు? కాపురం అన్న తరువాత గొడవలు రాకుండా వుండవు. రోజులు గడిచేకొద్దీ అయ్యే సర్దుకుంటయ్యి!" కూతురికి నచ్చచె పుతూ అంది రాగమ్మ.

"దేశంలో అందరికీ ఒక అత్త వుండిద్ది. నాకు ముగ్గురు అత్తలు. ముగ్గురూ మూడు పక్కలనించి పీక్కుతినే వాళ్లే! ఉండమూడత్త లకి ముసిలి అత్త కూడా తోడయింది. ఇక మీ అల్లుడియవారం చెప్పే పనిలేదు! పైసా సంపాదన లేదు కానీ డబ్బులు వుంటే రోజుకి పది రూపాయలు చాలవు ఆయన సిగిరెట్లుకి. ఉత్త ఎచ్చులకోరు తప్ప ఇంకేం లేదు. నాలుగు రూపాయలు డబ్బులు దొరి కితే చాలు, పేకాటకి పోయి కూసుంటాడు!"

"మీ ఆయనకి చిన్నగా నువ్వే నచ్చచెప్పు కుని మార్చుకోవాలమ్మా! వాడికి కూడా ఏం వయసువుందీ, ఏం తెలుసూ? చిన్నగా వాడే మారుతాడు! రేపు నీ కడుపున ఒక కాయ కాసి, వాడి నెత్తిమీద బరువు పడితే వాడికి అప్పుడు తెలిసివచ్చిద్ది లోకం!"

"నేను రేపు నీతోటి మన వూరు వచ్చి అక్కడ నెలరోజులు వుండివస్తా! అప్పటికి వీళ్ళ తిక్క అణిగిద్ది!" ఏడుపు కొంచెం సర్దు కున్న తరువాత సుశీల అంది.

"సరే వచ్చి అట్నే వుండివద్దువులే!" అంది రాగమ్మ.

ఇద్దరూ కలసి ఇంటికి వచ్చారు.

"మీరు పోయి ఏజాము అయిందీ! ఇంత ఆలిస్యెం అయిరంది ఏందమ్మాయి? " సుబ్బమ్మ వీళ్ళు లోనికి అడుగుపెట్టిన వెంటనే అడిగింది.

"ఏందో మాట్టాడుకుంటా కూసునే సరికి ఆలిస్యెం అయిందిలే వదినా" చెప్పింది రాగమ్మ.

"ఏం మాటలూ, చెంబుకి పోయిన దగ్గిర గంటల తరబడీ మాట్టాడుకోవటానికి ఏం మాటలు వుంటయమ్మా, యిద్దూరంగాక పోతే!"

"మావూరి యవారం చెప్పుకుంటా ఆలిస్యెం అయిందిలే వదినా! తన సావాస గత్తెల గురించీ, మా ఇంటో యవారం గురించీ ఏందో అడుగుతుంటే చెపుతున్నా! పాపం మొన్నటిదాకా, పెళ్ళయిందాకా ఇది కూడా ఆటలు ఆడుకున్న పిల్లాయే! అంత తొందరగా సావాసగత్తెల్ని ఎట్ట మరచిపో యిద్ది" సంజాయిషీ మాదిరిగా అబద్ధం చెప్పింది రాగమ్మ.

అయినా సుబ్బమ్మ కోపంగానే వుంది. సుశీల అన్ని విషయాలూ చెప్పి వుంటుం దనీ, వాళ్ళకి ఏకాంతం కల్పించకుండా చేసి నట్లయితే బాగుండేదనీ సుబ్బమ్మ అనుకు న్నది.

మరుసటి రోజు వుదయం వూరికి వెళ్ళ డానికి ప్రయాణం కాబోతూ మళ్ళీ అడిగింది రాగమ్మ. "అమ్మాయిని తీసకపోయి రెండు రోజులు వుంచుకుని తీసకొచ్చి వదిలిపెడ

తాను వదినా! పాపం, పిల్లకొద్దిగా దిగులు పెట్టుకుందట్టుగా వుంది! దాని సావాసగత్తెలు కూడా దీన్ని తీసకరమ్మని నేను వచ్చేటప్పుడు ఒకటికి నాలుగు సార్లు చెప్పారు. వాళ్ళు రోజూ సుశీల ఎప్పుడొచ్చిద్ది, ఎప్పుడొచ్చిద్ది అని ఇంటిచుట్టూ తిరిగి అడిగిపోతంటారు" రాగమ్మ అంది.

"పనుల రోజులు కదమ్మాయి. ఆ పిల్ల వస్తే ఇంటో జరగదు. పిల్లకి ఇక్కడ మాత్రం ఏం తక్కువ? ఇక్కడ బాగానే అలవాటు పడిపోయిందిలే! పెద్ద పండక్కి వచ్చి ఇద్దరూ వారం పది రోజులు వుండివస్తారు!"

"అమ్మాయి ఇప్పుడు నాతో రావాలంటంది వదినా! మిమ్మల్నేమో అడగలేకపోతుంది! పసిదాయె! రెండు రోజులు వుండి వస్తే ఏం పోయింది. దాని బెమ కూడా తీరినట్టు వుండిద్ది"

"మమ్మల్ని అడగలేకపోవటానికి ఇక్కడ ఆ పిల్లని ఎవురు ఏం అంటన్నారు? రేపు పెద్ద పండగదాకా వుండలేకపోతే నాలుగు రోజుల్లో అమ్మాయిని వెంటబెట్టుకుని అబ్బాయి కూడా వచ్చి ఒకరోజో, రెండు రోజులో వుండి వస్తార్లే! ఇప్పుడు నీతోటి ఎందుకు? అసలు ఇయ్యాలా, రేపూ మంచిది కూడా కాదు" అంది సుబ్బమ్మ.

సుశీలని తనతో పంపించరని రాగమ్మ స్పష్టంగా తెలుసుకుంది.

"సరే వదినా, నేను వూరికి వెళతన్నా! అమ్మాయి పసిముండ. దానికి పనులు తెలియకపోతే అట్టకాదమ్మాయి ఇట్ట అని నేర్పు. నేను చెపతన్నానని ఏం అనుకోవద్దు. దానిమీద కోప్పడి అరిస్తే అది బెదిరిపోయిద్ది! చిన్నగా నచ్చచెప్పుకుని పనులు నేర్పుకుంటే అన్నీ చేసిద్ది!"

"మేం మాత్రం ఎవరం ఏం అంటన్నాం దాన్ని! మా ఇంట్లో కొద్దిగా పని మాత్రం ఎక్కువే! సుశీలని ఇక్కడ ఎవురూ రాచి రంపాన పెట్టటం లేదులే!" అంది సుబ్బమ్మ కొంచెం కోపంగా.

రాగమ్మ సంచితీసుకుని వాళ్ళ వూరు వెళ్ళిపోయింది.

సుశీల మనసు బరువుతో, వేదనతో, బాధతో నిండిపోయింది.

తల్లి వెంట గట్టిగా వెళ్దామనుకున్నది. కొన్ని బట్టలు కూడా సర్దుకుంది. అయినా ప్రయాణానికి అత్తలు అడ్డుపడటంతో సుశీలకి భరించరానంత కోపం, దాని వెంట బాధా కలిగింది.



ఒక శుభోదయాన ముసలమ్మ మరణంతో ఆ బజారు అంతటికీ మెలకువ వచ్చింది.

రాత్రిపూట అన్నం తిని, మంచంమీద పడుకున్న ముసలమ్మ తెల్లవారిన తరువాత కూతుళ్ళు వచ్చి చూస్తే మంచం మీదనే బిగుసుకుపోయి మరణించి వుంది. జనం చేరారు.

"పోనియ్యిలే, పీడా వదిలింది! మంచంలో ఎంతకాలం..." అన్నారు ఒకరు.

"సుశీలకి చెర తప్పినట్లే! కన్నకూతుళ్ళు వుండి కూడా సుశీలే ముసలమ్మకి ఎక్కువ సేవచేసింది" అన్నారు మరొకరు.

"పిల్ల పసిది అయితే మాత్రం ఏం! ఎంత బుద్ధిమంతురాలమ్మా! ముసలమ్మకి ఈ పని చేసిందీ, ఈ పని చేయలేదూ అనుకోవడానికి వీల్లేదు! కన్నబిడ్డ మాదిరిగా విసుక్కోకుండా, చీదరించుకోకుండా అన్ని పనులూ చేసింది" అన్నారు ఇంకొకరు.

"కన్న కూతుళ్ళు వుండి కూడా ఏం లాభం? సుశీల ఇంట్లో అడుగుపెట్టిన తరువాత ఆ అమ్మాయి చేసిన దాంట్లో పదోవంతు ముసలమ్మకి చేసారూ వీళ్ళు! ఎప్పుడూ తిట్టటం, తిమ్మటమేనాయె!"

అక్కడికి వచ్చిన వాళ్ళు సుశీలని మెచ్చుకుంటూ, సుబ్బమ్మనీ, ఆమె సోదరీమణుల్నీ ఈసడించుకుంటున్నారు, కొందరు చాటుగా, కొందరు ఎదురుగానే.

"చావ్వే! నువ్వు చస్తే మాకు పీడావదిలిపోయిద్ది. నువ్వు బతికి ఏం వుద్ధరించటానికే! దేశంలో మంచి వాళ్లందరికీ వస్తుంది కానీ చావు నీకు రావటంలేదే! మమ్మల్ని ఇట్నే చంపిన తరువాత కానీ నువ్వు చావ్వే!"

అని ముసలమ్మని భయంకరంగా, ఘోరంగా తిట్టిన ఆ కూతుళ్ళు ఇప్పుడు ఆ మృతదేహానికి దూరంగా కూర్చుని భోరుమని విలపిస్తున్నారు.

ముసలమ్మ శవాన్ని చూడటానికి వచ్చిన వాళ్ళకి వీళ్ళ ఏడుపుల్ని చూసి పాపం, ఆ విషాదంలో కూడా నవ్వువస్తోంది.

"ఇంకా రెండేళ్ళు బతికిద్ది అనుకున్నామమ్మా! మహాతల్లి మా కొంపలో కాలుపెట్టిందీ, నీ పేణం పోయిందీ! గొడ్డొచ్చినవేళా, బిడ్డొచ్చినవేళా అన్నారు! అబ్బాయికి పెళ్ళి చేయకపోతే తల్లి ఈ ఇంట కాలుపెట్టేదీ కాదు, నువ్వు చచ్చిపోయేదానివీ కాదు! ఇంకా నాలుగు కాలాల పాటు వుంటావుఅనుకున్నామమ్మా!" అని పెద్ద కూతుళ్ళు ఇద్దరూ సుశీలని తిడుతూ రాగాలు తీస్తున్నారు.

జనం సుశీలని మెచ్చుకుంటూ ప్రశంసాపూర్వకంగా చూస్తూ వుండటంతో అది భరించలేని సుబ్బమ్మా, కాంతమ్మలు సుశీలని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా తిడుతూ ఏడవటం మొదలుపెట్టారు.

సుశీల తల్లిదండ్రులూ, సింగయ్య తల్లిదండ్రులూ, అతని అన్నలు ఇద్దరూ, ఇతర బంధువులూ అందరూ వచ్చిన తరువాత ఆ రోజు సాయంత్రానికి ముసలమ్మ పని ముగించారు.

★ ★ ★

సింగయ్య పేకాటకి వెళ్ళడం ఎక్కువ చేసాడు. పది రూపాయలు ఎలాగోలా, ఎక్కడో చోట కొట్టేసి వెళ్ళి పేకాటలో కూర్చుంటున్నాడు. రెండు రూపాయలు పెట్టి ఆడుకునే ముఠా ఒకటి వుంది. అందులో సింగయ్య ముఖ్యుడైపోయాడు.

ముసలమ్మ కాలం చేసిన తరువాత బేరానికి వెళ్ళడం మరచిపోయాడు. ఒక్కరోజు కూడా బేరానికి వెళ్ళలేదు.

క్రమంతప్పకుండా పేకాటకి వెళ్ళడం మాత్రం నిత్యకార్యక్రమమైపోయింది.

అతని చేతి గడియారం నాలుగు రోజులుగా కనపడడంలేదు. అది సుశీల తల్లిదండ్రులు పెళ్ళప్పుడు ఇచ్చింది.

రోజూ స్నానం చేయడానికి వెళ్తూ చేతికి వున్న గడియారం తీసి సుశీల చేతికి ఇచ్చి స్నానం చేసిన తరువాత తీసుకుని పెట్టుకునేవాడు. అతనికి అలా సుశీలకి ఇవ్వడం, మళ్ళీ తీసుకుని పెట్టుకోవడం అలవాటైపోయింది.

నాలుగు రోజులుగా సుశీలకి గడియారం ఇవ్వడంలేదు. అతని చేతికి కూడా అది లేదు.

మూడవ రోజున తన చేతికి గడియారం ఇవ్వడంలేదని స్ఫురణకి వచ్చింది సుశీలకి. అతని చేతికి కూడా అది లేదని అడుగుదామనుకున్నది. అయితే ఏదో పనిలో పడిపోయి ఆ విషయం అడగడం మరచిపోయింది.

తరువాత రోజు బాగా పొద్దుపోయి వచ్చిన సింగయ్య నిద్రపోతున్న సుశీలని లేపాడు. "లేచి నీళ్ళు తోడవే!"

అతను ఏ సమయంలో వచ్చినా సుశీలని లేపి, నీళ్ళు తోడించుకుని అన్నం పెట్టించుకు తినడం అలవాటే! విసుక్కుంటూనో, నసుక్కుంటూనో ఆ పని చేయడం సుశీలకి కూడా అలవాటైపోయింది.

ఆరోజు కోడి కూసినప్పుడు లేచిన సుశీల

ఒక్క నిముషంసేపు రెండు కాళ్ళూ ఒకచోట పెట్టలేదు. ఒక నిముషం కూర్చోలేదు.

ఉదయం పదింటిపరకూ ఇంట్లో పనిచేసుకుని, కూలికి వెళ్ళి చీకటి పడి వచ్చి, మళ్ళీ ఇంట్లో పని చేసుకుని కొద్దిసేపుక్రితం పడుకుంది. పడుకున్న వెంటనే, అలసటమీద గాఢంగా నిద్రపట్టింది.

నిద్రపట్టిన కొద్దిసేపటికి సింగయ్య వచ్చి లేపాడు. సుశీలకి బాగా కోపం వచ్చింది. విపరీతమైన చిరాకుతో అంది.

"ఇంటికి రావడానికి వేళయిందీ! ఊళ్ళో జనం అంతా పడుకుని ఏ జాము అయిందీ! ఇప్పుడు దాకా ఏం పెత్తనాలు చేసినట్టూ! పెందలాడి వచ్చి, నీళ్ళు పోసుకుని కూడు తిని పడుకోకూడదూ! లేకపోతే తిన్నతరువాతనే పెత్తనాలకి పోకూడదా? "

"సరేలే, అరవ్వాకు!"

"అరిచేదేందీ? పొగులంతా చాకిరి చేసి చచ్చిన వాళ్ళు నువ్వు ఎప్పుడో అర్ధరేత్రి వస్తే నీకోసం నిద్రలేచి నీళ్ళు తోడి కూడు పెడతారూ? "

"ఇంక మూస్కో! ఎక్కువగా వాగవాకు, పళ్ళు రాల్తయ్!"

"పళ్ళు రాల్తయి, రాల్తయి, ఎందుకు రాలవూ? నీకు అట్టసాగుతుందీ, సాగిచ్చుకుంటున్నావూ! నువ్వు ఏ తప్పు చేసినా నిన్ను అడిగేవోడు ఎవుడున్నాడు? అద్దాఆపా? సంసారం చేసేవోడు ఈ జాము దాకా చీట్ల పేక ఆట ఆడివచ్చేవోడు ఇంత వూళ్ళో ఎవుడన్నా వున్నాడా? "

"ఎవుడూ లేడు. అయితే ఏమంటావే? "

"నేనేమంటాను? నిన్ను అదేమని అడిగేవోడు ఎవుడూ లేకపోబట్టేగా నీ ఇష్టమొచ్చినట్టు చేయడం, నీ ఇష్టమొచ్చినట్టు పాటు పట్టం..."

"నోర్మూసుకుని కూసో! ఇంక నువ్వు నోరు తెరిస్తే ఒక్క తన్ను తంతా, పోయి రోడ్డుమీద పడతావు! ఆ రెండో కాలు కూడా విరిగిపోయిద్ది! నీ తాత సొమ్ము ఏం తీసుకొచ్చి పెట్టటంలా! నా ఇష్టం వచ్చినట్టు చేసుకుంటా! నువ్వు ఎంతవరకు వుండాలో అంతవరకే వుంటే వుంటావు ఇంట్లో, లేకపోతే కుంటుకుంటా మీ వూరిదారి పడతావు"

"కుంటుకుంటానో, నడుచుకుంటానో పోతాలే మావూరు. అక్కడికి పోతే ఇంత మాత్రం జరగదంటలే! నువ్వేం నన్ను వూరక కూచోపెట్టి, సంపాయించుకుని తీసుకొచ్చి పెట్టటంలా? ఎక్కడైనా నా రెక్కల మీదనే నేను బతుకుతున్నా!"

"ముందు నోర్ముయ్, ఇంక నోరు ఎత్తితే తంతా! నీరెక్కల మీదనే బతికే దానివయితే పో మీ వూరు! ఇంక నీకు మొగుడు ఎందుకూ, కాపరం ఎందుకూ, సంసారం ఎందుకూ? మీ వూరు పోయి నీ ఇష్టం వచ్చినట్టు తిరుగు!" అన్నాడు సింగయ్య కోపంగా.

సింగయ్య నిలబడి తిడుతూ వుండగానే సుశీల మాట్లాడుతూ, కోప్పడుతూ నీళ్ళు తోడింది. సింగయ్య స్నానానికి వెళ్ళాడు. అప్పుడు గుర్తొచ్చింది సుశీలకి గడియారం విషయం.

"చేతి గడియారం ఏమైందీ? నాల్రోజుల్నించీ కనపట్టంలేదు! నిన్నట్నించీ అడుగుదామనుకుంటానే మర్చిపోయాను" స్నానం చేసి వచ్చిన సింగయ్యని అడిగింది సుశీల.

అప్పటివరకూ రౌద్రంగా మాట్లాడిన సింగయ్య నీళ్ళు నములుతూ అన్నాడు. "అది ఏందో సరిగా ఆడకపోతంటే బాగుచేసిపెట్టమని వాచీ షాపు రమణమూర్తికి ఇచ్చా!"

"కొత్త గడియారం సరిగా ఆడకపోవటం ఏందీ? అది కొని ఐదారునెల్లు కూడా కాలా! అప్పుడే చెడిపోద్దీ! నువ్వు నిజంగా





రమణమూర్తికి ఇచ్చావా, లేకపోతే తీసుక పోయి పేకాటకి డబ్బులకోసం కుదవకట్టు పెట్టావా? "

"పిచ్చిపిచ్చిగా మాట్లాడవాకు! మనిషి మాటమీద నమ్మకంలేదెట్టా? చెడిపోతే బాగుచేయమని ఇస్తే కుదువకట్టు పెట్టానం టావేం? "

కొత్తగడియారం ఎందుకు చెడిపోద్దీ? "

"అబ్బో... మీ అయ్యవాళ్ళు బొగుమంచి గడియారం ఇచ్చార్లే, చెడిపోకుండా శాశ్వ తంగా బాగుండటానికి! ఎవుడో తీసిపారే సిన గడియారం ఇచ్చి, చెడిపోయిందంటే, చెడిపోకుండా బాగుండిద్దీ? "

"మా అయ్యవాళ్ళు వాళ్ళ శక్తికి తగినట్టు ఇచ్చారు గడియారం. మాటిమాటికీ వాళ్లని ఎత్తిపొడవటం, దెప్పిపొడవటం ఎందుకూ? చేతనయితే నువ్వు సంపాయించుకుని ఎప్పు టికీ చెడిపోని గడియారాన్ని కొనుక్కోకూ డదూ? నిన్ను ఎవుడు వద్దన్నాడు? "

"సంపాయించుకోనా, కొనుక్కోనా? నీ వుద్దేశం ఏందీ? గడియారం కూడా కొను క్కోలేని ఎదవ మాదిరిగా కనపడతన్నానా? సంపాయించుకోవటం చేతకాదనుకుంట న్నావా? "

"అబ్బో... ఏం సంపాయించినా సంపా యిస్తావు! సంపాయించటం సంగతి తరువా తలే, మేం కూలి చేసుకుని తెచ్చిన డబ్బులు పేకాటలో తగలెయ్యకపోతే చాలు!"

"నీ కూలి డబ్బులు నేను ఎప్పుడు పేకా టలో పెట్టానే? నువ్వు నాకు ఎప్పుడైనా కూలి డబ్బులు రూపాయి ఇచ్చావా? నీ అయ్య సొమ్ము అంతా తెచ్చిఇస్తే, నేను తీస కపోయి పేకాటలో పెట్టినట్టు మాట్టాడత న్నావే! ఏమేయ్, నోటికి ఏమాట వస్తే ఆ మాట అంటన్నావో! నీకు ఒక్కకాలే అవుడు! రెండు కాళ్ళూ వుండి, అందరి మాదిరిగా వుండేదానివయితే నువ్వు అసలు నిలిచేదా నివి కూడా కాదు! కుంటికాలు వేసుకుని ఏం లేకపోబట్టే ఇంతగా మిడిసిపడతన్నావ్! అంత మిడిసిపాటు పనికిరాదు!"

"నేనేం మిడిసిపడతన్నానూ? నా కుంటి బతుక్కి మిడిసిపాటు కూడానా? ఆ పడే మిడిసిపాటేదో నువ్వే పడతన్నావ్! బంగార మసుంటి గడియారం తీసకపోయి పేకా టలో పెట్టి, అది ఏదయ్యా అంటే నోటికొ చ్చినట్టు మాట్టాడతన్నావు! మిడిసిపడేది ఎవురో అందరికీ తెలుసు! నువ్వు మాట అనగానే సరిపోయిద్దీ? "

"గడియారం చెడిపోతే బాగుచేయమని ఇచ్చానని చెపతంటే పేకాటలో పెట్టానంటా వేమే? చెప్పేది మనిషి అనుకున్నావా, గొడ్డు అనుకున్నావా? "

"గొడ్డు అని ఎందుకు అనుకుంటాన్లే!"

"మరేమనుకున్నా? నీకూ గొడ్డుకీ పెద్ద తేడాలేదే! నిన్ను గొడ్డుని బాదినట్టు బాత్తం టేనే మాట యింటావు" అంటూ సింగయ్య సుశీలని కొట్టడం మొదలుపెట్టాడు. ఎడాపెడా కొట్టాడు. తలుపు పక్కన మూలలో కఱ్ఱ వుంటే అది తీసుకుని కొట్టాడు.

సుశీల గడియారం ప్రస్తావన ఇక తీసు కురాకుండా వుండేందుకూ, ఇంట్లో వాళ్ళు ఎవరైనా అప్పుడు నిద్రలేచి వస్తే వాళ్ల ముందు ఆ విషయంమీద సభ ఏర్పాటుచే యకుండా వుండేందుకూ "పోతే పోనీయి, పీడాకారపు గడియారం! దాని దగ్గర రోజూ తగాదా పడటం ఎందుకూ, తన్నులు తినటం ఎందుకూ? " అని సుశీల భావించ డానికీ, దానిమీద ఇక ఆశలు వదులుకు నేలా ఆమెని మానసికంగా సిద్ధంచేయడా నికీ ఇన్ని రకాల కారణాలతో, ముందు జాగ్రత్తగా సుశీలని కఱ్ఱతో శరీరంమీద వాతలు వచ్చేలా కొట్టాడు.

అప్పటివరకూ పడుకుని వాళ్ళ తగాదాని

వింటున్న కాంతమ్మా, అంకమ్మా వచ్చి సింగయ్యనించి సుశీలని తప్పించారు.

"ఎందుకురా దాన్ని కొడతావు? నువ్వు బేరానికి పోకుండా ఇంట్లో చాకిరీగికిరీ చేయకుండా, ఇల్లూ వాకిలీ ఎరక్కుండా పేకాటకి పోయి ఎప్పుడో అర్ధరేత్రి వస్తే ఇక్కడ నీకోసం మేలుకుని కూసుంటారు? పెద్దవాళ్ళ మాట అంటే లెక్కా జమా వుందం్రానీకూ? పేకాటకి పోవద్దురా, పోవద్దురా అని ఎన్నిసార్లు చెప్పాలి నీకూ? పేకాటకి పోతే కూడు వచ్చిద్దా, గుడ్డవచ్చిద్దా, ఏ మొచ్చిద్ది? పేకాటమీద రూపాయి సంపాయించి మిగిల్చినోడు ఎవుడన్నా వున్నాడా?" అంది కాంతమ్మ కోపంగా.

"నీసలహా ఇక్కడ ఎవురూ అడగలేదులే! నువ్వు ఇంక మాట్టాడకుండా వుంటే బాగుండిద్ది! మాటి మాటికీ నాదని వస్తావు ఎందుకూ నువ్వు? నీ మాత్రం మాకు తెలియదూ? " అని కాంతమ్మ మీద విరుచుకు పడ్డాడు.

"చాలా మట్టుకి వచ్చిందే యవారం. ఎదురుతిరిగే అంతటివాడివి అయ్యావన్నమాట! సరే అయితే..." అంది కాంతమ్మ, అప్పటి వరకూ తనంటే భయభక్తులతో వుండేవాడు, వూహించని విధంగా తనని ధిక్కరించి మాట్లాడినందుకు చిన్నబుచ్చుకుంటూ.

"సరైన మగవాడి పెంపకంలో పెరిగితే నువ్వు ఇట్ట తయారుకావు. ముండమోపుల పెంపకంలో పెరగబట్టే ముండమాదిరిగా తయారయ్యావు! ఊరంతటికీ నువ్వు లోకువలయితే నీకు నేను లోకువా... చేతకాని వాడనీ... పెళ్ళాన్ని తన్నడం తప్ప ఇంక నీకేం చేతవ్వు!" అని సుశీల ఏడుస్తూ తిట్టడం మొదలుపెట్టింది.

సుశీల మాటలతో సింగయ్య మళ్ళీ కొట్టడానికి ముందుకి వురకబోయాడు. అంకమ్మ అతన్ని పట్టుకుని ఆపింది.

సింగయ్య నీచమైన బూతులు తిడుతూ వుంటే, సుశీల కూడా ఏడుస్తూనే అతనికి ఎదురుమాట్లాడింది.

"ఊరుకో అమ్మాయి... నువ్వు ఇంక వూరుకో... పోయి పడుకో, ఎందుకీ గోల! చిన్నవాటికీ, పెద్దవాటికీ ఎందుకు అనవసరంగా తగాదాలు? ఏమన్నా ఉప్పూ ఉపకారం వున్న తగాదాలేనా ఇవి? " అంది అంకమ్మ.

సుశీల ఏడుస్తూ వెళ్ళి మంచంమీద పడుకుంది.

సుశీలని సింగయ్య కొడుతూ వుంటే, మంచంమీద మేలుకుని పడుకున్న సుబ్బమ్మ కనీసం మంచం కూడా దిగలేదు. మంచం మీద పడుకునే సింగయ్యని సమర్థిస్తూ సుశీలని తిట్టింది. "మొగపిల్లోడు... ఏదో కుర్రతనంగా తోటి కుర్రవాళ్ళతో కలిసి కొద్దిసేపు ఆడుకుని వచ్చాడనుకో... ఇంతలోకే ఏం కొంప మునిగిపోయింది? నువ్వు సంపాయించిన ఆస్తి అంతా తీసకపోయి ఏమన్నా తగలేసాడా? అసలు వాడు కూడు పెట్టమని అడిగితేనేగా ఈ జాతర అంతా... మనిషికి పనిచేయాలంటే ఎక్కడ లేని తెగుళ్ళూ వస్తాయి! మొగోడికి నీళ్ళు తోడి, కూడుపెట్టడానికి ఏం మాయరోగం, పెద్దరోగం!" అని సుబ్బమ్మ మంచంమీద పడుకుని గొణుగుతూ వుంది.

సుశీల సుబ్బమ్మ మాటల్ని పట్టించుకోకుండా పడుకుని ఏడుస్తూనే నిద్రపోయింది.

అంకమ్మ వడ్డించి పెడితే సింగయ్య కడుపునిండా ఖాళీ లేకుండా భోంచేసి సిగిరెట్ ముట్టించాడు.

★ ★ ★

మరుసటిరోజు వుదయం ఏడుగంటలు అయినా సింగయ్య మంచంమీదనించి దిగలేదు. గుర్రుపెడుతూ నిద్రపోతున్నాడు.

ఎప్పుడూ లేనిది ఆరోజు సుబ్బమ్మ





చీపురు తీసుకుంది. చిమ్ముతున్న సుబ్బమ్మకి మంచం అడ్డం వచ్చింది. "లే నాయనా... ఇంక నిద్రలే... తెల్లారి చాలా సేపయింది. ఇంకా ఎంతసేపు పడుకుని నిద్రపోతా! లేచి బేరానికో, కూలికో పో! పనీ పాటా లేకుండా తిరిగితే లోకులకంటే ముందు ఇంట్లో వాళ్ళచేత అడ్డమైన మాటలూ అనిపించుకోవాలి! లే... లే..."

"పొద్దున్నే ఏందే నీగోల, కాసేపు పడుకోనిచ్చేటట్టు లేవు? "

"ఇంకా ఎంతసేపు పడుకుంటా? పెందలాడి లేవటం, పనీపాటా చేయటంలాంటి మంచి బుద్ధులు నేర్చుకో! ముండమోపుల పెంపకంలో పెరిగితే ముండమోపిబుద్ధులు వచ్చినయని అంటంది నీ పెళ్లాం రేత్రి! ఎక్కడెక్కడి వాళ్ళచేత కూడా మాట పడాల్సిన పని మాకేమొచ్చిందిరా? కట్టుకున్నవాడికి నీకు తప్పదు. నీతోపాటు మేం కూడా నీ పెళ్ళాంతో మాటలు పడాలా ఏందీ? నువ్వు ఏదో పాటుపడి సందకాడికి పది రూపాయలు తెస్తే నీ పెళ్ళాం ఆ మాట అనదుకదా? "

"సరేలే, ఇంక అరవ్వాకే!" ఆ ప్రస్తావన తేవటం ఇష్టం లేనట్లు పెద్దమ్మని విదిలించి కొట్టాడు సింగయ్య.

"అరవ్వాకమని నువ్వు నా నోరు మూయిస్తావు. నీ పెళ్ళాం నోరు మూయిస్తా? చిన్నా లేదూ, పెద్దా లేదూ నోటికి ఏ మాట వస్తే ఆ మాట కూసిందే! అది అన్నట్టు నువ్వు పనికిమాలిన వాడివి కాబట్టి బతుకుతున్నావు కానీ, అదే ఇంకో మొగోడయితే అది అన్న మాటలకి ఈపాటికి దాన్ని ఉప్పుపాతర వెయ్యకపోయాడూ. దాన్ని చంపటమొ, వాడు చావటమొ జరగకపోయిందంట్రా? "

"పొద్దున్నే ఏందే నీ పల్లాయి! నువ్వు నోర్మూసుకుని కూసుంటే బాగుండిద్ది! రాత్రి అయిందేదో అయిపోయా! దాన్ని ఇప్పుడు గెలికి నువ్వు మళ్ళీ నిప్పు రాజెయ్యాలెట్టా? ఆ యవారం ఎందుకు నీకు ఇప్పుడు అనవసరంగా? " అని సుబ్బమ్మ మీదకు కోపంగా లేచింది అంకమ్మ.

"నేనేమన్నానే! అది అన్నమాటలేనా, నేనేమన్నా కొత్త మాటలు అంటున్నానా? అది అన్న మాటలు మీకు రుచిగా వున్నయ్యా?"

"ఏహై నోర్మూయ్ ఇంక! నువ్వు వెనుకేసుకుని రాబట్టికదూ వాడు పాడు అయ్యిందీ! మంచీ లేదూ, చెడ్డాలేదూ! ప్రతిదానికీ వాడ్ని వెనుకేసుకుని రావటమేనా? వాడి గడియారం ఏమైందో అడుగు" అంది అంకమ్మ.

"ఏమైందిరా నీ గడియారం? " సుబ్బమ్మ అడిగింది.

"చెడిపోతే బాగుచేయమని రమణమూర్తికి ఇచ్చానే!" దబాయించినట్లుగా అబద్ధం చెప్పాడు సింగయ్య.

"దయిద్రుడా... పేకాటకి పోవటం, డబ్బు కాజెయ్యడంగాక అబద్ధాలు కూడా నేర్చుకున్నావంట్రా? పా, రమణమూర్తిగారింటికి పోయి అడుగుదాం. నువ్వు గడియారం ఇచ్చావో, ఇవ్వలేదో తేలిపోవాలి ఇప్పుడు!"

"పోదాం పా" అన్నాడు సింగయ్య వెనక్కి తగ్గకుండా.

"ఎవురన్నా వింటే వూస్తారు. నాలుగురోజులనాడు గొడ్డుబోతు కట్టయ్య దగ్గిర నువ్వు వంద రూపాయలకి గడియారం కుదువకట్టుపెట్టలా? వంద రూపాయలకి రోజుకి పది రూపాయలా వడ్డీ? దేనిమీద డబ్బులు వచ్చి నువ్వా బాకీ తీరుస్తా! వంద రూపాయలు తెచ్చుకుంటివీ, పేకాటకీ, సిగిరెట్లుకీ తగలేస్తివీ. గేణం వున్న యవారమేనా ఇది? " అంది అంకమ్మ.

"రోజంతా చాకిరీ చేస్తే పన్నెండు రూపాయలు కూలి డబ్బులు ఇయ్యడానికి రైతులు

అల్లాడిపోతన్నారు. అసుంటిద వంద రూపాయలు అప్పు తెచ్చి, రోజుకి వాడికి పది రూపాయలు వడ్డీకడతా! ఏం అవసరం వచ్చీ, గొంతుమీదకు ఏం అక్కర వచ్చీ నువ్వు వాడి దగ్గిర కుదువకట్టు పెట్టి డబ్బు తీసుకున్నట్టూ? అదేమంటే నీకెందుకు అని మాకు ఎదురుతిరగడం అయితే నేర్చుకు న్నావు!" అంది కాంతమ్మ.

సింగయ్య ఏం మాట్లాడలేదు. మంచంమీ దనించి లేచి తలకాయ వంచుకుని నేల చూపులు చూస్తూ నిలబడ్డాడు.

"నీకెవరు చెప్పారే?" అడిగింది సుబ్బమ్మ.

"వీడు ఆ పిల్లని కొడతంటేనే నాకు అను మానం వచ్చింది. పొద్దున్నే మంచి నీళ్ళకి పోయినప్పుడు బావి దగ్గర కిట్టయ్య పెళ్లాం కనపడితే అడిగా! ఆ గొడ్డుబోతోడేగా మన వూళ్లో ఇసుంటి ఎదవల దగ్గిరనించి వస్తు వులు కుదువకట్టు పెట్టుకుని డబ్బులు ఇచ్చేది. రోజుకి పది రూపాయల వడ్డీ ఇస్తా నని వంద రూపాయలు తెచ్చుకున్నాడని ఆమె చెప్పింది" అంది అంకమ్మ.

"ఎంత నామర్దాయవారం! ఏమంత కొంప మునిగిపోతందని పది రూపాయల వడ్డీకి డబ్బు తీసుకోవాలి!" అంది కాంతమ్మ.

తన దగ్గిర 50 రూపాయలు వుంటే అవీ, సుశీల దగ్గిర 30 రూపాయలూ, అంకమ్మ దగ్గిర 20 రూపాయలూ పోగుచేసి, కూలిడ బ్బులు రావాల్సివుంటే వాళ్ళింటికి వెళ్ళి 40 రూపాయలు తెచ్చి గొడ్డుబోతు కిట్టయ్యకి 140 రూపాయలూ చెల్లించి, ఆయనని అడ గాల్సిన నాలుగు మాటలూ అడిగి, రెండు తిట్లు తిట్టి గడియారం తీసుకువచ్చింది కాంతమ్మ.

★ ★ ★

నాసరయ్యా, రాగమ్మా ఇద్దరూ వాళ్ళ ఊరునించి సుశీల దగ్గరకు వచ్చారు. వాళ్ళు వస్తే సుబ్బమ్మ ఎడమొగం పెడమొగంగా వుంది.

"సంక్రాంతి పండగ ఇంక 10 రోజులేగా వుంది. పండక్కి అబ్బాయినీ, అమ్మాయినీ తీసకపోదామని వచ్చాం వదినా" అంది రాగమ్మ సుబ్బమ్మతో.

"నాదేముంది? తీసకపోండి. నేనువుండ మంటే వుంటారా? నేను తీసకపొమ్మంటే తీసకపోతారా మధ్యలో నేనెవెతిని. వచ్చేది వాళ్లూ, తీసకపోయేది మీరూ" అంది సుబ్బమ్మ.

"పెద్దదానివి. నిన్ను అడగాలికద వదినా?"

"ఏం పెద్దలే! నా పెద్దరికం మంట కలి సినట్టే వుంది. నువ్వు అనాల్సిందే నేను పెద్దదాన్ని అనీ! నీ కూతురితో అనిపిచ్చు ఆ మాట!"

"తెలిసీ తెలియని పిల్ల! అది ఏమన్నా అంటే మనసులో పెట్టుకోవాకు! అది నీ బిడ్డలాంటిది అనుకో!" రాగమ్మ సుబ్బమ్మతో అనునయంగా, వినయంగా, లొంగి లొంగి దాసోహం అన్నట్లు మాట్లాడింది.

అయినా సుబ్బమ్మ బిగుసుకుపోయి వుంది.

రాగమ్మ మళ్ళీ కాంతమ్మని కూడా అదే మాట అడిగింది. "అమ్మాయినీ, అబ్బాయినీ పండక్కి తీసకపోతాను"

"తీసకపో, పండక్కి తీసకపోకపోతే యట్టా? మళ్ళీ 15 రోజుల్లో తిరిగి పంపిచ్చు ఎక్కడైనా వాడు చేసేపని లేదనుకో! అయినా ఇంటిపట్టున వుండటం వేరూ, అత్తగారి ఇంటి దగ్గర వుండటం వేరూకదా!" అంది కాంతమ్మ.

సింగయ్యని కూడా పండక్కి రమ్మని అడి గాడు నాసరయ్య. ముందు రానన్నాడు. అలిగినట్లు బెట్టు చేసాడు. మనసులో గట్టిగా వెళ్ళాలనే వుంది. అయినా దర్పం

ప్రదర్శించుకోవాలి.

నాసరయ్య బ్రతిమ లాడటంతో చివరకి తలకాయ తాటించాడు. అత్తగారి వూరు వెళ్ళడానికి ఉత్సాహంగానే సన్నద్ధమయ్యేడు.

ఆరోజు రాత్రి రాగమ్మ ఒంటరిగా వున్నప్పుడు సుశీల చెప్పింది.

"రెండు నెలలనించీ నెల రావటం లేదమ్మా!"

"అయితే నువ్వు తల్లివి కాబోతున్నావన్న మాట. నేను అమ్మమ్మని అవుతున్నాను" అంది రాగమ్మ.

సుశీల ఆమాట చెప్పిన తరువాత రాగమ్మకి ఎందుకో చాలా సంతోషంగా వుంది మనసు. ఆనందంతో ఉప్పొంగిపోయింది ఆమె.

"అప్పుడే ఎందుకమ్మా నాకు పిల్లో పిల్లోడో! ముందు నాకు గతి లేదు. ఇంక ఆ పుట్టేవాళ్ళని నేను ఎక్కడ సాకేదీ, ఏం పెట్టి సాకేదీ? " అంది బాధగా, విచారంగా సుశీల.

"అట్ట అనకూడదమ్మా. పిల్లలు పుడితే అన్నీ అయ్యే సర్దుకుంటయ్యి"

"ఏం సర్దుకుంటయ్యి? మీ అల్లుడు పేకాటకి పోవటం సర్దుకుంటాడా, సావాసగాళ్ళూ, సారాయీ దొరికినరోజు తాగటం మానుకుంటాడా? డబ్బులు చేతిలో వుండాలి కానీ వందరూపాయలు అంటే ఒక రూపాయి మాదిరిగా కర్చు పెడతాడు"

"పిల్లలు పుడితే సొమ్ముమీద ఆపేక్షా, జాగర్తా వచ్చిద్దిలేవే!"

"రావాల్సిందే. పుట్టినప్పుడు వచ్చిన బుద్ధి పిడకలతో పోయిద్దంట. ఆయన మారతాడూ, నా రాత బాగుండిద్దని నాకు ఏ కోశానా లేదు. ఆయన మారకపోతే మారకపోయాడు. ఇంటో సుకమన్నా వుండిద్దంటే అది కూడా లేదు. దేశంలో అందరికీ ఒక అత్త అయితే నాకు ముగ్గురు అత్తలు, మూడు పక్కలనించీ పీక్కతింటానికి! ఆ అత్తలకి చాకిరీ చేయలేక ఎప్పుడో నా వూపిరి పోయినా పోయిద్ది!"

"ఛ... అయ్యేం మాటలే సుశీలా? శుభమా అని మంచిమాట చెప్పి మళ్ళీ అపశకునపు మాటలు మాట్లాడతావు. నేను ఎంతమందిని చూళ్ళేదూ... పెళ్ళయిన కొత్తలో విచ్చలవిడిగా తిరిగినవాళ్ళు మళ్ళీ మామూలుగా దారికి రాలా? ఎంత బాగా ఎక్కువ పైలాపచ్చీసుగా తిరుగుతాడో, వాడే అందరికంటే ముందు మారిపోతాడు. నీ మొగుడు మనిషి మంచోడేనే, నీ అత్తముండలవల్ల పాడయ్యాడు"

"మంచోడే... ఏం మంచీ... పైసా సంపాదన లేకుండా చీట్లపేక ఆడటమా మంచోడంటే! నా జాతకం ఈ జలమకి ఇంతేలే"

"నీ జాతకానికేమే అట్టంటావు, నీది బంగారమసుంటి జాతకం. లంకంత ఇల్లు! ఆ ఇల్లు చాలదంటే ఎన్నోవేలు చేయడానికి. నువ్వేం బాధపడవాకమ్మా... నువ్వు బాధపడితే మాకు బాధకదూ..." అంది రాగమ్మ కూతురి తలమీద చేయివేసి ఆప్యాయంగా నిమురుతూ.

★ ★ ★

కూతుర్నీ, అల్లుడ్నీ పండుగకి వాళ్ళ వూరు తీసుకుపోయారు రాగమ్మా, నాసరయ్యా.

పోయిన మొదటిరోజూ, మరుసటిరోజూ ఇంటి దగ్గర వున్న సుశీల మూడో రోజు తల్లివెంట కూలికి వెళ్ళడానికి సిద్ధమైంది.

"నువ్వెందుకులే సుశీలా... నువ్వు కూలికి రాకపోతే ఏం పోయిందిలే. మీకు తిండిపెట్టలేమా ఏంది? అక్కడ చేసీ, ఇక్కడ చేసీ ఎందాక చేస్తావు, గాలి పోసుకోకుండా. నువ్వు పనికి రావద్దులేమ్మా, ఇంటి దగ్గర వుండు" అంది రాగమ్మ.



"కాదులే అమ్మా... వూరక ఇంటి దగ్గర వుంటం ఎందుకు, ఏం తోసుబాటు అయిద్ది? నీతోపాటు కూలికి వస్తే నాల్రూపాయలు వస్తయ్యిగా" అని సుశీల తల్లి వెంట వెళ్ళింది.

ఇంట్లో పరిస్థితీ, తల్లిదండ్రుల స్వభావం సుశీలకి తెలుసు. ఒకరోజూ, రెండు రోజులూ మర్యాద. మూడోరోజునించీ విసుక్కోవడం, నసుక్కోవడం. ఎందుకొచ్చిన విషయం. తల్లితోపాటు కూలికి వెళ్తే ఏ బాధా వుండదు. ఒకరికి ఇద్దర్ని నెలరోజుల పాటు కూర్చోబెట్టి పెట్టాలంటే వాళ్లు ఎంత వాళ్లు. వాళ్ళ శక్తి ఎంత? సుశీల ఆ విషయం గ్రహించే తల్లివెంట వెళ్తోంది.

సుశీలకి వయసులేదు కానీ నిజానికి చాలా తెలివి కలిగిన అమ్మాయి. ఎంతో చురుకుగా వుంటుంది. ఎంతో చక్కగా, నైనంగా పనులు చేస్తుంది.

ఏ గూటి పక్షులు ఆ గూటికి చేరినట్లు సింగయ్యకి ఈ వూళ్లో ఆ బాపతు స్నేహితులే దొరికారు.

పేకాట దగ్గరకి వెళ్ళి కూర్చోవడం మొదలుపెట్టాడు. ఆట దగ్గరకి వెళ్ళి కూర్చుని సలహాలు ఇవ్వడం, ఎవర్కైనా ఆట ఆడిపెట్టడం చేస్తున్నాడు.

తనకి కూడా గట్టిగా ఆట ఆడాలనిపించినా చేతిలో రూపాయి లేదు.

ఒకరోజు ఉదయం సుశీలని అడిగాడు. "ఇరవై రూపాయలు వుంటే ఇయ్యవే, పనుంది"

"ఏం పనేంది? "

"ఏం పనైతే నీకెందుకు, ఇస్తావా, ఇయ్యవా? "

"నా దగ్గిర ఎందుకున్నయ్యి, ఎక్కడ్నించి వస్తయ్యి? "

"రోజూ నువ్వు కూలికి పోవడం లేదెట్టా? కూలికి పోతే డబ్బులు ఇయ్యరా ఏంది? మీ అమ్మనడిగి తీసుకుని ఇయ్యి"

"ఎందుకంటే ఏమని చెప్పేది"

"ఏదో ఒకటి చెప్పి తీసుకో"

"నా వల్ల కాదు. నేను అడగను" అంది సుశీల.

సింగయ్య విసురుగా బయటకు వచ్చాడు. సుశీలమీద బాగా కోపంగా, కసిగా వుంది.

రోజూ రాగమ్మ కూలికి వెళ్ళేముందు సింగయ్యని పిలిచి భోజనం పెట్టేది. ఆ రోజు కూడా రాగమ్మ పిలిచింది.

"రా అబ్బాయి... అన్నం తిందువు. మేం పొలం పోయే వేళవతంది. మళ్ళీ ఎండబడి పోయిద్ది"

"నాకు ఆకలిగా లేదు. నేను ఇప్పుడు తినను"

"రోజూ పెందలకాడి తినేవోడివి ఇయ్యాల ఎందుకు తినవు? "

"ఆకలిగా లేదు అని చెప్పటంలా" అన్నాడు విసుగ్గా.

"సరే, మేం పొలంపోతన్నాం కానీ, ఆకలయినప్పుడు పెట్టుకుని తిను. మళ్లీ తినకుండా వుండేవు" అని రాగమ్మ, సుశీల పొలం వెళ్లిపోయారు.

తను అన్నం తినకుండా అలిగితేకానీ వీళ్లు దారికి రారు. అన్నం తినకుండా వుండాలనుకున్నాడు సింగయ్య.

అయితే మధ్యాహ్నానికి ఆకలికి వుండలేకపోయాడు. రోజూ ఉదయమే తినేవాడికి కడుపులో రెపరెపలాడింది, ఆలస్యం కావటంతో. పందెం, పంతం తీసి పక్కన పెట్టి తనే పెట్టుకుని తిండి తిన్నాడు.

రోజూ రాగమ్మతో, నాసరయ్యతో కల్పించుకుని ఏదో విషయాలు మాట్లాడేవాడు. ఆ రోజు మాట్లాడలేదు. మూగనోము పట్టాడు.

వచ్చినప్పటినించీ ఇంట్లో పడుకునేవాడు




ఆ రాత్రి బయట మంచులో, చలిలో మంచం వేసుకున్నాడు.

"అదేందబ్బాయి, మంచులో ఎట్ట పొడు కుంటా? లోపల ఇంటో పొడుకో" అంది రాగమ్మ.

"లోపల నాకు గాలి ఆట్టంలా" అన్నాడు పొడిగా.

ఎందుకో అలిగాడని గ్రహించి రాగమ్మ మౌనంగా వుంది. మరుసటిరోజు ఉదయమే సుశీలని అడిగింది.

"ఎందుకే మీ ఆయన అలిగాడట్టుగా వుంది? "

"పనా పాటా, డబ్బులు కావాలంట"

"ఎందుకూ? "

"పేకాటలో కాజెయ్యడానికి!"

"ఎంత కావాలేంది? "

"పది రూపాయలు ఇయ్యమని అడిగాడు"

సింగయ్య అడిగినంత గాకుండా కొంత తగ్గించి చెప్పింది సుశీల.

"నిన్ను అడిగినప్పుడు నాకు చెబితే ఇచ్చేదాన్నిగా! ఇక్కడ మీరు నాల్రోజులు వుంటారు. ఈ నాల్రోజుల్లోనే గొడవలూ, కీసలాటలూ ఎందుకమ్మా? అడిగినప్పుడు పదిరూపాయలు ఇస్తే పోయేదానికి ఎందుకు తగాదా? ఆ అబ్బాయి అలగటం, బాధపట్టం ఎందుకు? మళ్ళీ రేపు నువ్వు అక్కడికి పోయి కాపరం చెయ్యాలి!" అని రాగమ్మ పది రూపాయలు తీసి కూతురికి ఇచ్చింది.

భర్త ప్రవర్తన సుశీలకి కష్టంగా వుంది. అక్కడ ఆ వూళ్లో ఎలా వున్నా పర్లేదు. ఇక్కడ కూడా తన ధోరణి మార్చుకోకపోవడంతో ఆ అమ్మాయి కలత చెందింది.

తల్లి ఇచ్చిన డబ్బులు సుశీల ఇవ్వబోతుంటే ముందు సింగయ్య తీసుకోలేదు. "నాకెందుకులే డబ్బులు? నేనెప్పుడైనా పది రూపాయల ముకం ఎరిగున్నానూ? నేనంటే లెక్కా జమా వుందంటే మీకు? ఎప్పుడూ మీ రోజులే వుండవే" అని నిరసనగా తిడుతూనే ఆ డబ్బు తీసుకున్నాడు.

"నిన్న మా అమ్మ మంచినీళ్ళకి పోతే బాయి దగ్గిర ఎగతాళి చేస్తన్నారంటయ్యా, మీ అల్లుడు గాలోడంటగా అని అడిగారంట ఇద్దరు ముగ్గురు! మనకెందుకయ్యా చీట్ల పేక ఆటలు!"

"చీట్ల పేక ఆట ఎవుడు ఆడేడు? నా దగ్గిర డబ్బులు వున్నయ్యేంది ఆట్టానికి? " అన్నాడు సింగయ్య.

రాగమ్మ రెండు మూడు రోజులకోసారి కూతురికి పదిరూపాయలు ఇస్తూనే వుంది. ఆ డబ్బు తీసుకుని సింగయ్య సిగిరెట్లుకి తగలేస్తూనే వున్నాడు.

రోజూ పేకాట దగ్గరకి వెళ్ళి కూర్చుంటున్నాడు కానీ, ఎక్కువగా ఆడటంలేదు, చేతిలో డబ్బులేక.



పండుగ వెళ్ళిపోయింది. అయినా సింగయ్య ప్రయాణం అయ్యే సూచనలు కనపడలేదు. "మా వూరు వెళ్తాం" అని సింగయ్య నోటినించి వస్తే పంపించాలని రాగమ్మ ఎదురుచూస్తోంది.

"ఇదేందే, వీడ్ని కూర్చోబెట్టి ఎందాక పెడతాం? కుర్రోడు. పనిచేసుకుంటే పది రూపాయలు రావూ! మనమేమన్నా వున్నోళ్లమా కూర్చోపెట్టి అల్లుడికి అల్లెం పెట్టడానికి. ఇట్టయితే బాగానే వుండిద్ది. తొందరగానే బాగుపడతాం" అని నాసరయ్య భార్యని విసుక్కున్నాడు.

"ఊరుకొయ్యె, ఎవురన్నా వింటే బాగుండదు. పండక్కి తీసకొచ్చిన కొత్త అల్లుడ్ని పనికి పంపిస్తామా ఏంది? మంచోడివేనే, నా పీడాబాయి..."



"ఏం, పనిచేసుకుంటే తప్పేంది? "

"తప్పని ఎవురన్నారు? ఆ అబ్బాయికి వుండాల, అంతేకానీ మనం చెప్పి పనికి పంపిస్తామా ఏంది? "

"పనికి పోతే తప్పేందంట? "

"ఇంక అరవ్వాకయ్యో! ఆ అబ్బాయి అసలే మంచోడు కాదు. మాటిమాటికీ అలుగుతాడు. ఇంక వారంరోజుల్లో వాళ్ళ వూరు పంపించేదానికి గోలెందుకు? పదిరోజులు వాళ్ళని చూశామో, చూడలేదో అప్పుడే బయటపడితే ఏం బాగుండిద్ది? అప్పటికీ అమ్మాయి నాగా లేకుండా పనికి వస్తానే వుండె!" అని రాగమ్మ, నాసరయ్య నోరు మూయించింది.

పండుగకి ముందూ, పండుగ పోయిన తరువాతా దాదాపు నెలరోజులు సుశీలనీ, సింగయ్యనీ వాళ్ళకి వున్న పరిధిలో బాగానే చూసింది రాగమ్మ. చాలాసార్లు పిండివంటలు చేసి పెట్టింది. ఎన్నోసార్లు వాళ్ళకి ప్రత్యేకంగా మాంసాహారం వండి పెట్టింది.

కూతురి విషయంలో అల్లుడి ధోరణి మారుతుందనీ, కూతుర్ని ప్రేమగా చూసుకుంటాడనీ రాగమ్మ ఆశ, అందుకే ఆమె ఆప్యాయతానురాగాలతో సింగయ్యని చూసింది. అతని మనసు నొప్పించకుండా, అతను మనసు ఎక్కడ కష్టపెట్టుకుంటాడో అనే ఉద్దేశంతో ఎంతో జాగ్రత్తగా మసలుకుంది.

వెళ్ళి చాలారోజులు అవుతోందనీ, భార్యని తీసుకుని వెంటనే రమ్మనీ అంజమ్మ చందలూరు వెళితే ఆమెతో కబురు చేశారు సోదరీమణుల త్రయం.

"మీ పెద్దమ్మా, పిన్నమ్మలు దారిపోడుగునా చెప్పార్రా నిన్నూ, సుశీలనీ తొందరగా పంపించమనీ! మీరు కానీ తొందరగా వెళ్ళకపోతే వాళ్ళు ముగ్గురూ కట్ట కట్టుకుని వచ్చేటట్లు వున్నారు. మంచిరోజు చూసుకుని పదండి ఇంక" అంది అంజమ్మ.

"అట్నే పిన్నాం. రేపో మాపో వెళతాం" అన్నాడు సింగయ్య.

అక్కడికి వెళ్ళాలనే మాట వినడంతోనే సుశీలకి వణుకు వచ్చింది. ఆ వూరు వెళ్ళాలని సుశీలకి ఏమాత్రమూ లేదు.

కానీ వెళ్ళాలి.

తప్పదు. వెళ్ళనంటే ఎలా కుదురుతుంది?

ముందు తల్లిదండ్రులు వప్పుకోరు. చుట్టుపక్కలవాళ్ళు వప్పుకోరు. వూళ్ళో జనం వప్పుకోరు.

వాళ్ళందర్నీ కాదని ధిక్కరించి తను ఏం చేయగలుగుతుంది? ఎలా వుండగలుగుతుంది వెళ్ళకుండా.

వెళ్ళాలంటే మనసు భారంగా వుంది. దిగులుగా వుంది. విచారంగా వుంది. మనసు పరిపరివిధాల ఏడుస్తోంది.

కన్నతల్లిదండ్రుల్నీ, పుట్టిపెరిగిన వూరునీ, ఆడుకున్న ఆటస్థలాల్నీ, పెరిగిన పరిసరాల్నీ వదిలి, పరాయి వూరూ, పరాయి వాళ్ళ ఇంటికీ, పరాయి వాతావరణంలోకీ, తనంటే ఏమీ ఇష్టమూ, అభిమానమూ, ప్రేమా లేని వాళ్ళ మధ్యకీ, తనని నిమిషనిమిషం శాసించే వాళ్ళ మధ్యకీ, తనని అనుక్షణం హింసించేవాళ్ళ మధ్యకీ, తనని నీడలా వెంటాడుతూ తన కదలికలమీదా, శరీరం మీదా నిఘావేసి వుంచినవారి మధ్యకీ, తనని ప్రతి ఘడియా సూటీపోటీ మాటలతో, చేతలతో అవమానించే వారి మధ్యకీ, తనంటే ఏమీ గౌరవం లేకుండా 'కుంటిదీ, కుంటిదీ' అని అవహేళన చేసేవారి మధ్యకీ, తనని కొడుతూ బాధించి ఆనందించే వారి మధ్యకీ, తనని కనీసం సాటి మనిషిగా గాకుండా పశువులా, పక్షిలా, జంతువులా నీచంగా, హీనంగా చూసేవారి మధ్యకీ, ఖచ్చితంగా చెప్పాలంటే తనని ఒక శత్రు

 

వులా పరిగణించేవారి మధ్యకి- వాళ్ళకి సేవలు చేయడానికీ, చాకిరీ చేయడానికీ, వాళ్ళ సమస్త అవసరాలు తీర్చడానికి తను వెళ్ళాలి.

వెళ్ళనంటే...

ముందు తల్లి నీతివాక్యాలు బోధిస్తుంది. తరువాత వంతు తండ్రి చెపుతాడు.

ఆ తరువాత... అందరూ... నెలరోజులుగా తల్లిదండ్రుల దగ్గర వుంటున్న సుశీలకి అక్కడి జీవితమూ, ఇక్కడి జీవితమూ పోల్చుకుంటే తేడా స్పష్టంగా కనపడుతోంది.

అక్కడి జీవితం నిస్సారంగా, హీనంగా, అందరి మధ్య భయంభయంగా, బాధాకరంగా వుంటే ఇక్కడి జీవితం ఉల్లాసంగా, ఉత్తేజంగా, స్వేచ్ఛగా, ఆహ్లాదంగా, ఆనందంగా వుంది.

ఒక్క మాటలో చెప్పాలంటే అక్కడ పంజరంలో పక్షిలా తాను వుంటే, ఇక్కడ గగనవీధుల్లో స్వేచ్ఛగా విహరించే పక్షిలా వుంది.

ఎక్కడైనా తను వూరికే కూర్చుని తినేరకం కాదు. అక్కడైనా పనిచెయ్యాల్సిందే, ఇక్కడైనా పని చేయాల్సిందే. అక్కడైనా కూలికి వెళ్తేనే కూడు, ఇక్కడైనా కూలికి వెళ్తేనే కూడు. ఎక్కడైనా తన రెక్కల కష్టం తనకి తప్పదు.

అయినా అక్కడికి వెళ్ళడం తనకి ఇష్టం లేదు. తనకి మనసులో కోరిక లేదు వెళ్ళాలని.

అక్కడకి వెళ్ళాలంటే బందిఖానా లోనికి వెళ్ళడమే! స్వేచ్ఛా సంతోషం ఏమీ వుండవు తనకి. చక్కగా మనసు విప్పి, నిర్భయంగా, నిస్సంకోచంగా ఒక్కమాట మాట్లాడలేదు తను అక్కడ, కనీసం భర్తతో కూడా.

తన తల్లిదండ్రుల దగ్గర ఇక్కడికి వచ్చిన తరువాత ఈనెల రోజులూ అప్పుడప్పుడూ అలిగినా సరే భర్త బాగున్నాడు.

చాలాసార్లు తనతోపాటు నవ్వాడు. మనసు విప్పి మాట్లాడాడు. ప్రేమ వున్నట్లే కనిపించాడు.

అక్కడయితే శత్రువులా రాక్షసంగా, క్రూరంగా, అమానుషంగా, పైశాచికంగా...

అన్ని విషయాల్లోనూ...

ఎక్కడెక్కడో తిరిగివస్తాడు. ఎంతెంతో దూరం తిరిగివస్తాడు. అంత దూరం తిరిగి వచ్చినవాడు ఇంటికి వచ్చిన తరువాత ఒక్క గ్లాసు మంచినీళ్ళు అందుకోలేడు.

తను ఎంతపనిలో వున్నా, నిద్రపోతున్నా సరే సేవికలా లేచి అతనికి మంచినీళ్లు అందించాల్సిందే.

కుండలోనించి నీళ్లు ముంచుకుని తాగడం అంటే అది అతనికి నామోషి. అవమానం! ఘోరాపరాధం!

అది అతని నైజం!

తను బానిసలా, సేవికలా, దాసీలా, పనిగత్తెలానే కనపడుతుంది అతని కంటికీ, ఆ ఇంట్లో వున్న అందరి కళ్లకీ!

మనసులో రకరకాల ఆలోచనలతో మథనపడుతుండగా భయంగానే ఒక నిర్ణయానికి వచ్చిన సుశీల భర్తతో అంది.

"మనం ఈ వూళ్లో వుందామయ్యా! ఈ వూళ్లోనే నువ్వు కూరగాయల బేరం చేసుకుందువూ..."

"ఏందీ ఈ వూళ్లో వుందామా?"

"ఆ... ఎక్కడైనా మనకి రెక్కల కష్టం తప్పదు. ఈ వూరు పెద్దవూరు. ఇక్కడయితే నీకు కూరగాయల బేరం బాగా సాగిద్ది!"

"నీకు పిచ్చిగానీ పట్టిందేందే? ఈ వూళ్ళో వుండేదేంది? అక్కడ మా పెద్దమ్మా, చిన్నమ్మలని ఎవురు చూస్తారు? వాళ్ళకి నేను దత్తు అని మరచిపోయావేంది? వాళ్ళంద

రినీ వదిలిపెట్టి ఇక్కడ ఈ వూళ్లో వుండ మంటా? "

"అక్కడ వాళ్ళందరికీ నేను చాకిరి ఎక్కడ చేసి చచ్చేది? వాళ్ళు ఎవురూ ఇటు పుల్ల తీసి అటు పెట్టరు. వాళ్ళకి నేను చాకిరీ చేయలేనయ్యా"

"వాళ్ళకి ఏం చేస్తన్నావే? వాళ్ళకి నువ్వు చేసే చాకిరీ ఏందీ? కూడూ కూరా వండ టమేనా ఇంకేమన్నా విరగబడి చేస్తన్నావా? అంతమాత్రం కూడా చేయలేవేంది? "

"నీకు అట్నే వుండిద్దిలే. నీకేం, మాటలేగా చెప్పడం" అని నసిగింది సుశీల.

"పిచ్చి పిచ్చి ఆశలేం పెట్టుకోవాకు. అక్కడ ఇల్లూ వాకిలీ వదిలిపెట్టి, ఇక్కడ లోకుల కొంపల్లోకి వచ్చి వుండమంటా వేంది? అంత కర్మేం పట్టింది? "

సింగయ్య ఈ వూళ్లో వుండటానికి వప్పు కోడని సుశీలకి తెలుసు. అయినా వుండలేక అడిగింది. తను అడిగి, బ్రతిమాలితే కనీసం తన కోసం అయినా వుంటాడని చిన్న ఆశ. పనికిమాలిన ఆశ, వృధా ఆశ!

సింగయ్య వెళ్ళిపోయినా సరే తనకి మాత్రం తను వెళ్ళడం ఇష్టంలేదు. తను ఒక్కదాన్నయినా ఇక్కడ వుంటే సరిపో తుంది.

అమ్మ ఏమంటుందో?

అల్లుడ్నీ, కూతుర్నీ ప్రయాణం చేయడా నికి అన్నీ సిద్ధం చేస్తున్న రాగమ్మ దగ్గరకి వెళ్ళి సుశీల అంది.

"నేను వెళ్ళనమ్మా! నాకు అక్కడ ఏం బాగుండదు!"

రాగమ్మ కూతురి మాటలకి ఆశ్చర్యపో యింది.

"ఏందమ్మా నువ్వనేది? "

"నాకు ఆ వూళ్ళో వుండటం ఇష్టం లేదమ్మా, నేను వెళ్లను"

"తప్పమ్మా, వెళ్ళనంటే ఎట్ట? కాపరం వద్దనే వాళ్ళు ఎవురన్నా వున్నారూ? ఇప్పుడు నువ్వు మామూలు మనిషివికూడా కాదు. కొద్దిరోజుల్లో తల్లివి అవుతావు! చిన్న పిల్లలు మాట్టాడినట్టు మాట్టాడితే ఎట్ట? ఎప్పుడూ చిన్న పిల్లవేనా? "

"ఏమో, నాకు అక్కడికి పోవాలనిలేదు. నేను ఇక్కడే, మీ దగ్గరే వుంట! అక్కడికి పోయి వాళ్లందరికీ చాకిరీ నేను చేయలేను. నాకు ఆ వూరికి పోబుద్ధి కావటంలేదు"

"పోనంటే యట్టే? మొన్న చాకలి లచ్చి గాడు చూడు, వాడి కూతురు మొగుడి దగ్గ రకి పోనంటే ఎట్ట కొట్టేడూ, జుట్టు పట్టు కుని బజారు తిప్పి కొట్టేడు. వాడి దెబ్బలకి తట్టుకోలేక ఆ పిల్ల దండం పెట్టి యెనక్కి తిరిగి చూడకుండా యెల్లింది!"

"అయితే ఏందంట నువ్వనేది? "

"నేననేది ఏముందమ్మా? మీ అయ్య మంచోడు కూడాకాదు. కోపం వస్తే ఎర్రి కోపం వచ్చిద్ది. ఆయనకి కోపం వస్తే ఎవురం పట్టలేం. నువ్విట్టా పోను అన్నా వని తెలిస్తే అసలు వూరుకుంటాడూ? "సుశీ లతో మంచిగా మాట్లాడుతూనే బెదిరిం చింది రాగమ్మ.

చాకలి లచ్చిగాడి కూతురు సుశీలకి కళ్ల ముందు కదలాడింది. ఆ అమ్మాయిదీ సుశీల ఈడే! పేరు లీల. లీలకి పెళ్లయ్యి అయిదారు నెలలు అయింది. అతడు తల్లికి స్వంత తమ్ముడే!

లీలకి అతన్ని చేసుకోవడం ఇష్టంలేదు. మేనరికం పోగొట్టుకోవడం ఎందుకనీ మేన మామ అనీ తల్లిదండ్రులు బలవంతంగా పెళ్ళిచేసారు.

పెళ్ళయిన తరువాత పుట్టింటికి వచ్చిన ప్రతిసారీ వెళ్ళనని మొరాయించేది!

మొదట్లో బతిమలాడి పంపించారు. తరు వాత బలవంతంగా పంపించారు. చివరికి

కొట్టి పంపించారు.

తండ్రి కొడతాడని తల్లి మాటల్లోని బెది రింపు ధోరణి సుశీలకి అర్థమైంది.

"పోకపోతే అయ్య కొడతాడా ఏందమ్మా? కొట్టమను, ఆ చచ్చేదేదో ఇక్కడే చస్తా! వాళ్ళకీ, మీకూ ఇద్దరికీ పీడా వదిలిపోయిద్ది"

"అవేం మాటలు సుశీలా! కొడతాడని ఎవురన్నారు? "

"నువ్వు అనేది అదేగా"

"అది కాదమ్మా... నామాట విను! ఎప్ప టికైనా మెట్టిల్లే నీ ఇల్లయిద్దికానీ, పుట్టిల్లు నీ ఇల్లు కాదమ్మా! ఇప్పుడు నీకు నాలుగో నెల! పో, పోయి రెండు నెల్లు వుంటే ఆరో నెల లోనో, ఏడోనెలలోనో కాన్పు కోసం మళ్ళీ ఇక్కడకి తీసుకు వస్తాం! కాన్పు అయిన తరువాత మూడు నాలుగు నెల్లు ఇక్కడే వుందువు! తరువాత పండంటి బిడ్డని చంక నేసుకుపోతే వాడే నీ జాతకాన్ని మారు స్తాడు! బిడ్డని చూసి వాళ్ళే మారతారు! వాడితో పాటే నిన్ను కూడా పువ్వుల్లో పెట్టి చూసుకుంటారు"

"కట్టెల్లో పెట్టి చూసుకోకపోతేచాలే, పువ్వుల్లో పెట్టి చూసుకున్నంత వున్నెం" అంది సుశీల నిస్సహాయంగా.

ఏమీ ఇష్టం లేకుండానే, బాధగానే, భయంగానే, విచారంగానే, ఆందోళనా హృదయంతోనే సుశీల సింగయ్య వెంట వాళ్ళ వూరు వెళ్లింది.

"అక్కా... ఏం చేస్తున్నా? ఇయ్యాల పని కిపోవటంలేదుగా, గవ్వలాట ఆడుకుం దామా? " అని ఎదురింటి రాజేశ్వరి వచ్చింది. అప్పుడు సుశీల పొయ్యి దగ్గిర వంటతో కుస్తీ పడుతోంది. వానకి తడిసి, పుల్లలు మండక, దట్టంగా వస్తున్న పొగతో గొట్టాం పెట్టి వూదుతూ సుశీల సతమత మౌతోంది.

సుబ్బమ్మ ఇంట్లో వుంది. పెద్దగా మాట్లా డవద్దని సుశీల ఆ అమ్మాయికి సైగ చేసింది.

ఎవరివో మాటలు వినబడటంతో సుబ్బమ్మ బయటకు వచ్చింది. రాజేశ్వరి ఎదురింటి విజయమ్మ కూతురు. ఆ అమ్మా యిని చూడటంతోనే సుబ్బమ్మ ముఖం మాడిపోయింది.

"ఏందమ్మా... ఏందో వూపుకుంటా వచ్చావు! నీకేం, ఇంటో మీ అమ్మ పని చేస్తంటే నువ్వు కులుక్కుంటా తిరుగుతావు! మాకెట్టా కుదిరిద్ది? "

"నువ్వు కూడా పని చేయకూడదంట అత్తా? " చనువుగా అంది ఆ అమ్మాయి.

"నేను గాకుండా ఇంటో ఎవురు చేస్తన్నా రేంది పని? ఆ పిల్ల పొయ్యికాడ కూసుంటే పని అంతా అయిద్దేంది? నువ్వు కాని య్యమ్మా... నువ్వు కానిచ్చి కూడు వండి గుడ్డలు వుతుక్కునిరా" అనిచెప్పి, ఆ అమ్మాయి మీద కోపంతో సుశీలని చిరా కుగా కసిరి పని పురమాయించింది.

"పొద్దుట్నించీ తుప్పర్లు పడతన్నయ్! గుడ్డలు వుతుక్కుని వస్తే ఆరతయ్యంట అత్తా? "

"ఆరినమట్టుకి ఆరతయ్యిలే!"

"ఏందే ఆరేదీ, ఆ మీద జల్లులు పడ తంటే!" అని అంకమ్మ విసుక్కుంది సుబ్బ మ్మని.

సన్నటి వానజల్లు పడుతోంది. ఆ వానకి ఆరోజు పొలంపనిలేద్దు.

వీళ్ళ ఇంటి ఎదురుగా విజయమ్మ అనే ఆమె వుంది. ఆమెకి ముగ్గురు పిల్లలు. చాలా మంచి మనిషి. ఆమె అంటే ఆ వీధిలో అందరూ ఇష్టంగా, స్నేహంగా వుంటారు. అందరి ఇళ్ళకీ వెళుతుంది. ఎవ రికి ఏ ఆపద, అవసరం వచ్చినా ముందు



వుంటుంది. ఎవరికి సహాయం అవసరం అయినా ఆలోచించకుండా, సంకోచించకుండా చేసి పెడుతుంది. ఆమె అంటే అందరూ గౌరవంగా వుంటారు.

ఎక్కువగా ఆమె పిల్లలూ, అప్పుడప్పుడూ ఆమె వీళ్ళ ఇంటికి వస్తుంటారు. అంతకు మించి వీళ్ళ ఇంటికి చుట్టుపక్కల ఇళ్ళ వాళ్ళు ఎవరూ రారు. వీళ్ళకి అందరితో పగే! అందరితో తగాదే!

విజయమ్మ పిల్లలు సుశీల అంటే ఇష్టంగా వుంటారు. 'అక్కా అక్కా' అంటూ వాళ్ళు సుశీలని విడిచిపెట్టరు.

సుశీల ఆ పిల్లలతో హాస్యంగా, సరదాగా వుంటుంది. ఎప్పుడైనా వాన కురిసో, పని లేకో కొంచెం ఖాళీ దొరికితే ఆ పిల్లలతో కలసి సుశీల గవ్వలాట, గన్నీలాట ఆడుకుంటుంది.

ఆ ఆటల్లో ఎప్పుడూ విజయం సుశీలదే!

విజయమ్మ కూతురు రాజేశ్వరి ఆ వూరి హైస్కూల్లో పదో తరగతి చదువుతోంది. ఆ అమ్మాయి చదువులో బాగుంటుంది. మంచి మార్కులు వస్తుంటాయి.

తరగతిలో ఎక్కువ మార్కులు వచ్చే ఇద్దరు ముగ్గురు విద్యార్థుల్లో రాజేశ్వరి కూడా వుంది. కొన్నిసార్లు క్లాసులో ఫస్టు ర్యాంకు కూడా రాజేశ్వరికి వస్తూ వుంటుంది.

అలాంటి రాజేశ్వరికి సుశీలని ఆటలో ఒక్కసారైనా ఓడించాలని పట్టుదల. అయితే ఎంత ప్రయత్నిస్తున్నా సాధ్యం కావడంలేదు. చురుకుగా వుండే సుశీల నవ్వుతూనే ఆటలో అవలీలగా నెగ్గేది.

రాజేశ్వరి ఆమె తమ్ముళ్ళు ఇద్దరూ సుశీలతో ఆప్యాయంగా స్నేహంగా వుండటాన్ని సుబ్బమ్మా, కాంతమ్మా కుళ్ళుబోతుతనంతో సహించలేకపోతున్నారు.

సుశీల వాళ్ళ ఇంటికి పోవడం, వాళ్ళు వీళ్ళ ఇంటికి రావడం ఆ ఇద్దరికీ ఇబ్బందిగా వుంది.

ఆ పిల్లలు ఇంటికి వస్తే చిటచిటలాడుతున్నారు. అయితే ఆ పిల్లలు లెక్క చేయడం లేదు.

విజయమ్మ కూడా అప్పుడప్పుడూ వీళ్ల ఇంటికి వచ్చి అత్తల్ని పలకరించి, కోడలు సుశీలతో ఏవో కబుర్లు చెప్పి వెళ్ళిపోయేది.

సుశీల రాకముందు సుబ్బమ్మా, కాంతమ్మా ఎక్కువగా విజయమ్మ వాళ్ళ ఇంట్లోనే వుండేవాళ్ళు. ఇంటి దగ్గర కంచంలో అన్నం పెట్టుకుని, వాళ్ళ ఇంటికి తీసుకుపోయి అక్కడ కూర్చుని తిని వచ్చేవాళ్ళు.

ఇంట్లో మగదిక్కు లేకపోవడంతో విజయమ్మ భర్తతో తాళ్ళు వేయించుకోవడం, అలాగే ఏవైన అవసరమైన చిన్నచిన్న పనులూ చేయించుకునేవాళ్ళు.

సుశీల వచ్చిన తరువాతనే చిక్కు వచ్చింది. సుశీలతో కూడా స్నేహంగా వుండటంతో విజయమ్మమీద అకారణ ద్వేషం పెంచుకున్నారు.

విజయమ్మతోనూ, ఆమె పిల్లలతోనూ సుశీలని మాట్లాడకుండా చేయాలని సుబ్బమ్మా, కాంతమ్మా అనుకున్నారు.

"తాజెడ్డ కోతి వనమంతా చెరిచిందని ఆ పిల్లలతో నీకేం ఆటలు సుశీలా... వాళ్ళకేం పనాపాటా? ఆ పిల్లలతో మనకి ఎక్కడ కుదిరిద్ది? వాళ్ళకేం వున్న మారాజులు! మూడెకరాల పొలం వుందీ, మూడు గొడ్లు వున్నయ్యా! ఆ విజయమ్మ మొగుడికి పని తపన తప్ప ఇంకొకటి వుండదు! వాళ్ళతో మనకి ఎక్కడ తూగిద్దీ, వాళ్ళతో ఏం ఆటలూ? " అని సుబ్బమ్మ సుశీలతో అంది.

అయినా సుశీల ఆమె మాటల్ని పట్టించుకోలేదు. వాళ్ళతో మాట్లాడటం మానుకోలేదు.. వాళ్ళ ఇంటికి వెళ్తున్నదీ, వాళ్ళు వీళ్ళ




ఇంటికి వస్తున్నారు.

ఒకరోజు విజయమ్మా, సుశీలా మాట్లాడు కుంటూ నవ్వుకోవడం కాంతమ్మ కంటప డింది. తమ గురించే చెప్పుకుని నవ్వుకుం టున్నారని భావించింది.

"యవారం చాలా ముదిరింది కత అప్పో! ఈ పిల్లని వాళ్ళింటికి పోవద్దంటే పోతంది ఎందుకూ? ఆ విజయమ్మ మనిషి కూడా మంచిది కాదు. ఉత్తపుండాకోరుది. ఈ పిల్లకి వున్నయ్యీ, లేనియ్యీ కల్పించి చెప్పి ఏయ్యో పుర్రులు పెట్టిద్ది! ఎందుకు వాళ్ళింటికి పోవటం? " సుబ్బమ్మతో అంది కాంతమ్మ.

"నేను చెప్పానే పోవద్దనీ! నా మాటని చెవిలోనికి దూరనియ్యలా, దూరనిస్తే ఎందుకు పోయిద్ది? ఇట్టయితే బాగానే వుండిద్ది" అంది సుబ్బమ్మ.

అంతలో సుశీల వచ్చింది.

"ఎందుకమ్మాయి వాళ్ళింటికి పోయింది నువ్వూ? పోవద్దని మొన్న చెప్పలా? ఎన్ని సార్లు చెప్పాలి? ఏందీ వాళ్ళతో మనకి చుట్టరికం? "

సుశీల మౌనంగా వుంది.

"ఏందీ వాళ్ళతో నీకు యికయికలూ, పక పకలూ? వాళ్ళింటికి పోవాకు ఇంక! నీకేం పని వాళ్లింటికి పోటానికి? ఇంకోసారి వాళ్ళింటికి పోయావంటే వూరుకునేదిలేదు, ఏమనుకున్నావో, ఇదే చెప్పడం? " అంది కాంతమ్మ.

ఇద్దరూ కలిసి గట్టిగా చెప్పడంతో సుశీల వాళ్ళ ఇంటికి వెళ్ళడం మానుకున్నది. అయితే వాళ్ళు వీళ్ళ ఇంటికి వస్తూనే వున్నారు.

ఇక లాభంలేదని అప్పచెల్లెళ్ళిద్దరూ తమ ఇంటికి రావద్దని విజయమ్మతో తగాదా వేసుకున్నారు.

"నేను మీ ఇంటికి వస్తే మీ సొమ్మేం కావాలన్నానా, మిమ్మల్ని పెట్టి పోయమ న్నానా? నాకు గతిలేక మీ ఇంటికి వస్తన్నా ననుకున్నారా? ఇక నేను మీ ఇంటికి రానూ, మీరు మా ఇంటికి రావాకండీ! మీ మాత్రం మాకు జరగదేంది? "

"మీ ఇంటికి మేం ఎప్పుడొస్తన్నాం అసలు? " అంది సుబ్బమ్మ.

"ఒసి నంగనాసి తుంగబుర్రల్లారా... ఇంతకుముందు ఎప్పుడూ మా ఇంట్లోనే కదంటే మీరు వుందీ! నిన్నా, ఇయ్యాలా రానంతమాత్రాన మా ఇల్లు ఎరగరేంది? "

"ఇంతకుముందు వస్తే వచ్చాంలే! ఇది మొదులు నువ్వూ, నీ పిల్లలూ మా ఇంటికి రావాకండీ, మేం మీ ఇంటికి రాం" అంది కాంతమ్మ.

"ఉత్తపుణ్యానికి మీరు ఎందుకు ఇట్ట మాట్టాడతన్నారో నాకు తెలియదనుకోవా కండి! మీ బతుకులు చెడి... లోకులు కన్న బిడ్డ మీ పాలబడిందని ఆ పిల్లతో అడ్డమైన చాకిరీ చేయిస్తున్నారు! నేను ఆ పిల్లకి ఏందో చెపతాననేగా ఈ తగాదా? ఆ పిల్లని ఏడిపిస్తే దాని వుసురు తగిలి పురుగులు పడిపోతారు" అని సుశీల పెద్దత్తలు ఇద్దర్నీ తిట్టి విజయమ్మ ఇంటికి వచ్చింది.

ఆ వీధిలో ఇక వాళ్ళతో పలికేవాళ్ళు ఎవరూ లేకుండాపోయారు. ఆ వీధిలో వాళ్ళు దాదాపు ఎవరూ వీళ్ళతో మాట్లా డరూ, వీళ్ళవైపు చూడరూ!

★ ★ ★

ఇటీవల సుబ్బమ్మ కూలికి వెళ్ళడం పూర్తిగా మానుకుంది. "ఏం సుబ్బమ్మా... మీ అమ్మ పోయిన తరవాత బాగా సుకప డమరిగావు! పనికి పోవటం మానుకున్నా వుగా? " అని ఎవరైనా దారినపోయే దానయ్యా అడిగితే సుబ్బమ్మ పెద్దగా ఏడు స్తుంది.

"మా అమ్మ నన్ను అన్నేయం చేసిపో

యింది బాబో! నేను మాత్రం బతికి ఇంక ఏం ఉపయోగం నాయనా! ఆమెతోనే నన్ను కూడా తీసకపోతే ఎంత బావుండేది దేవుడా! ఆ మాయదారి దేవుడు నన్ను వదిలిపెట్టి మా అమ్మను తీసకపోయాడు నాయనా!" అని కొద్దిసేపు రాగయుక్తంగా విలపిస్తుంది.

"ఏంచెప్పేదిరా దానయ్యా... మా అమ్మ పోయిన తరవాత ఆమె దిగులుతోనే చిక్కి సగమయ్యాను. కూడు తినబుద్ధి కావటం లేదూ, నీళ్లు పోసుకోబుద్ధి కావటంలేదూ! ఇంక నేను పనికిపోయినా వాళ్ళ చేలల్లో కూసుని ఏడవడం తప్ప ఏంపని చేస్తాను? మనుషులే పోయిన తరవాత ఇంక డబ్బు ఎందుకూ, కూలిచేసి ఎవురిని బతికించాలి?'' అని కొద్దిసేపు విలపిస్తుంది.

"మీ అమ్మ వున్నంతకాలం తొందరగా చావ్వే అని ఆ ముసిల్ది చచ్చిందాకా నిద్ర పోలా! అది చచ్చింతరవాత ఎంత బెమ పుట్టుకొచ్చిందే మీకు! పా...పం!" అని ఆ తుంటరి దానయ్య జాలిపడుతూ పొరపాటు అన్నాడనుకోండి.

"మా అమ్మని మేం ఎప్పుడు చావమని తిట్టాంరా? నువ్వు విన్నావంట్రా ముదనష్ట పోడా... మమ్మల్ని ఆడిపోసుకోవడానికి నీకేం మాయరోగంరా? మేం కాకపోతే మా అమ్మని ఏనాసవితి చూసిందీ? " అని సుబ్బమ్మ పరోక్షంగా సుశీలని తిట్టడంతో పాటు, ఆ దానయ్య పరిగెత్తి పారిపోయేవ రకూ వాడిని భయంకరంగా తిట్టి వదిలిపె డుతుంది.

మొత్తానికి సుబ్బమ్మ పనికి వెళ్ళడం దాదాపుగా మానుకుంది.

సింగయ్య కూడా అంతే అయ్యాడు. ఒక రోజు బేరానికి వెళితే వారంరోజులు వెళ్ళ డంలేదు. ఇంట్లో అందరూ గొడవ చేసిన రోజున వెళతాడు. అదేమంటే పెద్దమ్మా పిన్నమ్మలకి ఎదురుతిరుగుతున్నాడు. బుకా యిస్తున్నాడు. మాట మాట్లాడితే వాళ్ళని కొట్టబోతున్నాడు.

బేరానికి వెళ్ళినా, ఆ బేరంలో నాలుగు రూపాయలు వస్తే ఇంట్లో ఇచ్చినరోజు ఇస్తాడు. లేనిరోజు పేకాటలో పెడతాడు.

ఇక కాంతమ్మ ఎప్పుడూ కూలికి వెళ్లే మనిషి కాదు. ఆమెకి గేదెతోనే పని సరిపో తుంది. దానిని తిప్పాలి. మేపాలి.

ఆ గేదె ఇప్పుడు పాలు ఇవ్వడంలేదు. అది పాలు ఇచ్చే రోజుల్లో కాంతమ్మ ఇంట్లో ఖర్చులకి డబ్బు ఇచ్చేది. ఇప్పుడు కాంతమ్మ కూడా ఇంట్లో కాణీ ఇవ్వడం లేదు.

సుశీలా, అంకమ్మా మిగిలారు. వాళ్లు ఇద్దరూ ప్రతిరోజూ కూలిపనికి వెళుతు న్నారు. వాళ్లు పనికి వెళితేనే కుటుంబం జరుగుతోంది. ఇద్దరు పనిచేయడం, ఐదు గురు తినడం!

సుశీల నెలల మనిషి. పైగా చాలా బల హీనురాలు! చిన్న వయస్సు, అయినా పనికి వెళ్ళకతప్పదు.

సరైన ఆహారం కూడా లేకుండా రోజూ పనికిపోతుండటంతో సుశీల పాలిపో యింది. కళ్లు తెల్లగా వచ్చాయి. కాళ్ళకి నీరు వచ్చి వాపు వచ్చింది. పొలంపనికి తోడు ఇంట్లో పని కూడా ఎక్కువైంది.

సుశీలకి జలుబుచేసి, వళ్ళంతా నొప్పు లుగా, బడలికగా, జ్వరం వచ్చినట్లుగా వుంది.

అంతకుముందు నాలుగురోజులనించీ రోజూ కలుపుకి పొలం పోతున్నారు. పొలా నికి వెళ్ళి వీళ్లు పనిలో వంగిన తరువాత జల్లులు పడుతున్నాయి. ఆ జల్లులకి తడచి పోయి ఇంటికి వస్తున్నారు.

పనికి పనీ దండుగా, రోజూ తడచిపోయి రావడం!

అలా వరుసగా నాలుగురోజులు రోజూ

వానకి తడచిపోవటంతో సుశీలకి జలుబు చేసి తేలికగా జ్వరం వచ్చింది.

పనికి వెళ్ళకుండా ఆరోజు ఇంటి దగ్గర వుండామనుకున్నది.

"వళ్లంతా పులకరించి బాగులేదు. జొరం వచ్చినట్టుగా వుంది. ఇయ్యాల ఒక్కరోజుకి ఇంటి దగ్గర వుంటే బాగుండు అనిపిస్తుంది అత్తా! మళ్ళీ చేలోకిపోయి మూలబడితే ఇబ్బంది అయిద్ది. ఒకటే తలకాయ నొప్పి" అంది సుశీల అంకమ్మతో.

వరండాలో వున్న సుబ్బమ్మ ఆ మాటలు విని అన్నది. "రోగం అనుకుంటే రోగం, లేదనుకుంటే లేదు. కడుపునిండా కూడు తిని పొలంపో, రోగం ఎందుకు తగ్గదో చూస్తా! పొలంపోయి నలుగురిలో పనిచేస్తుంటే రోగం అదే తగ్గిపోయిద్ది"

"పని చేస్తుంటే రోగం ఎట్ట తగ్గిద్దే, యిద్దూరం గాకపోతే" అంది అంకమ్మ కొంచెం కోపంగా.

"ఎందుకు తగ్గదు? రోగం అని చెప్పి మంచం ఎక్కి ముసుగు పెడితే అది ముదిరిద్ది కానీ తగ్గదు. ఉశారుగా వుండి పని చేసుకుంటే ఏ రోగమూ రాదు. రొప్పూ రాదు"

"నీ ఇష్టం సుశీలా! పనికి వస్తేరా, లేకపోతే లేదు. బాగులేదనుకుంటే ఇంటి దగ్గరే వుండు, ఒకరోజుకి ఏం పోయింది? " అంకమ్మ అన్నది.

"నాలుగు రోజులనించీ కూలి లేదుగా" నసిగింది సుబ్బమ్మ.

"రోజూ మేం చేలోకి పోయిన తరవాత వాన పడతంటే మమ్మల్నేం చేయమంటావే? వానపడితే మాకేం, మా కూలి మాకు ఇయ్యండి అని రైతుల్ని అడగమంటావేంది? "

"ఇల్లు జరగొద్దంటే? "

"అదే జరిగిద్దిలే!"

"పెద్దత్త అన్నట్టు నాలుగురోజులనించీ రూపాయ రాకపోయా! ఒకరికి ఐద్దుగురిమి వుంటిమి ఇంట్లో! ఏ పూటకాపూట ఎసుట్టోకి ఎతుకులాడుకోవాల్సి వస్తందే! నేను కూడా పనికి రాకపోతే, నువ్వొక్కదానివే చేస్తే ఇల్లు ఎందాక జరిగిద్ది? జలుబు చేసి వళ్ళంతా బారంగా, ఒకటే తలనొప్పిగా వుంది, సరే పొలంపోతే అదే పోయిద్దిలే" అని సుశీల మళ్ళీ మనసు మార్చుకుని అంకమ్మతో పాటు కదిలింది.

"వద్దులే సుశీలా... ఇయ్యాల్టికి రాకపోతే ఏం పోయిందిలే! ఉండు. రోజూ పోవటం, వానకి తడిసి రావటమేగా! ఉండరాదూ ఇయ్యాల్టికి ఇంటికాడ! మజ్జాన్నానికి మళ్ళీ వాన వచ్చిద్ది" అంది అంకమ్మ.

"ఇయ్యాల వాన వచ్చేటట్టు లేదులే. ఎండ కాస్తందిగా" అని సుశీల ఆమెతోపాటు వెళ్లింది.

అంతకుముందు నాలుగు రోజులుగా ముసురు పట్టి ఒక మాదిరి జల్లులు పడుతున్నాయి. ఆరోజు ఎండ కనపడింది.

మధ్యాహ్నానికి ఎండ తీక్షణమై నిప్పులు చెరిగింది. ఆ ఎండ ధాటికి వాన వస్తుందనుకున్నారు వాళ్లు.

వాళ్లు అలా అనుకుంటుండగనే అప్పటికప్పుడే మేఘాలు కమ్మాయి. వాన మొదలైంది.

కుంభవృష్టి!

వీళ్లు వెళ్ళిన పొలం రెండుమైళ్లు వుంటుంది.

చటచటా వానకి ముఖం పగిలిపోతోంది. ఆ వానలోనే తడుస్తూ ఇంటిదారి పట్టారు.

వాగులూ, వంకలూ, కాలువలూ వీళ్ళ కళ్లముందే పొంగి పొరలుతున్నాయి.

"అమ్మా..." అని సుశీల అరచింది.

ముందు నడుస్తున్న అంకమ్మ వెనక్కి తిరిగి ఆగి ఆందోళనగా అడిగింది. "ఏమైంది సుశీలా, ఏమైందమ్మాయి? "

"ముల్లు అత్తా... కాల్లో ముల్లు దిగబడింది!" అంది బాధగా, నొప్పిని భరించలేకా, తడిసిపోయి చలికి వణికిపోతూ.

"వుండు వస్తున్నా!" అని అంకమ్మ సుశీల దగ్గరకి వెళ్ళింది. ఆమెని ఆసరాగా పట్టుకుని ఒంటికాలిమీద నిలబడి కాల్లో గుచ్చుకున్న ముల్లుని లాక్కుంది సుశీల.

తడిసి, నీళ్లలో వస్తూండటంతో మెత్తగా నానిన పాదంలో బాగా లోతుగా ముల్లు దిగింది.

"ఇయ్యాల పనికి వద్దంటే అనవసరంగా వస్తివి" అని అంకమ్మ విచారంగా అంది.

సుశీల మంచి కాలులోనే ముల్లు గుచ్చుకుంది. రెండో కాలితో ఎలాగో కుంటుకుంటూ, భారంగా నడుస్తూ వానకి తడుస్తూ అతికష్టంమీద ఇంటికి చేరుకుంది సుశీల.

మరుసటిరోజు సుశీల మంచం మీద నుంచి లేవలేకపోయింది. విపరీతమైన జ్వరం వచ్చింది.

జ్వరంతో సుశీల మంచంమీద పడుకుని బాధపడుతుంటే, ఆమెని పట్టించుకున్న వాళ్ళు లేరు. పెద్ద అత్తలు ఇద్దరూ "ఎలా వుంది? " అని సుశీలని అడగలేదు.

మొదటిరోజు సుశీల ఉదయంనించీ సాయంత్రంవరకూ మంచంమీద పడుకుని మూలుగుతూనే వుంది.

రెండవరోజు జ్వరం దానంతట అది తగ్గేలా లేదని అంకమ్మ వెళ్ళి ఆ వూళ్లో వున్న చిన్నపాటి వైద్యుడ్ని పిలుచుకువచ్చింది.

"నూటనాలుగు డిగ్రీల జ్వరం వుందమ్మా! మందులు బాగా వాడాలి!" అని ఆయన మందులు రాసి ఇచ్చాడు.

అంకమ్మ వెళ్ళి ఆ మందులు కొనుక్కువచ్చింది. 20 రూపాయలు అయ్యాయి.

అంకమ్మ ఉదయంపూట రెండు ఇడ్లీ, టీ నీళ్లు కొనుక్కుని తెచ్చి ఇచ్చి కూలికిపోతుంది. సాయంత్రం మళ్లీ ఆమె కూలినించి తిరిగి వచ్చేవరకూ సుశీలకి 'నా' అనేవాళ్లు లేకుండాపోయారు.

వైద్యుడు రాసి ఇచ్చిన మందులు వాడితే అవి ఏమీ పనిచేయలేదు. మందుల దారి మందులదే, రోగం దారి రోగందే.

తరువాత రోజు మళ్ళీ ఇరవై రూపాయలకీ, మూడవ రోజు ముప్పయి రూపాయలకీ మందులు రాశాడు. మొదటి రెండు రోజులూ మందులు తెచ్చిన అంకమ్మ మూడవరోజున రాసిన మందుల్లో సగమే కొనుక్కువచ్చింది.

"రాసిన మందులు మొత్తం వాడకపోతే వచ్చినరోగం ఎట్ట తగ్గిద్ది అంకమ్మా? " ఇంజెక్షను చేస్తూ అడిగాడు వైద్యుడు.

"చేతిలో డబ్బులు లేవు పంతులా, ఏం చేయమంటా? " అంది అంకమ్మ.

మూడు రోజులుగా ఉదయంపూటా, సాయంత్రం పూటా ఇంటికి వచ్చి చూసిపోతున్న వైద్యుడికి సుశీల తన దగ్గిర దాచిపెట్టుకున్న డబ్బులు 10 రూపాయలు ఇచ్చింది.

తన వైద్యానికి అంత తక్కువ వెల కట్టి ఇస్తున్నందుకు ఆ వైద్యుడు ఐదుపైసలు తీసుకున్నంత అసంతృప్తిగా పెదవి విరుస్తూ ఆ డబ్బు పుచ్చుకున్నాడు. అంతే, తరువాత రోజు అతను పత్తాలేడు.

అంకమ్మ అతని కోసం నాలుగుసార్లు తిరిగింది. "నేను వస్తాలే. నువ్వు పద!" అని అంకమ్మతో అన్నాడు కానీ అతను రాలేదు.




సింగయ్య వస్తాడు. అన్నం తనే వేసుకుని తినిపోతాడు. "ఎలా వుంది? వైద్యుడ్ని పిల్చుకు వచ్చేదా? తినడానికి ఏమైనా తెచ్చి పెట్టేదా? " అని సుశీలని ఒక్కసారి కూడా అడగలేదు.

"తగ్గిందా? అదేం చేసిద్దిలెద్దూ. రేపుటికి తగ్గిద్దిలే. వానకి తడిస్తే వచ్చిన రోగంకదా, అదేం కాదులే" అన్నాడు ఒకసారి.

"ఏమయిద్ది, ఏంకాదులే! అంతగా అయితే నా పేణం తీసకపోయిద్ది. అంతేగా పోతే పోయిందిలే ఎదవపేణం! ఈ ఇంటో నేను అందరికీ అడ్డంగా వుండా! ఎప్పుడెప్పుడు నేను చస్తానా అని ఎదురు చూస్తున్నారు, నేను పోతేగానీ వాళ్ళ కళ్లు చల్లబడవు" అంది సుశీల.

"ఏందే నువ్వు వాగేది? నువ్వు చావాలని ఎవురు అన్నారు? చాలా వుందే నీ దగ్గిర"

"ఆ... నా దగ్గిర చాలా వుంది"

"వానకి తడిసి వచ్చినదానివి తల తుడుచుకుని ఆరపెట్టుకుంటే ఎందుకు రోగం వచ్చిద్దీ? కావాలని రోగం తెచ్చుకునే వాటిని ఎవురేం చేస్తారు? "

"నన్ను బాగా చూసుకునే వాళ్లున్నారని నేను కావాలని తెచ్చుకున్నా రోగం! నాకు ఇంకేం పనుందీ? "

"నీ... నీతోటి మాట్టాడ్డం అనవసరం. మాటాడితే తగాదాకి వచ్చేవాటితో మాట్టాడి ఏంలాభం? "

సింగయ్య పలకరింపు అలా తగాదా అంకంతో ముగిసింది.

తరువాత ఒకరోజు జేబులో ఐదు రూపాయలు వుంటే అవి తీసి సుశీలకి ఇవ్వబోయాడు. "ఇవిగో, ఈ డబ్బులు తీసుకో... వారం రోజుల్నించీ అన్నం లేకుండా లంకణాలు వుంటివి. కడుపులోకి ఏం లేకపోతే ఎట్టా? ఊళ్ళోకి నానురొట్లు అమ్ముమవస్తే అవి కొనుక్కుని తినూ" అన్నాడు.

"నాకు నానురొట్లు వద్దూ, ఏం రొట్లు వద్దులే"

ఈ ఐదురూపాయలు వుంచుకుని అరటి కాయలన్నా తెప్పించుకుని తినవే!

"నాకు వద్దులే, నీ దగ్గిరే వుంచు ఐదురూపాయలు. నీకు పేకాటలోకన్నా అక్కరకొస్తయ్యి"

"సరే నీ కర్మ. అట్నే మురిగిచావు. నువ్వు చస్తానంటే ఎవురదేం పోయింది? అరటికాయలో, నాను రొట్టెలో కొనుక్కుని తినవే అని నీ మంచి కోసమే చెపతంటే యినకపోతే యట్టా? మనిషికి అంత పెడద్ధరం పనికిరాదు!" అని రెండు తిట్లు తిట్టి బజారుకి వెళ్ళిపోయాడు.

తన దుస్థితికీ, దైన్యస్థితికీ సుశీలకి ఏడుపు వచ్చింది. తనలో తనే కుమిలికుమిలి ఏడ్చింది.

అయినా "అయ్యో పాపం" అనేవాళ్లు లేరు.

జ్వరంతో మూసిన కన్ను తెరవకుండా బాధపడుతున్న సుశీలని ఇంట్లోవాళ్లూ, బయటివాళ్లూ ఎవరూ పలకరించేవాళ్లు లేరు.

నెలల మనిషి. ఆహారం లేదు. జ్వరం, బాగా నీరసించిపోయింది సుశీల. కనీసం మంచంమీద కూడా కూర్చోలేకపోతున్నది.

విజయమ్మ వాళ్ళ దొడ్లో రెండు కొబ్బరి చెట్లు వున్నాయి. అంతకుముందురోజే అమ్మడానికి చెట్లమీదనించి కొబ్బరి బోండాలు కోయించింది ఆమె.

సుబ్బమ్మ, కాంతమ్మ ఇంట్లోలేని సమయంలో రెండు బొండాలు పగులకొట్టి పెద్ద గ్లాసు కొబ్బరినీళ్లు సుశీలని తాగమని పిల్లలతో పంపించింది.

ఒకవైపు జ్వరంతో సుశీల బాధపడుతుంటే ఇంట్లోపని కావడం లేదని సుబ్బమ్మ

నసుగుతుందేకానీ ఆమె ఆరోగ్యం విషయం మాత్రం పట్టించుకోలేదు.

"అసలు పనిచేయకుండా తప్పించుకోవటానికి తెచ్చుకున్న రోగమాయె! లేకపోతే ఏందే, వానకి ముద్దముద్దగా తడిసిపోయి నోళ్లు తల తుడుచుకుని ఆరపెట్టుకోరంటే" అంది ఒకసారి.

"ఏం జ్వరంలే! నాలుగు రోజులు పచ్చి మంచినీళ్లు కూడా ముట్టుకోకుండా నిండు లంఖణాలు చేస్తే, ఆ జొరం ఏందీ దాని తాతలాంటి జొరం కూడా దెబ్బకి తగ్గిపోద్ది!" అంది ఇంకోసారి.

"అదికాదే, మేం లేనప్పుడు కుండలో కూడుకానీ ఏసుకుని తింటన్నావేంది, ఇన్ని రోజులు రోగం తగ్గకుండా వుండటానికి! నువ్వు నిజంగా లంఖణాలు చేస్తే రోగం ఎందుకు తగ్గదే? " అంది ఇంకోసారి.

ఆమె ఏం మాట్లాడుతున్నా సుశీల ఏమీ జవాబు చెప్పదు. మంచంలో పడుకుని మూలగడం మినహాయించి మరోమాట, శబ్దం సుశీల నోటినించి రాదు. వాళ్లమాటలకి బాధ, విచారం, కోపం కలుగుతుంటాయి. అయినా వెల్లడిచేయదు.

మొత్తానికి లంఖణాల ప్రభావమో, మరేమి ప్రభావమో కానీ సుశీలని 10 రోజులు భయంకరంగా బాధపెట్టిన జ్వరం చివరికి దాని అంతట అదే క్రమంగా తగ్గింది.

సుశీల మాత్రం ఎముకలపోగు అయింది.

అసలే అవతారం. ఆ అవతారాన్ని పది రోజులు జ్వరం పట్టి వదలకపోవడంతో గాలికొడితే ఎగిరిపోయే వగుడాకులా తయారైంది.

పిడికెడు అన్నమే తింటోంది. పట్టుమని పది నిముషాలు పనిచేయలేకపోతోంది. కొద్దిసేపు పనిచేసినా నీరసం, ఆయాసం, దడా, రొప్పు వస్తున్నాయి. మనిషి కొద్దిదూరం నడవలేకపోతుంది.

చిన్నచిన్నగా ఇంట్లో పని చేస్తుంది. ఉదయం పని అయిన తరువాత సుశీల ఇంటి బయట నిలబడివుంటే అదే దారిన పోతున్న మంత్రసాని సుశీలని చూసి ఆశ్చర్యపోయింది.

"ఇదేందమ్మాయి సుశీలా మరీ ఇట్టయిపోయావు? అన్నం తినటం లేదా ఏంది? ముఖం తెల్లగా పాలిపోయింది. అసలు వంటో నెత్తురేది? బాగుంటం లేదెట్టా? "

"మొన్న పది రోజులు లంఖణాలు!"

"అయ్యో నాకు తెలియనే తెలియదే! ఎంత తగ్గిపోయావు అమ్మాయి! కళ్లు తెల్లగా వచ్చినయ్యి, కాళ్లకి నీరు వచ్చి వాపు వచ్చినయ్యి! ఇట్టయితే దెబ్బ అమ్మాయి! తొలి కాన్పు! ఎంత జేగర్తగానో వుండాలి!"

"నిజమే రోగం వస్తే ఏం చేయమంటా?"

"నువ్వు సరిగా తిండితిని, మందులు వాడుకోకపోతే కాన్పు కావటం కష్టం! తరువాత ఎవరం బాధపడ్డా ఏం లాభం వుండదు! నువ్వు అశ్రద్ధ చేస్తే మొదటికే మోసం వచ్చిద్ది! ఇప్పుడు నువ్వు సరిగా తిండితింటా, మంచి మందులు వాడితే తల్లీ, బిడ్డా ఇద్దరికీ బాధ వుండదు! లేకపోతే రేపు నీతోపాటు నీ బిడ్డా బాధపడాలి!" అని బాధపడుతూ మంచి తిండి తినమని హితబోధ చేసింది ఆ మంత్రసాని.

ఆమె మాటలకి సుశీల నీరసంగా నవ్వి వూరుకుంది. తనేం చేయగలదు? తన వలన ఏం అవుతుంది?

తల్లిదండ్రులు వున్నా వాళ్లు తనని గురించి పట్టించుకోవడమే తక్కువ! కొడుకు మీద వాళ్లకి వున్న ప్రేమలో కనీసం పదో వంతు తన మీద వున్నా తన పరిస్థితి ఇంతకంటే బావుండేదేమో!

నిజానికి తల్లిదండ్రులకి తన మీద ఏమీ




ప్రేమలేదు. ఒకవేళ కొంచెం వున్నా వాళ్ల పరిస్థితీ అంతంత మాత్రం! పైకి వెల్లడించకపోయినా తను వాళ్లకి బరువుగానే భావిస్తారు.

ఇక అత్త ఇంటి పరిస్థితి గురించి చెప్పుకునేది ఏముంది? ఇంట్లో ఒక మనిషి ఒక గర్భిణీస్త్రీ వున్నదనే స్పృహే వాళ్లకి లేదు. తనని కనీసం సాటిమనిషిగా కూడా గుర్తించిన పాపాన వాళ్లు ఏనాడూ పోలేదు.

తనకి మంచి తిండి, బలమైన తిండి పెట్టకపోతే పెట్టకపోయారు మామూలు తిండి, ఇంట్లో వండిన ఆ తిండి ఏదో తను తిన్నందుకు వాళ్లు ఏడవకుండా వుంటే అదే పదివేలు.

కానివ్వు ఎలా జరగాల్సి వుంటే అలా జరుగుతుంది. అంతకంటే తను చేయగలిగేది ఏముంది? అని తనకి తనే సమాధానపడింది సుశీల.

ఒకరోజు అంజమ్మ పుట్టింటికి వచ్చి సుశీల దగ్గరకి వచ్చింది.

"ఇదేందే సుశాయ్.. మరీ తగ్గిపోయావు. బాగుండటం లేదెట్టా? "

"పది రోజులు బాగా జ్వరం కాసింది అత్తా! వారం రోజులనాడే ఎంగిలిపడింది. జ్వరంకాసిన పది రోజులూ పచ్చి మంచి నీళ్లు కూడా ముట్టలేదు!"

"నాకు తెలియదే! మీ అమ్మా, అయ్యాకి కూడా తెలియదు. తెలిస్తే మీ అమ్మ నాతోటి అనకపోయిందీ? నాల్రోజుల్లో మీ అమ్మ వచ్చి నిన్ను కాన్పుకి పుట్టింటికి తీసుకువస్తానంది" చెప్పింది అంజమ్మ.

"తొందరగా రమ్మను అత్తా! జ్వరం తగ్గినా నాకేం బాగుంటంలేదు. కూడు తిన బుద్ధి కావటంలేదు, పనిచేయబుద్ధి కావటం లేదు!" అంది నీరసంగా సుశీల.



అంజమ్మ వాళ్లవూరు వెళ్లి చెప్పిన వెంటనే రాగమ్మ వచ్చి సుశీలని పుట్టింటికి తీసుకుపోయింది.

విశ్రాంతి తీసుకోవడం, కొంచెం మంచి ఆహారం దొరకడంతో సుశీల నెలరోజులకి మామూలు మనిషి అయింది.

నెలల మనిషే అయినా మళ్లీ కూలికి వెళ్లడం మొదలుపెట్టింది సుశీల.

"నువ్వు పనికి పోవద్దులే అమ్మాయి!" అంది రాగమ్మ మాట వరుసకి.

"రేపు కాన్పు అయిన తరువాత బిడ్డని పెట్టుకుని ఎట్టనుకున్నా ఇంటి దగ్గరే వుండాలిగా! ఈ నెల రోజులూ పనిచేస్తాలే!"

ఊరికి దగ్గరగా వున్న పొలాల్లో పనికీ, కూర్చుని చేసే పొగాకు గ్రేడింగ్‌కీ ఇంకా అలాంటి చిన్నచిన్న ఇతర పనులకీ వెళ్తుంది.

ఒకరోజు కూలికి వెళ్లి వచ్చిన సుశీలకి వేకువ జాము సమయంలో నొప్పులు మొదలయ్యాయి. నాసరయ్య వెళ్లి ఆ వూళ్లోవున్న నాటు మంత్రసానిని పిలుచుకువచ్చాడు.

"అమ్మా... అయ్యా... నాయనా... నొప్పులమ్మా... నేను చచ్చిపోతా దేవుడా... నేను ఈ నొప్పులు తట్టుకోలేను దేవుడో" అని సుశీల పెద్దగా, హృదయవిదారకంగా ఏడుస్తోంది.

"ఊరుకో అమ్మా... అట్ట అనకూడదు... కాన్పు అవతందిలే... నువ్వు అట్ట ఏడవకూడదు" అని రాగమ్మా, మంత్రసానీ చెరోవైపు సుశీలని సముదాయిస్తున్నారు.

నొప్పులతో బాధపడుతుంది కానీ కాన్పు కావడంలేదు. బాధతో మెలికలు తిరిగిపోతోంది. శరీరం అంతా చెమటలు కారిపోతున్నాయి. పళ్లు పటపటా కొరుకుతుంది.

తొలికాన్పు! లేత వయస్సు! బలహీనురాలు! కాన్పు ఎంతకీ కావటంలేదు! చుట్టు

పక్కల వాళ్లందరూ సుశీలని చూడటానికి వస్తున్నారు.

"కడుపులో బిడ్డ అడ్డం పడిందేమో! తొందరగా పట్నం తీసకపోతే బాగుండిద్ది!" అన్నారు ఒకరు.

"మంత్రసాని లాభంలేదు. పట్నం తీసు కుపోవటమే మంచిది! నొప్పులు ఆగిపోతే పెద్ద ప్రాణానికే ముప్పు!" అన్నారు మరొ కరు.

దాదాపు వచ్చిన వాళ్లందరూ సుశీలని పట్నం తొందరగా తీసుకుపొమ్మని చెప్పే వాళ్లే.

"ఏం చేద్దామయ్యా? " రాగమ్మ అడిగింది నాసరయ్యని.

"ఏమో నాకేం తెలుసే! నువ్వు ఏం చేద్దా మంటే అది చేద్దాం! తప్పనిసరయితే పట్నం తీసుకుపోదాం! నీ ఇష్టం!" అని భారం ఆమె మీద పెట్టాడు నాసరయ్య.

"పట్నం తీసుకపోతే చాలా కర్చయిద్ది! మనం తీసకపోయీ పోకముందే ఆపరే షను చేస్తారు. నెత్తురు కావాలంటారు! చాలా వదిలిస్తారు. మొన్న రమణమ్మ కూతుర్ని ఇట్నే తీసకపోతే ఆపరేషను చేసా రంట! వేలు కర్చయినయని చెప్పింది!"

"ఏం చేద్దామే మరి? "

"మన వూళ్లో వున్న కిట్టమూర్తిని పిలచ కరా! ఆయన ఈ మజ్జె చాలా కాన్పులు చేశాడు! ఆయన వచ్చి చూస్తే తెలిసిద్ది! ఆయన ఎట్టచెబితే అట్టి చేద్దాం!" అంది రాగమ్మ.

ఆమెకికానీ, నాసరయ్యకి కానీ సుశీలని పట్నం తీసుకుపోయి హాస్పిటల్‌లో చేరుద్దాం అనే ఆలోచనే రాలేదు. డబ్బులు ఖర్చవుతాయనే బాధ!

నాసరయ్య వెళ్లి ఆ వూళ్లో వున్న ఆర్ ఎంపీ వైద్యుడు కృష్ణమూర్తిని పిలుచుకువచ్చాడు. ఆయన సుశీలని చూశాడు.

"ఏం పర్లేదు నాసరయ్యా! నేను కాన్పు చేస్తా! పట్నం పోవాల్సిన పనిలేదు. ఎన్ని వందలు ఇస్తారు? "

"అందరి దగ్గరా ఎంత తీసుకుంటున్నా పంతులూ? " రాగమ్మ అడిగింది.

"పట్నం తీసకపోతే ఆపరేషను చేస్తారు. చాలా అయిద్ది కర్చు! నేను ఆపరేషను పని లేకుండా కాన్పు చేస్తా, ఇలాంటి కష్టమైన కేసుకి ఐదు వందలు తీసుకుంటున్నా!"

"పిల్ల ఆపదలో వుంది. మేం అంత ఇయ్యలేములే పంతులా! నాలుగు వందలు ఇస్తాంకానీ తొందరగా కాన్పు చెయ్యి. పిల్ల అల్లాడిపోతంది!" నాసరయ్య అన్నాడు.

సుశీలకి సెలైన్ సీసాలు కట్టారు.

34 గంటలపాటు నొప్పులతో, బాధతో హోరాహోరీగా పోరాడిన సుశీల చెప్పరాని వేదన పడి ప్రసవించింది.

ఆడపిల్ల పుట్టింది.

చిన్నారి పొన్నారి సుశీల తల్లి అయింది.

సుశీలే పసిది అయితే, ఆ పసిది మరో పసిగుడ్డుకి జన్మ ఇచ్చింది.

"పిల్ల చచ్చి బతికినంత పనయిందమ్మా! పెద్ద గండం గడిచింది తల్లీ! అదృష్టవంతు రాలివమ్మా నువ్వు!" అని చూడటానికి వచ్చిన వాళ్లు తేలిగ్గా, హాయిగా వూపిరి పీల్చుకున్నారు.

మృత్యువు అంచుల వరకూ వెళ్లిన సుశీల అతికష్టం మీద తప్పించుకుని బయటపడగ లిగింది.

మనదేశంలో ప్రతి ఏడాదీ ఐదు లక్షల మంది మైనారిటీ కూడా తీరని ఆడపిల్లలు గర్భవతులవుతున్నారు! ఇది యూనిసెఫ్ వారు చేసిన సర్వేలో తేలిన నిజం!

ప్రసవ సమయంలో మరణించే స్త్రీలలో 80 శాతం మంది 13-17 సంవత్సరాల మధ్య వయస్సు వాళ్లేనట.





నిజానికి పిల్లలు పెరిగేది 13-18 సంవత్స రాల మధ్యనే! ఆ పెరుగుతున్న దశలో వున్న పిల్లలు తల్లులు కావటం చాలా ప్రమాదకరం అని డాక్టర్లూ, శాస్త్రజ్ఞులూ పదే పదే హెచ్చరిస్తున్నారు.

18 సంవత్సరాల లోపు వయసులో గర్భం దాల్చే ఆడపిల్లల శారీరక ఎదుగుదల చాలా ప్రమాదంలో పడిపోతుంది. వారి ఎముకల నిర్మాణం, జననేంద్రియ వ్యవస్థా ఇంకా పూర్తిగా ఎదిగి వుండవు. గర్భంలో వున్న శిశువుల పోషకాలకన్నా వీరి ఎదుగుదలకే శరీరం ఎక్కువ డిమాండ్ చేస్తుందట! దీని వలన గర్భస్థ శిశువులతోపాటు పాలబుగ్గల పసితల్లికూడా తీవ్రమైన ప్రమాదాలను ఎదు ర్కోవలసి వస్తుంది.

ప్రసవం సక్రమంగా జరిగినా, శిశువు బతికి బట్టకట్టినా తల్లీబిడ్డా ఇద్దరూ భవిష్య త్‌లో భయంకరమైన శారీరక పరిణామా లకూ, తీవ్రమైన అనారోగ్యానికీ గురికావలసి వస్తుందని డాక్టర్లు చెపుతున్నారు.

బాల్య వివాహాలు జరుగుతున్నంతకాలం 'బుజ్జిపెళ్ళాలు- చిట్టి తల్లులూ' వుంటూనే ఉంటారు.

పసిప్రాయంలో తల్లులు అవుతున్నవారి సమస్యని పరిష్కరించాలంటే ఆ పసివారి వివాహాల్ని నిరోధించడమూ, నిషేధించడమే మార్గం!

బాలల వివాహాలు జరుగుతున్నంత కాలమూ ఆ బాలలే తల్లులూ, తండ్రులూ అవుతారు.

మృత్యువునించి సుశీల బయట పడగలి గినా అనారోగ్యం నించి బయటపడలేకపో యింది. శరీరంనించి విపరీతంగా రక్తంపో యింది. చివరికి నెల రోజులకి సుశీల ఒక రకంగా తిప్పుకోగలిగింది.

సుశీలకి ఆడపిల్ల పుట్టిందని చందలూరు సింగయ్యకీ, సుశీల అత్తలకీ కబురు చేశారు.

ఆడపిల్ల పుట్టిందనే విషయం వినడం తోనే సుబ్బమ్మా, ఆమె సోదరీమణులూ పెదవి విరిచారు. "ఆ పిల్లని అనుకుని ఏం లాభంలే! మనోడే దయిద్రుడు! శుభమా అని తొలికాన్పుకే ఆడపిల్ల పుట్టడం ఏందీ దయిద్రం కాకపోతే! అసలు ఆ పిల్లని చేసు కోవటమే చేటు! బంగారమసుంటి సమ్మం ధాలొచ్చినయి పిల్లని ఇస్తామని! చూస్తా చూస్తా పోయి గోతిలోపడ్డాం. వుసూరుము కంది మనకి పంపకం అయింది. దాని తల్లి మనకోసమే కనిందట్టుగా వుంది ఈ కుంటి దాన్ని!" అని సుబ్బమ్మ వారం రోజులు సణుగుతూనే వుంది.

ఆడపిల్ల పుట్టడం వాళ్ళకి ఏమీ సంతోషం కలిగించలేదు. ఆడపిల్లని కనడం తప్పు అయినట్లు నీచంగా తిడుతూ, మనసులో సుశీల మీద ఇంకా ద్వేషం, అసంతృప్తి పెంచుకున్నారు.

పిల్ల పుట్టిన 20 రోజులకి సింగయ్య వచ్చి చూసిపోయాడు. ఇలా చూసి అలా వెళ్లాడు. ఒకరోజు వుండమని సుశీల బతి మాలినా అతను పని వుందంటూ వుండ కుండా, కనీసం ఒక గంట అయినా సుశీ లతో మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

సుబ్బమ్మా, కాంతమ్మా, అంకమ్మా ఎవరూ కనీసం పుట్టిన పాపని కూడా చూడటానికి రాలేదు. అంకమ్మకి అయితే సుశీలనీ, పాపనీ చూద్దామని ఒకటీరెండు సార్లు అనిపించినా రాలేదూ, చూడలేదు!

పసిపాపకు ఐదో నెల వచ్చిన తరువాత, సుశీల పాపని తీసుకుని చీరాసారెతో భర్త వద్దకు, మెట్టినింటికి వచ్చింది.

సుశీలనీ, పాపనీ వదిలిపెట్టిపోవడానికి నాసరయ్య వచ్చాడు. ఆయనని పలకరించి నవాళ్లు లేరు. ఒక రోజు వుండి నాసరయ్య వెళ్ళిపోయాడు.

★ ★ ★

కాలగమనంలో నాలుగు సంవత్సరాలు

గడచిపోయాయి.

ఒక మనిషి జీవితంలో నాలుగేళ్లు అంటే తక్కువ సమయంకాదు. ఈ నాలుగు సంవత్సరాల కాలంలో సుశీల జీవితంలో ఎన్నో సంఘటనలూ, మార్పులూ జరిగాయి.

ఇప్పుడు సుశీల ఇద్దరు బిడ్డల తల్లి! మళ్లీ గర్భిణీ!

సుశీల పిల్లలుకనే ఒక యంత్రం మాదిరి అయింది!

కడుపులో బిడ్డ, చంకలో బిడ్డ, వేలు పట్టుకుని బిడ్డ! పాలు మరచిన బిడ్డ, పాలు తాగుతున్న బిడ్డ, మళ్లీ పాలకోసం ఎదురు చూసే బిడ్డ! ఏ యంత్రానికి అయినా ఇంధనమో, విద్యుత్తోకావాలి. అవి లేకపోతే ఆ యంత్రాలు పనిచేయవు.

సుశీల అనే యంత్రానికి ఇంధనం, విద్యుత్ అవసరంలేదు. అవి లేకుండానే పిల్లల్ని కన్నది ఇద్దరు ఆడపిల్లల్ని! మళ్లీ కనడానికి సిద్ధంగా వుంది.

నిజానికి సుశీలకి సరైన ఆహారంలేదు. ఆరోగ్యంలేదు. వైద్యంలేదు. ఆనందంలేదు. విశ్రాంతి లేదు! కనీసం ఇంట్లో ఆదరణ కూడాలేదు.

సుశీల పరిస్థితి గతంలో కంటే కూడా హీనంగా తయారైంది.

ఇంతకుముందు సుశీల ఒక్కతే భర్త కారణంగా, అత్తల కారణంగా అవస్థలు పడేది! ఇప్పుడు వాళ్ల కారణంగా సుశీల ఇద్దరు బిడ్డలు కూడా బాధలు పడాల్సి వస్తోంది.

సుశీల చిన్న అత్త అంకమ్మ కూడా ఇద్దరి అక్కలవైపు చేరింది. సుశీలనీ, ఆమె కూతుళ్లు పసి పాపలు ఇద్దర్నీ కూడా బాగా వేధిస్తున్నారు. అనుక్షణమూ మాటలతో చేతలతో హింసిస్తున్నారు.

ఇంతకుముందు కోపంవచ్చినప్పుడు, కోపం రానప్పుడు కూడా అకారణంగా సింగయ్య ఒక్కడే సుశీలని కొట్టేవాడు. ఇప్పుడు సింగయ్యకి తోడు అత్తలు కూడా సుశీలని కొడుతున్నారు.

ఏడాది క్రితం రెండవ పాప పుట్టిన కొద్ది రోజులకి వాళ్ల బాధలు భరించలేక సుశీల చచ్చిపోదామనుకుంది. ఆత్మహత్య చేసుకుందామని గట్టిగానే నిర్ణయించుకుంది.

అయితే అదేవీధిలో వుంటున్న విమల బిడ్డల్ని చూసి సుశీల ఆ ప్రయత్నం మానుకుంది.

విమల కొంచెం ఆస్తిపాస్తులు కలిగిన కుటుంబంలోని కోడలే! ముత్యాల్లాంటి ముగ్గురు బిడ్డలు!

ఆ పిల్లలకి రెండు పూటలా స్నానం చేయించేది! వాళ్లకి చక్కటి బట్టలు వేసేది! మంచి తిండిపెట్టేది! పువ్వులా వాడిపోకుండా వాళ్లని చూసుకుంది. అపురూపంగా సాక్కుంది.

అలాంటి మనిషి కుటుంబంలో గొడవల కారణంగా ఇంట్లో వున్న పురుగు మందు తాగి ఆత్మహత్య చేసుకుంది.

ఆమె పోయిన తరువాత పిల్లలు వాడిన పువ్వులయ్యారు! వాళ్ల ఆలనాపాలనా పట్టించుకునే వాళ్లేరు!

చింపిరి తలలతో; అపరిశుభ్రమైన బట్టలతో దీనంగా తయారయ్యారు. అయితే వాళ్లకి ఆస్తి వుంది.

తను చచ్చిపోతే తన బిడ్డల గురించి పట్టించుకునే వాళ్లు వుండరు! కనీసం తన బిడ్డలకి తింటానికి తిండి వుండదు!

తను పోయిన క్షణమే తన బిడ్డలు వీధులవెంట అడుక్కు తిని బతకాల్సిందే! అనాథలైపోవాల్సిందే!

ఆత్మహత్యకు మనసు పురిగొల్పుతున్నా విమల బిడ్డల్ని చూసి తన బిడ్డల భవితవ్యం తలుచుకుని సుశీల ఆ ప్రయత్నం మానుకుంది.

చావోరేవో పిల్లలతోనే తన జీవితం అను




కుంది. పిల్లలకోసం అయినా మొండిగా బతకాలనుకుంది.

భర్త కొడుతున్నా, అత్తలు తిడుతున్నా ఇంతకుముందు మాదిరిగా సుశీల మౌనంగా వుండటంలేదు. వాళ్లకి గట్టిగా ఎదురు తిరుగుతుంది. మాటకి మాట అంటుంది. వాళ్లు ఒకటి తిడితే తను రెండు తిడుతోంది. కొన్ని సందర్భాల్లో అందుకు అదనంగా దెబ్బలు తింటోంది.

★ ★ ★

సుశీల కూలికి వెళ్తుంది. సుబ్బమ్మ కూలికి వెళ్లకుండా ఇంటివద్దే వుంటుంది. అయినా పగటిపూట సుశీల పసిపాపలకి అన్నం కూడా పెట్టేదికాదు. ఆకలై వాళ్లే ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లి పడిపోయేవాళ్లు.

"అమ్మా.. ఇయ్యాలే నాయనమ్మ మాకు బువ్వపెట్టలా.. బువ్వపెట్టమని అడిగితే బువ్వలేదూ గివ్వలేదూ పొండవతలకి అని తిట్టిందే!" సుశీల నాలుగేళ్ల కూతురు, చేలో నించి వచ్చిన తల్లికి చెప్పింది.

ఆ మాటలు సుబ్బమ్మ విన్నది. "ఓసోసి ముండా.. యేలెడంత లేవు! అప్పుడే సాడీలు చెపతన్నావంటే సాడీలకోరు ముండా... నువ్వు అడిగితే నేను కూడెయ్య లేదంటే? " అంది కోపంగా.

"ఎప్పుడేసామ్మా? బువ్వలేదూ గివ్వలేదూ అన్లా నువ్వు!" అంది ఆ పాప ముద్దుముద్దుగా వచ్చీరాని మాటలతో.

"నేను వెయ్యకపోతే నీ అమ్మ వచ్చి వేసిందంటే నీ ముకాన కూడు! అందరికీ పెద్దయిన తరువాత పుడతయి అయితే వుండాకోరు బుద్ధులు నీకు ఇప్పుడే పుట్టినయ్యేమే ఈ దొంగ బుద్ధులు వుండాకోరుముండా!" అని సుబ్బమ్మ ఆ పాపని తిట్టడం మొదలు పెట్టింది.

"పసిపిల్ల! నోరూవాయీలేంది! దాన్ని ఎందుకు తిట్టేది? అది తిడితే తిట్టిద్దా, కొడితే కొట్టిద్దా? " అంది సుశీల.

"నేను ఏదో పనిలో వుండప్పుడు అది అడిగిందేమో కూడెయ్యమని! నేను ఆలకిచ్చ లేదేమో! తరువాతైనా అడిగి పెట్టిచ్చుకుని తినొచ్చుగా!"

"పిల్లలు... వాళ్లకి ఆకలేం తెలుసు? మనం పెడితేనే తినేది అంతంత మాత్రం!"

"దానికి ఆకలి తెలియదూ? ఇంకేం తెలుసుమరి? మూడు పూటలా మూడు కంచాలు తినిద్ది. అయితే దానికి ఆకలి తెలియదంట! ఆకలి తెలియక సాడీలు చెప్పటం అయితే తెలుసా బాగా? "

"అది ఏం సాడీలు చెప్పిందిలే? ఉన్న మాటే చెప్పిందా ఇంకేమన్నా చెప్పిందా? "

"ఉన్నమాటేందే గుడిసేటిదానా? నేను దానికి బువ్వ వెయ్యలేదంటే? ఉన్నమాటంటనే! ఇప్పుడ్నించే నేర్పు దానికి నీ బుద్ధులన్నీ! ఎక్కడికి పోతయ్యి అడక్కతినే బుద్ధులు!" అని ఆ పిల్లని వదిలిపెట్టి, సుశీలని చడామడా తిట్టింది.

సుబ్బమ్మ సాయంత్రం పూట వంట ఒక్కోరోజు చేస్తుంది. ఒక్కోరోజు చేయదు. తనకి కాళ్లు నొప్పులూ, నడుం నొప్పులూ కూర్చుని లేవలేకపోతున్నానంటుంది. ఆమె వంట చేయని రోజు, కూలికి వెళ్లి బాగా చీకటి పడివచ్చిన సుశీలే వంట చేస్తుంది.

సుశీల పొలంనించి వచ్చి బిడ్డలు ఇద్దరికీ అప్పటికే వంటచేసి వుంటే అన్నం పెట్టేది. లేకపోతే త్వరత్వరగా వంటచేసి పిల్లలకి పెట్టి, తరువాత స్నానం చేయించేది.

ఉదయంపూట కూడా ఇంట్లో పని సుశీలని చేయమని అత్తలు ఎక్కడో చోటుకి పెత్తనాలకి వెళ్లేవాళ్లు. కూలికి వెళ్లడంతో పాటు ఇంటిపనీ, పిల్లల పెంపకం ఇవన్నీ సుశీలకి చాలా భారమైంది.

ప్రస్తుతం సింగయ్యకి పేకాట, వూళ్లో పెత్తనాలు నిత్య కార్యక్రమంగా తయారయ్యాయి. బేరానికి వెళ్లి ఎన్ని నెలలు అవుతుందో!

మొదట్నించీ కూలికి ఎప్పుడో ఒకసారి తప్ప పెద్దగా వెళ్లేవాడుకాదు. అదీ మానుకున్నాడు. తినడం, తిరగడం, పేకాటకి పోవడం మరో పనిలేదు.

"ఇంట్లో నలుగురు ఆడోళ్లు వున్నారంటే వున్నారనే కానీ ఏం లాభం? పని నేనొక్కదాన్నే చేసుకోవాల్సి వస్తుందే! పొద్దున బిడ్డలకి నేను అన్నం పెట్టిపోతే సందకాడ నేను వచ్చిందాకా నాకోసం ఎదురు చూస్తా కనిపెట్టుకుని వుంటంట్రి! ఇంటి దగ్గర వున్నోళ్లు ఆ పసిముండలకి కుండలో కూడు పెడితే రెక్కలేమన్నా ముక్కలవతయ్యా, చెక్కలవతయ్యా? " అంది సింగయ్యతో సుశీల.

"పొద్దుటి పూట నువ్వు పెట్టిపోతే సందకాడ నువ్వు వచ్చిందాకా పిల్లలు నీకోసం కనిపెట్టుకుని వుంటన్నారన్నమాట! పాపం ఈ మజ్జెలో వాళ్లకి ఎవురన్నా కూడు పెడతన్నారూ? " అన్నాడు సింగయ్య వ్యంగ్యంగా.

"పెట్టడం లేదనేగా ఈ ఏడుపు! పెడితే ఇంక కావాల్సిందేం వుంది? "

"చాల్లే నోర్ముయ్యవే! ఇంటి దగ్గర వున్నప్పుడు నేను రోజూ చూట్టంలేదంటే, మా పెద్దమ్మ బతిమలాడి పెట్టిద్దయితే!"

"ఏకువ జామున నేను లేచేయేళకి ఈ బజారున పురుగులేవరు! సందకాడ నేను పడుకునేసరికి అందరూ ఒక కునుకు కూడా తీస్తారు. నలుగురు వున్నప్పుడు ఒక్కోరు ఒక్కోపని అందుకుంటే తప్పా? ఒక్కదాన్ని ఇంతమందికి చెయ్యాలంటే మాటలా? "

"అందరికంటే ఎక్కువ పని ఏం చేస్తన్నావే నువ్వు? కూడూ కూరా వండటమేనా, ఇంకేమన్నా చేస్తన్నావా? "

"అది చాలదాంట, అంతకంటే ఇంకేం చెయ్యాలి? ఎందుగ్గానీ మాటలూ... మన గుక్కెడు మనం కాసుకుందామయ్యా!"

"ఏందీ? "

"ఏముంది, ఇంతమందికి నేను వండలేనూ, వార్చలేనూ! మన బతుకు మనం బతుకుదాం, వేరేగా!"

"వేరు పడదాం!" కోపంగా అన్నాడు సింగయ్య.

"ఆ వేరుపడితే తప్పేముంది? నువ్వు పనికి పోవద్దూ, బేరానికి పోవద్దూ! ఇంటి దగ్గర బిడ్డల్ని కనిపెట్టుకుని వుంటేచాలు! నేను కూలి చేస్తన్నాకదా ఆ కూలి మీదనే ఎట్టోకట్ట బతుకుదాం!" ఎలాగైనా సింగయ్య పనిచేయకుండా వుండేవాడు కదా అనేవుద్దేశంతో అతనిని వప్పించడానికి ప్రయత్నిస్తూ అంది సుశీల.

"ఏమేయ్, చాలమట్టుకి వచ్చిందేయవారం! నేను ఇంటి దగ్గర ముండమాదిరిగా గాజులు తొడుక్కుని కూసుంటే నువ్వు కూలి చేసకొచ్చి నన్ను పోషిస్తా! కుంటిముండా నీకు ఆ రెండోకాలు కూడా సరిగా వుంటే అసలు నిలిచేదానివికాదే! నువ్వు నన్ను పోషించేదేందే, నేనేం అవిటోడ్నా, రోగిష్టాడ్నా, చేతకానోడ్నా? ఇయ్యాల బేరానికి పోయినా రోజుకి 50 రూపాయలు సంపాయిస్తా! వేరు పడేమాట పెట్టుకోవద్దని నీకు ఏ వందసార్లో చెప్పా!"

"మాటలయితే వున్నయ్యి! ఏందంట నువ్వు సంపాయిస్తంది? నీకంటే ఆ ముసిలిరాగడు నయం! రోగిష్టోడూ, ముసిలోడూ అయినాసరే, యామాలకుండా రోజూ గంపనెత్తిన పెట్టుకుని పోయి పదో, పదిహేనో సంపాయిస్తన్నాడు! నువ్వు అంత మాత్రమన్నా సంపాయిస్తన్నావాంట? "

"వాడితోటి వంతు ఏందే, వాడూ నేనూ ఒకటే నంటే? "

"ఒకటి ఎందుకు అవతారు. వాడు నీకంటే నయం అయితే...'

"నీకు అడ్డంగా బలిసిందే! నిన్ను రోజుకో సారి తంతంటేనే మాట యింటావు!" అని సింగయ్య కోపంగా సుశీలని కొట్టడానికి లేచాడు.

'ఏంట్రా గోల, ఏందీ తగాదా? " అని అంతలో సుబ్బమ్మ వచ్చింది.

"దీనికి మీలోనించి ఏరు పడాలంటే! మీ అందరికీ చేయలేక చస్తుందంట!"

"ఏందీ మా అందరికీ చేస్తందంటనా, ఏందీ ఆ ముండ మాకు చేస్తందీ? "

"ఏమో యేరు పడాలని ఒకటే నస! ఎన్నోసార్లు చెప్పా అది జరిగేపనికాదే అని!"

"తల్లినీ, బిడ్డల్నీ కూడా యేరు చేసే ముండరా ఇది. కాలాంతకురాలు. యేరు పడదాం అని ఇది మొదటిసారి అన్నప్పుడే ముందుపళ్లు రెండూ రాలకొడితే రెండోసారి ఆ మాట అనిద్దంట్రా? నీ అలుసు చూసుకుని కదరా ఇది ఇట్ట పెచ్చుమీరి పోవడం!"

"నాకంటే ఆ ముసిలిరాగడు నయమంటనే! వాడి మాత్రపు విలువ కూడా నేను చేయనంట!"

"అది అంతంత మాటలు అంటంటే నువ్వు ఎందుకు వూరుకున్నావురా అధవగతోడా! పట్టుకుని నాలుగు తంతే రెండోసారి నోటికొచ్చినట్టు వాగిద్దంట్రా? ఇలాంటి వాటిని కుంగయేస్తంటనే దారిలో పడతయ్యిరా! మెత్తమెత్తగా వుంటే నెత్తికెక్కి ఆడతయ్యి!" అని సుబ్బమ్మ, సింగయ్యని ఇంకాస్త రెచ్చగొట్టింది.

"ఇందాక కూసిన కూత మళ్లీ కుయ్యవే!" అని సుశీల జుట్టుపట్టుకుని వంగతీసి కొట్టడం మొదలుపెట్టాడు. సుబ్బమ్మ కూడా రెండు దెబ్బలు వేసింది.

అంతలో "ఏందీ ఏందీ? " అంటూ కాంతమ్మ కూడా వచ్చింది.

సింగయ్య విషయం చెప్పడం మొదలుపెట్టాడు. కాంతమ్మ మరీ రాక్షసి. ఆమె కూడా ఆ ఇద్దరితో కలిస్తే ఆ రోజు సుశీల పని అయిపోయినట్లే!

కాంతమ్మకి చెపుతున్న సింగయ్య నించి తప్పించుకుని కుంటుతూనే సుశీల పెద్దగా ఏడుస్తూ వీధిలోనికి పరిగెత్తింది.

"మనల్ని బజారు ఎక్కించిందిరా దొంగ ముండా!" అంది కాంతమ్మ.

"తప్పిచ్చుకుని పోయిందే! నువ్వు ఇంటోకిరా! ఇయ్యాల నా చేతిలో నువ్వుచచ్చావులే! రేపు నీ అమ్మా అయ్యని పిలిచి ఇక్కడే నీ దినం జేస్తా!" అన్నాడు సింగయ్య.

"ముందు నువ్వుపోయి దాన్ని జుట్టుపట్టుకుని లోపలికి ఈడ్చుకరారా! మళ్లీ నలుగురూ పోగయితే నాలుగు మాటలు అంటారు! జనమందరూ చేరకముందే దాన్నిలోపలికి లాక్కరా!" అంది సుబ్బమ్మ.

సుశీల పెద్ద కూతురు బజారులో తల్లి రెండుకాళ్లూ కరుచుకుని పెద్దగా ఏడుస్తోంది.

సింగయ్య రోడ్డుమీదకి వెళ్లడానికి జంకినా సుబ్బమ్మా, కాంతమ్మా ప్రోత్సాహం ఇవ్వడంతో రొప్పుతూ సుశీలని లోపలికి తీసుకుపోవడానికి బయటకు వచ్చాడు.

"ఏందమ్మాయి, ఏందీ? ఎందుకు కొడతన్నారు వాళ్లు నిన్ను? " అంటూ విజయమ్మ, ఆమె వెంట ఇంకా ఇద్దరు ముగ్గురు ఆడవాళ్లు వచ్చారు అప్పటికే.

సుబ్బమ్మా, కాంతమ్మా కూడా బయటకు వచ్చారు.

"పెద్ద మడుసులు వచ్చారు తీర్పులు చెప్పడానికి! మీకెందుకు? మీ యవారంలో మేం కల్పించుకుంటన్నాం? ఎవురి బతు

కులు ఎవురికి తెలియదు! అన్నీ పైకి నంగ నాసియ్యే! ఒక్కొక్క దానికి తట్టెడు లొట్టలు న్నయ్యి!" సుశీల దగ్గరకి వచ్చిన వాళ్లని చూసి సుబ్బమ్మ తిట్లకు లేచింది.

"సుబ్బమ్మో... తగ్గుతగ్గు... నువ్వు తగ్గితే బాగుండిద్ది! ఎక్కువ మాట్టాడావు అనుకో, చాలాదూరం పోయిద్ది యవారం!" అన్నాడు అక్కడకు వచ్చిన ఒక కుర్రవాడు.

"ఏం చేస్తావురా నువ్వు... నీ యవారం నువ్వు చూసుకో" అని అతని కుటుంబ స్త్రీలకి సంబంధించి అసహ్యకరమైన మాటలు అంది కాంతమ్మ.

"ముందు మీరు తగ్గండి!" అని అతను వాళ్ల విషయం పట్టించుకోకుండా సింగయ్య వైపు చూశాడు, సుశీలని ఏమైనా చేస్తాడేమో నని.

"ఎందుకు కొడతన్నావురా ఆ పిల్లని నువ్వు!" అని విజయమ్మ అడిగింది సింగయ్యని.

"మీకెందుకు? నా పెళ్లాన్ని నేను కొట్టుకుంటా, తిట్టుకుంటా, చంపుకుంటా! మీరెవురు మాట్టాడ్డానికి? మీకేం సమ్మంధం?"

"హబ్బా... చంపటమే... చంపునాయనా చూస్తాం!" అంది ఒకామె ఎగతాళిగా.

"ఓయబ్బో... చాలా వుందే వీడి దగ్గర!" అంది మరోఆమె.

"కాపరం చేయడానికే కానీ పెళ్లాం కొట్టుకోడానికీ, చంపుకోడానికీ కాదురా! నా పెళ్లాం, నా ఇష్టం అని చంపితే నిన్ను ఇక్కడ వుంచరు, తీసకపోయి ఖయిదులో పడేస్తారు!" అన్నాడు ఒక పెద్దాయన.

"ఎంత దిక్కుమాలినది మీ ఇంట పడిందని దాన్ని అంతగా వేధించుకుని వేపకతింటన్నారే! అదే ఇంకొకతి అయితే ఈ పాటికి మీ అంతు చూసి వుండేది! నోట్లో నాలిక లేనిది కాబట్టి ఈ పిల్ల నీతో కాపురం చేస్తందికానీ, ఇంకొకతి చేసిద్దిరా నీతో కాపురం!" అంది ఒక వయసు మళ్లిన మనిషి.

"మా ఇంటికి పోదాం రా అమ్మాయి..." అని సుశీలని తనతోపాటు ఇంటికి తీసుకు పోవడానికి చేయిపట్టుకు లాగింది విజయమ్మ.

"వద్దులే అక్కాయ్!" అంది ఏడుస్తూ సుశీల.

"అరవకుండా రాముందు నువ్వు! నీ ఒక్క దానికీ కూడు పెట్టలేమెట్టా? వాడి బిడ్డల్ని వాడి దగ్గరే వదిలేస్తే వాడే సాక్కుంటాడ్లే!"

"నువ్వు ఇంటోకి వస్తావా సరేసరి! నువ్వు వాళ్లింటికి పొయ్యావనుకో, నీకూ నాకూ అంతే చెల్లు! ఇంక నిన్ను ఈ గడప తొక్కనియ్యనూ, ఏలుకోనూ! ఏమనుకున్నావో!"

"నువ్వు ఏలుకోకపోతే మునిగిపోయిందేమీ లేదులే!" అంది విజయమ్మ. రానంటున్నా సుశీలని లాక్కుని ఇంటికి తీసుకపోయింది. ఇద్దరు బిడ్డలు కూడా వెంట వున్నారు.

ఆరోజు అంతా విజయమ్మ వాళ్ల ఇంట్లోనే సుశీలా, పిల్లలూ వున్నారు.

మరుసటి రోజు వుదయమే అంకమ్మ వచ్చి సుశీలని ఇంటికి తీసుకుపోయింది. అయితే ఆ ఇంట్లో ఎవరూ సుశీలతో మాట్లాడలేదు. అంకమ్మ అవసరమైన ఒకటి రెండు మాటలు మాట్లాడింది.



"పిల్ల నీకు నచ్చినట్టేనంట అబ్బాయి?" రాగమ్మ అడిగింది కొడుకు నాగార్జునని.

"పిల్ల బాగానే వుందే! అయితే నాకంటే పెద్దదేమో అనిపిస్తందే!" అన్నాడు నాగార్జున.

"పెద్దదికాదూ, పాడు కాదులేరా! కాలు కొద్దిగా బారు! అంతే! పిల్ల కనపట్టంలా, లేతదేనయితే!" అన్నాడు నాసరయ్య.

"మనిషి కొద్దిగా పొడుగుకానీ, నీకంటే





పెద్దదికాదులేరా!" అంది రాగమ్మ.

"ఆ అమ్మాయికి మొదటి పెళ్లయ్యే నాలు గేళ్లయింది అని చెపతన్నారుకదమ్మా!"

"అయితేంరా! ఆడపిల్లలకి ఎన్నేళ్లకి చేస్తా రేంది పెళ్లి? పదో ఏడు వస్తే చెయ్యడంలా ఆడపిల్లకి పెళ్లి! పెళ్లికీ, వయసుకీ సమ్మంధం లేదులేరా! నీకంటే చిన్నదే కావచ్చు!"

"మొదటిసారి పెళ్లయ్యినప్పుడు ఆ మొగుడు ఎందుకు వదిలిపెట్టాడో మనకి చెప్పలేదుగా!"

"ఆ అబ్బాయి తాగుబోతూ తిరుగుబోతూ అయితే ఈ పిల్ల వదిలిపెట్టిందని చెపతన్నా రుకానీ అది నిజం కాదులే! మేనమామకే ఇచ్చిచేశారంట. వాడు ఒకదాన్ని పెట్టుకుని ఈ అమ్మాయిని వదిలిపెట్టాడని ఈ సమ్మంధం తీసకొచ్చిన లచ్చుమయ్య చెప్పాడు!"

"కట్నం మాత్రం 40 వేలు డబ్బూ, ఎకరం పొలం ఇస్తారంట్రా! ఇంతకంటే ఎక్కువ కట్నం మనకి ఎవురూ ఇయ్యరు! రెండోపెళ్లి అయినా పిల్ల గుణవంతురాలూ, బుద్ధిమంతురాలూ! మనకి ఇసుమంటి సమ్మంధం దొరకటమంటే మన అద్రుష్టమే!"

"మీకు నచ్చిందికదా! నాదేం లేదయ్యా! మీ అందరికీ నచ్చితే నాకూ నచ్చినట్టే!"

"సరే అయితే వాళ్లని రమ్మని కబురు చేస్తా!" అని నాసరయ్య బయటకి వెళ్లాడు.

మధ్యవర్తి దగ్గరకి వెళ్లి వాళ్లని రమ్మని కబురు చేయడంతో మరుసటి రోజు వాళ్లు వచ్చారు. మాట్లాడుకున్నారు.

నాగార్జునకి పెండ్లి కుదిరింది.

నాగార్జున పదో తరగతి తప్పాడు. ఇంటి దగ్గరే వుంటూ తండ్రితోపాటు పొలంపనికి పోతున్నాడు. పెళ్లి చేయాలని సంబంధాలు చూస్తుంటే, ఈ సంబంధం కుదిరింది.

పెళ్లికి సుశీలా, సింగయ్యా, పిల్లలూ వచ్చారు. వాళ్ల అందరికీ కొత్త బట్టలు పెట్టారు. పెళ్లి అయిన తరువాత నాలుగు రోజులువుండి తిరిగి వాళ్ల వూరు వెళ్లిపో యారు.

నాగార్జున భార్య రమాదేవి. నాగార్జున కంటే కనీసం మూడు సంవత్సరాల వయస్సు పెద్ద! అందరికీ పెద్ద అనే విషయం తెల్సు. అయినా కట్నం కోసం ఆశపడి, వయసు తక్కువ వుంటుందని వాళ్లకి వాళ్లే సర్ది చెప్పుకుని రమాదేవిని చేసుకున్నారు.

రమాదేవిది మహా గయ్యాళి స్వభావం. నాగార్జుననీ, నాసరయ్యనీ ఎవర్నీ లెక్కచే సేది కాదు. వీళ్లకంటే ఎక్కువ హోదాగల కుటుంబం, డబ్బు వున్న కుటుంబం నించి వచ్చిన మనిషిననే అహంకారం మెండుగా వుంది.

"వానలు ఏం కురిసినా కురుస్తన్నయ్యి! చేలో కలుపు పెరిగిపోయింది. మనకి వుండ ఎకరం చిండలో పైరే అంతంత మాత్రంగా వుంటే దానికి తోడు కలుపు! నాకు మూడు నాలుగు రోజులు పట్టేట ట్టుగా వుంది కలుపు. నేను పోయి కలుపు తీస్తా వుంటాకానీ నాకు అన్నం తీసకరారా చేలోకి!" అని రాగమ్మ నాగార్జునకి చెప్పి పొలం పోయింది.

వాళ్లకి వున్న ఎకరం పొలంలో వేరుశనగ పెట్టారు.

రాగమ్మ ఒక్కతే ఉదయమే వెళ్లి చేలో కలుపు తీస్తున్నది. ఖాళీ లేదు. చేను అంతా కలుపే! అది ఎక్కువ పెరిగింది.

కలుపు తీస్తున్న రాగమ్మ కాలికి ఏదో కుట్టినట్లు అనిపించి చూసింది. పాము కాలి కింద పడింది, తప్పించుకోవడానికి కరచి జరజరా పోయింది.

"అమ్మో... నాయనో... పాము కరిచిం

# ఏరిన ముత్యాలు

☆ మనిషికి చదివిన చదువు కాదు, సంపాదించిన వ్యక్తిత్వమే పెట్టని కోట.

-స్పెన్సర్

☆ గతాన్ని, వర్తమానాన్ని మాత్రమే చూసేవారు భవిష్యత్తును కోల్పోతారు.

-కెనడీ

☆ మాట దూకుడు ఎంతమాత్రం మంచిది కాదు. మన మనోభావం మోసుకెళ్ళేది మాట.

-గ్రీన్

☆ మూర్ఖులనుంచి ప్రశంసలు అందుకోవడంకన్నా బుద్ధిమంతులచేత తిట్లు తినడం మంచిది.

-షేక్స్‌పియర్

☆ సత్సాంగత్యం, ఆరోగ్యం ఇవి లోపించినప్పుడు వీటి విలువలు తెలిసివస్తాయి.

-కోల్టన్

☆ మూఢనమ్మకాలు అవివేకాన్ని కలిగిస్తే సంశయాలు పిచ్చిని పట్టిస్తాయి.

-థామస్ ఫుల్లర్

☆ గడగడ తాగేవారికి రుచి తెలియనట్లే, చకచక మాట్లాడేవారు ఏమి మాట్లాడుతున్నదీ ఆలోచించరు.

-ప్రియార్

☆ మనకు రెండు చెవులు, ఒక నాలుక ఉన్నది ఎక్కువ వినడానికి, తక్కువ మాట్లాడటానికే.

-డయోజనీస్

☆ ప్రజ్ఞాపాటవం లేకపోవటంకంటె, అశ్రద్ధే అధికంగా కీడు కలిగిస్తుంది.

-ఫ్రాంక్లిన్

☆ తన తండ్రి చెప్పింది నిజమేనని అనుకొనే సమయం వచ్చేటప్పటికి ఆ వ్యక్తికి తన తండ్రి చెప్పేది అబద్ధం అనుకొనే కొడుకు ఉంటాడు.

-ఛార్లెస్ వర్డ్స్‌వర్త్

☆ అదృష్టం మానవుల్లో మార్పు తీసుకురాదు. వారి అసలు రంగులను వెలికితీస్తుంది.

-రికోబోని

☆ ఒడ్డునున్నవాళ్లను వివాహం అనే నీట్లోకి లాగేదాకా అందిరికీ సందడే. ఆ తరువాత వాళ్లు మునిగితే ఎవరికీ పట్టదు.

☆ అంకెలతో దేన్నినైనా నిరూపించవచ్చు. ఒక్క నిజాన్ని తప్ప.

జార్జికానింగ్-

☆ ఉన్నత లక్ష్యాలు లేనివాళ్ళు అల్పవిజయాలకే ఆనందపడతారు.

-లాంగ్‌ఫెలో

సేకరణ: డి.విద్య

దిరా దేవుడో..." అని భయపడుతూ రాగమ్మ పరిగెత్తుకుంటూ వచ్చింది. కొంత దూరం వచ్చిన రాగమ్మ ఇక రాలేకపోయింది. భయంతోనూ, ఆందోళనతోనూ కొంతదూరం వచ్చి కూర్చుంది.

కూర్చున్న రాగమ్మ కొంతసేపట్లోనే అక్కడే ప్రాణాలు విడిచింది.

కొద్దిగా ఎండపడిన తరువాత గడ్డికోసం పొలం వచ్చినవాళ్లు ఎవరో రాగమ్మ కింద పడి మరణించి వుండటాన్ని చూసి పరిగెత్తి ఇంటికిపోయి చెప్పారు. అందరూ ఏడ్చుకుంటూ వచ్చారు.

కబురు చేస్తే సుశీల హృదయవిదారకంగా ఏడుస్తూ వచ్చింది.

తల్లి మనసువేరు, తల్లిప్రేమ వేరు, తల్లి హృదయంవేరు!

కొడుకుతో పాటు తనని చూడకపోయినా, వివక్షతో తనని చూసినా, కంటికి రెప్పలా తనని కనిపెట్టుకుని వుంది.

తన కష్టసుఖాలూ, మంచి చెడులూ తల్లితో చెప్పుకుంది.

తల్లి ఓదార్చింది. నచ్చచెప్పింది. మంచి మాటలో, చెడు మాటలో, కోపంతోనో తాపంతోనో భర్తవద్దకు పంపించింది.

తల్లి చెంతనే తను బాధలనించి వూరట చెందేది.

అలాంటి సుశీల తల్లి మరణంతో కృంగిపోయింది. సుశీల తల్లిలేని బిడ్డ అయింది.

★ ★ ★

సుశీలకి మళ్లీ మూడోసారి ముచ్చటగా ఆడపిల్ల పుట్టింది.

ఇక అప్పచెల్లెళ్లు ముగ్గురూ సుశీలని తిట్టిన తిట్టు తిట్టకుండా ఒకరోజు అంతా తిడుతూనే వున్నారు. "ఉన్న ముండలు చాలకనా, మళ్లీ మూడో ముండ దాపరించింది! తీసకపోయి వూర చెర్లో పారేసి రాంర్రా పీడా వదిలిపోయిద్ది! ఎందుకు కోస కలింటానికా ఆడపిల్లలు?" అంది సుబ్బమ్మ.

"అసలు ఈ కాలంలో ఆడ పిల్లకి పెళ్లిళ్లు చేయటం అంటే ఎంత పని! ఒక పిల్లకి పెళ్లి చేస్తేనే అతాలు అణుగుతాయి! అసుంటిది ముగ్గురు ముండలకి పెళ్లిళ్లేందీ, పేరంటాలేందీ, కాన్పులేందీ మనోడు బాగానే చేస్తాడు" అంది అంకమ్మ.

"రేపు కాన్పులదాకా పోయావు, ఆ ముండల్ని ఇప్పుడు సాకమను తెల్సిద్ది! వాళ్లకి గుడ్డలేందీ, గోసిలేందీ బొట్టులేందీ కాటికిలేందీ? మగనలుసు ఏముందే కనిపడేస్తే వాడే పెరుగుతాడు. ఆడముండలు అయితే వాళ్లకి రిబ్బన్లు అనీ, జడపిన్నులనీ, గాజులనీ, గొలుసులనీ పువ్వులనీ, రైకలనీ ఒక కర్చంటే! వాళ్లని పెంచి పెద్ద చేసేసరికి అయిద్ది మన పని!" అంది కాంతమ్మ.

సుశీలనీ, అప్పుడే భూమిమీద పడిన పాపం పుణ్యం ఎరుగని ఆ పసిప్రాణినీ భయంకరంగా తిట్టితిట్టి అలిసిపోయి కొంచెం కసి, కోపం చల్లార్చుకుని అత్తలు ముగ్గురూ ఉపశమనం పొందారు.

తిడుతూనే సుశీలకి కాన్పు చేశారు. కాన్పు అయిపోయిన తరువాత తిట్టారు. ఆ రోజు అంతా అలా తిడుతూనే, తిట్లతోనే కాలం గడిపారు.

భూమండలం మీద వుద్భవించిన ఆ నూతన శిశువు ఆనందంకంటే విషాదమే ఎక్కువ తెచ్చింది.

సుశీలకి కూడా ఏమీ సంతోషం కలగలేదు. మగపిల్లవాడు పుడితే బాగుండునని ఎన్నో కలలు కంది.

నెల రోజులు గడచిపోయాయి.

పనికి పోకుండా సుశీలకి కూర్చోపెట్టి తిండి పెడుతున్నందుకు వాళ్లు తెగ బాధ పడి పోతున్నారు. వాళ్ల సిరిసంపదలు అన్నీ కరిగిపోతున్నట్లు భావించి కలత

చెందుతున్నారు.

"ఇదేందే ఈ యిద్దూరం! పంది పిల్లల్ని కన్నట్టు కనింది! తిండి కూడా పంది తిన్నట్టు కూసుని తింటంటే మనం ఎక్కడ తీసకొచ్చి పెడతాం?" అంది సుబ్బమ్మ.

"ఎరుకలి రామి కూతురే, వారం రోజులైం దంట పిల్లోడ్ని కని! పొద్దున నెత్తికి గుడ్డక ట్టుకుని చకచకా కూలికిపోతంది! దగ్గిర పొలం. మజ్జెన్నం వచ్చి బిడ్డకి పాలిచ్చిపో యిద్ది! ఆ పసిపిల్లోడి దగ్గిర ముసిల్ది వుంటందిలే! దాన్ని చూసి అందరూ ముక్కుమీద వేలేసుకున్నారు!" అంది కాంతమ్మ.

"మన అమ్మాయి ఇట్ట ఎన్ని రోజులు వుండాలనో ఇంటి దగ్గర?"

"తీసకొచ్చి పెడతంటే ఎన్ని రోజులైనా వుండిద్ది!" అంది కాంతమ్మ.

ఆ పది రోజులూ సుశీలకి పొలం పని తప్పినా, ఇంట్లో పని తప్పలేదు! మొదటి వారం రోజులూ విశ్రాంతిగా అలా పడుకుం దేమో! తరువాత ఇంటి పని అంతా సుశీలే చేస్తుంది.

అయినా అత్తలనించి తిట్లూ, సాధిం పులూ తప్పలేదు.

ఎదురింటి విజయమ్మ వాళ్ల ఇంటికి వెళ్తే ఆమె అంది "సుశీలా... నువ్వా ఒంటి వూపిరిదానివి! ఈ ముగ్గురు బిడ్డల్ని సాకి సంరక్షణ చేసేసరికి నీ పని అయిపోయిద్ది! నా మాట విని ఆప్రేషన్ చేయించుకో! ఇంకెందుకు పిల్లలు?"

"ఒకసారి గోల అయిందక్కాయి! వాళ్లకి మొగపిల్లోడు కావాలంట! నేను కనలే నయ్యా దేవుడా అంటే నా మాట ఏం వింటారు? వాళ్ల లక్షల ఆస్తికి వారసుడు కావాలంటన్నారు!"

"వాళ్లకేం అంటారు! కనేదీ, బాధపడేదీ, పెంచేదీ, ఇబ్బంది పడేదీ అన్నీ నువ్వేగా! వాళ్లకేం చెపతారు, వాళ్లదేం పోయింది?"

"పోయినసారి ఇద్దరు బిడ్డలు పుట్టినప్పుడే ఆప్రేషను చేయించుకుంటాను అన్నాన క్కాయి! ఇంకెందుకు తిట్టి కొట్టి నానా గొడవ చేశాడు! పైసా సంపాయించటం చేతకాదుగానీ ఎచ్చులు మాత్రం అబ్బో ఏమున్నా వున్నాయి"

"ఊళ్లో వుండ నర్సుతో నేను మాట్టాడతా కానీ నువ్వు చేయించుకో ఆప్రేషన్! మనం చెబితే వాళ్లేమండలానికి తీసకపోయి అక్కడ ఆస్పత్రిలో ఆప్రేషన్ చేస్తారు. తరు వాత వాళ్లే వేనులో తీసకొచ్చి వదిలిపెడ తారు. చేయించుకున్నందుకు డబ్బులు కూడా ఇస్తారు"

"చేయించుకుంటాను అక్కాయి ఈసారి! మళ్లీ ఇంకొకతి, నాలుగోది పుడితే నేనెక్కడ సాకేది! ఏం తెచ్చిసాకేది?"అంది సుశీల.

ఆరోజు సాయంత్రం భర్తతో అంది, "నేను ఆప్రేషను చేయించుకుంటానయ్యా! ఈ ముగ్గురు బిడ్డల్ని సాకి, పెంచి పెద్దచేసి పెళ్లిళ్లు చేస్తే చాలు! మనకి ఏమంత ఆస్తు లున్నయ్యి ఇంకో బిడ్డని కనడానికి!"

"ఏందీ... ఆప్రేషను చేయించుకుంటా? ఏమేయ్, మగపిల్లోడు పనిలేదన్నమాట! ఆడముండలు పదిమంది వున్నా ఒకటే, మగపిల్లోడు ఒక్కడువున్నా ఒకటే! ఒకడు చాలే పదిమంది పెట్టు"

"నిజమేనయ్యా! నాకూ మొగపిల్లోడు పుడితే బాగానే వుండిద్దనిపిస్తంది! మగపి ల్లలు అంటే నాగ్గూడా ఇష్టమే! మన చేతిలో ఏముంది? మళ్లీ ఆడపిల్ల పుడితే... మీ అమ్మ వాళ్లసాలేమొ... వాళ్లూ వరసగా నలుగురు ఆడపిల్లలేగా"

"చాలు చాల్లే నోర్ముయ్! ఇంకెప్పుడూ అట్ట మాట్టాడవాకు! మగపిల్లోడు పుట్టా ల్సిందే ఎప్పుటికైనా!" కోపంగా, గదమా యిస్తూ అన్నాడు సింగయ్య.

రెండురోజుల తరువాత విజయమ్మ చెప్ప డంతో సుశీల వాళ్ల ఇంటికి నర్సు వచ్చింది. అప్పుడు అందరూ ఇంట్లోనే వున్నారు.

"ఏమ్మా... పాప బావుందా? "

"బాగానే వుందమ్మా!" సుశీల నవ్వుతూ చెప్పింది.

"మరి ఆప్రేషను చేయించుకోరాద, ఇంకెందుకు పిల్లలు? "

"మాకు మగపిల్లవాడు కావాలి. మగపిల్ల వాడు పుట్టిందాకా వుంటాం!" అన్నాడు సింగయ్య.

"బలే వాడివయ్యా! ఈ పిల్ల చూస్తేనేమో అసలే బలహీనంగా వుంది. ఈ పిల్లని పుంచదలుచుకోలేదా ఏమిటి? ఆప్రేషను చేయించుకుంటే ముందుముందు మీకు మంచి ఉపయోగాలుంటాయి" సింగయ్య కంటే పెద్దది అయిన నర్సు చనువుగా అంది.

"మాకు పిల్లవాడు కావాల్లే!" అంది సుబ్బమ్మ.

"మీ ఇష్టం! ఇప్పుడు కానీ ఆప్రేషను చేయించుకుంటే మీకు ఇళ్లస్తలం ఇస్తారు. నువ్వు వ్యాపారం చేసుకోవటానికి బ్యాంకు ద్వారా లోను ఇస్తారు. ఆప్రేషను చేయించు కున్న వాళ్లకి ఇవి అన్నీ ఇస్తున్నారు"

ఆమె మాటలకి సింగయ్యకి ఉత్సాహం వచ్చింది. "ఏందీ ఆప్రేషను చేయించుకుంటే లోను ఇస్తారా? "

"ఆ.. ఇస్తారు"

'లోను ఎందుకురా? మనం ఏం చేసు కుంటాం లోను? " అంది సుబ్బమ్మ.

"నీకు తెలియదు. నువ్వు వుండవే!" సుబ్బమ్మని విసుక్కున్నాడు. "లోను ఇచ్చే పనయితే ఆప్రేషను చేయించుకునిద్దండీ!" డబ్బు మాట వినడంతోనే సింగయ్య వంశం మాట మరచిపోయాడు.

"ఇస్తారు... అయితే కొద్దిగా టైంపట్టిది! ఆప్రేషను అయిన వెంటనే ఇవ్వమంటే ఇవ్వరు!" అంది నర్సు.

"వెనుకా ముందుగా ఇస్తారుకదా!" ఆమెతో అని "నీక్కూడా ఆప్రేషను చేయిం చుకోవాలని వుందిగా, సరే కానియ్యవే అయితే!" అన్నాడు సుశీలతో.

సుశీల స్పందన ఏమీలేదు. అన్నీ సింగయ్యే మాట్లాడుతున్నాడు.

"పేరు రాసుకొండి. ఆప్రేషను చేయించు కునిద్ది!" అన్నాడు చివరకి.

"అది కాదురా..." అని సుబ్బమ్మా, కాంతమ్మా అంటున్నా వాళ్ల మాటల్ని మాత్రం సింగయ్య వినిపించుకోలేదు.

తరువాత నాలుగు రోజులకి సుశీలని మండల కేంద్రంలో వున్న ఆరోగ్య కేంద్రా నికి తీసుకుపోయి ఆపరేషను చేసి తీసుకు వచ్చి వదిలిపెట్టారు.

★ ★ ★

రోజులు జరిగిపోతున్నాయి.

రోజుకో యుద్ధంతో సుశీల కాపురం నెట్టు కొస్తున్నది.

ఏ రోజు ఏ గొడవ వస్తుందో తెలియదు. అయితే గొడవరాని రోజు వుండదు.

సుశీల ఇంతకుముందు మాదిరిగా మెత్త మెత్తగా వుండటంలేదు. అత్తల్నికానీ, భర్తని కానీ లెక్కచేయకుండా, వాళ్లకి ఎదురు తిరిగి మాట్లాడుతున్నది.

రోజూ కూలికి వెళ్తున్నది. పొలంపనీ, ఇంట్లో పనీ తప్పడంలేదు. సుశీల కూలికి వెళ్లిన తరువాత ఆ పసిపాపల ముగ్గురి ఆలనాపాలనా పట్టించుకునే వాళ్లేవుండరు. కొద్దిసేపు మామూలుగావున్నా, తల్లి కూలి నించి వచ్చేవరకూ దాదాపు ఏడుస్తూనే వుంటారు. పొలంనించి వచ్చిన సుశీల వాళ్లని సముదాయించేది.

సింగయ్య పనికీ, బేరానికీ పోవడం మానుకున్నాడు. పేకాట దగ్గరకిపోవడమో, అరుగులమీద కూర్చుని పోసుకోలు మాటలతో పొద్దుపుచ్చడమో చేస్తున్నాడు. పనిలేనివాడికి తగాదా పని అయినా వుండాలి.

"ఏందే ఈ కూర చెయ్యడం! మాంసాలూ, చేపలూ వండిపెట్టకపోతే వండిపెట్టకపోయావులే! కనీసం నువ్వు వండే గోంగూర అన్నా రుచిగా చెయ్యి తింటానికి!"

"గోంగూర అంతకంటే బాగా ఇంకెట్ట చేస్తారు? నువ్వు మాంసాలూ, చేపలూ తీసకరాకపొయ్యావా? నువ్వు తీసకొస్తే ఎందుకు వండిపెట్టను? నువ్వు తీసకరా, వండకపోతే చెప్పుతో కొట్టు!"

"వండిపెట్టేదానివే నువ్వు! చేసేదానివి ఈ గోంగూర బాగా చెయ్యకూడదూ? "

"ఇంకెట్ట చేస్తారు? ఇంటో నూనెవుందా, వుల్లిపాయలున్నయ్యా, ఏమున్నయ్యి? అయ్యి రెండు వుంటే ఇంకాస్త బాగుండేదేమో!"

"కనీసం ఉప్పు అన్నా వుండొద్దంటే కూరలో! ఉప్పు వేసావాంట? కొంపలో వుప్పుకూడా లేదా? "

"ఉప్పు ఒకటి వుందిలే, ఎందుకులేదు? కూరలోవేసాగా. అంతకంటే ఇంకా ఎక్కువ పొయ్యమంటావేంది ఒక దోసెడు!"

"పోస్తావే, నీ పని అట్టుంది! మూడు పూట్లా మూడు కంచాలు తింటావు నీవ రకూ పంది తిన్నట్టు. యెనకోళ్ల యవారం మాత్రం పట్టిచ్చుకోవాకు!"

"అమ్మలూ కొడుకూ ఆ మాట ఒకటి అంటన్నారు! మొన్నకూడా మీ పెద్దమ్మ అంటందిలే. పందికన్నట్టు కన్నావు అని! వాళ్ల మాదిరిగా గొడ్డుబోతుతనంగా వుండమని కామాలి! నువ్వేమో పంది తిన్నట్టు తింటన్నాను అంటన్నావు! నేను కాదు తింటం మీరు తింటన్నారు తోపుల్లో, దొడ్డుల్లో, వాగులమ్మటా పంది తిన్నట్టు!"

"ఏందే నీ... మళ్లీ అనూ" అని కొట్టడానికి సుశీలమీదకి లేచాడు.

"నువ్వు అయినవాడివి కొట్టు... ఎంత మాత్రం కొడతావో చూస్తా! పనిచేసుకోవటం, పది రూపాయలు సంపాయించటం చేతకాదుకానీ పైకి వచ్చి కొట్టటం మాత్రం చేతవ్వు! నీ అంతోడు ఇంత వూళ్లో పనీ పాటా లేకుండా తిరిగే వోడు ఎవుడన్నా వున్నాడూ! నా ఇంటికి నేను పెద్ద అనుకోవటంకాదు, ముగ్గురు బిడ్డలు వున్నారు! వాళ్లకన్నా తిండిపెట్టాలిగా!" అని సుశీల పోట్లాటకి లేచింది.

కొట్టడానికి సిద్ధమైన సింగయ్య తిండితిని, మాట్లాడకుండా బయటకి వెళ్లిపోయాడు. మూడు రోజులకి మళ్లీ మరోసారి భోజనాల దగ్గిరే తగాదా రాజుకుంది.

ఆరోజు కూడా గోంగూర పచ్చడే చేసింది. అన్నిటికంటే అదే చౌక! రెండు రూపాయలకి వాళ్ల కుటుంబానికి సరిపడేటంత గోంగూర వస్తుంది. కాబట్టి వారంలో ఐదు రోజులు ఆ ఇంట్లో గోంగూర వుంటే రెండు రోజులు చింతకాయపచ్చడి! మూడో కూర మాటేలేదు!

ఆరోజు కూరలో వుప్పు ఎక్కువైందని గొడవ పెట్టుకున్నాడు.

"ఏందే ఈ కూర? తింటానికేనా? ఇంత వుప్పు పోసుకున్నావెందుకు? ఒక రోజేమో ఒక వుప్పుకల్లువెయ్యవూ, ఒక రోజేమో దోసెడు పోస్తావు! ఇంటోవాళ్లు కూడు తినడం ఇష్టంలేదు నీకు! కూర చేయడం చేతకాకపోతే మా పెద్దమ్మని అడిగి నేర్పించుకుని చెయ్యి!"

"ఆమె నాకు నేర్పించేదేందీ. ఆమెనే చెయ్యమను! వాళ్లు మాత్రం చెయ్యకూడదు, నేనొక్కదాన్ని చెయ్యాలి! ఆమె బాగా చేసే పనయితే ఆమెనే చెయ్యమను కూర,




ఇంకేం!"

"ఆమె చేస్తే నువ్వేం చేస్తా? కూడూ కూరలు కూడా చేయకుండా వుజ్జోగమే మన్నా చేస్తావేంది? "

"నువ్వు చేస్తన్నావుగా ఒక వుజ్జోగం, ఇంక నేనేం చేస్తాలే! నేనేం కూడూకూరా చెయ్యనంటంలా! రోజూ చేస్తానేవున్నా!"

"ఏందీ... ఎవురూ తినకుండానా... ఇంతేనంటే నువ్వు చెయ్యడం? "

"నాకు చేతయింది అదయ్యా! అంతకంటే చెయ్యడం నాకు చేతకాదు! ఎందుకు మాటలు అనవసరంగా! నాకు చేతయిన మట్టుకి చేస్తా! ఇష్టమైతే తినండి, ఇష్టంలేకపోతే తినవాకండి!"

"నువ్వు బాగా బలిసి కొట్టుకుంటన్నావే! మొన్న కూడా ఇంతే, పెడద్దరంగా మాట్టాడతన్నావు! ఇష్టమైతే తినేదేందే? " అని లేచి సుశీల జుట్టుపట్టుకున్నాడు.

"కొట్టు... ఎంతమాత్రం కొడతావో" అని సుశీల గట్టిగా ఎదురు తిరిగి మాట్లాడుతూ అతని చేతిలోనించి జుట్టు విడిపించుకోవడానికి పెనుగులాడుతోంది.

బాగా పొడవుగా, లావుగా వుంటాడు సింగయ్య. సుశీల బలహీనురాలు. అతని ముందు ఆగలేకపోయింది.

"వదులు ముందు జుట్టు... కొట్టబోతన్నాడే!" అని సుశీల అంటోంది.

"కొట్టడం ఏందే, నిన్ను ఇప్పుడు చంపుతా! ఎవుడు అడ్డం వస్తాడో రమ్మను!" అని సుశీలని దభీదభీమని వీపుమీద పిడిగుద్దులు గుద్దుతున్నాడు.

"వామ్మో... వార్నాయినో... ముదనష్ట పోడు, చంపుతున్నాడు దేవుడో" అని సుశీల పెద్దగా ఏడుస్తూ అరిచింది.

బయటవున్న సుబ్బమ్మ వచ్చింది. "దొంగ ముండ... ఎదురు తిరిగి మాట్టాడ్డం బాగా నేర్చిందిరా! నువ్వెంత అంటే నువ్వెంత అంటంది! ఇది దీనికి పుట్టిన బుద్ధికాదు, ఎవురో చెపతన్నారు, నేర్చుకుంటంది! ఇంకా రెండు వెయ్యి ఎదురు మాట్టాడకుండా!" అని సుబ్బమ్మ సింగయ్యకి వత్తాసుగా అంది.

సుశీలని కొద్దిసేపు కొట్టిన తరువాత "ఇంకోసారి ఎదురు తిరిగి మాట్టాడావంటే ముక్కలు ముక్కలుగా నరుకుతా! ఏమేయ్... నువ్వొక్కదానివే పనిచేసి ఇల్లు మొత్తం జరుపుతున్నట్టు వాగుతున్నావే!" అని సింగయ్య బూతులు తిట్టి బయట అరుగుమీదకి వెళ్లిపోయాడు.

సుశీల ఏడుస్తుంటే పెద్ద పిల్లలు ఇద్దరూ కూడా తల్లిని కరుచుకుని ఏడుస్తున్నారు.

"మీకేమి రోగమే ముండల్లారా మీరేడుస్తున్నారు? ఏమ్మా ఏం నొప్పి? " అని సుబ్బమ్మ ఆ పిల్లల్ని తిట్టింది.

మరుసటిరోజునించీ సుశీల తనకూ, పిల్లలకూ వేరేగా చిన్న గిన్నె పెట్టుకుని ఒక్కతే వండుకుని తింటున్నది.

మొదటిరెండు రోజులు విజయమ్మ వాళ్ల ఇంటికి వెళ్లి కూర తెచ్చుకుంది.

తరువాత రోజునించీ అలా వాళ్లింటికి వెళ్లికూర తెచ్చుకోవడం బాగుండదని పావు కేజీ వంకాయలు, టమాటాలు లాంటి కూరగాయలు తెచ్చుకుని వేరేగా వండుకుంటోంది.

ఇంట్లో ఎవరితో మాట్లాడటంలేదు.

సింగయ్యకీ, అత్తలకీ ఆగ్రహంగా వుంటోంది. ప్రచ్ఛన్న యుద్ధం జరుగుతోంది.

సుబ్బమ్మా, కాంతమ్మా సూటీపోటీ మాటలు అంటున్నారు. ఒక్కోసారి ప్రత్యక్షంగానే తిడుతున్నారు. అయినా సుశీల పట్టించుకోవడంలేదు.

ఆ అత్తలకి వాళ్ల పనులు వాళ్లు చేసుకో

వడానికే సరిగా వళ్లుకాదు. అలాంటిది ఇంట్లో పని అంతా చేయాలంటే మహా కష్టంగా వుంటుంది.

వేరేగా వుంటున్న సుశీలకి ఇంట్లో ఏ నిముషంలోనో గొడవ జరుగుతుందని తెలుసు. అయినా ఎదుర్కోవడానికి సిద్ధంగా వుంది.

ఒకరోజు వుదయమే సుబ్బమ్మ తగాదా పెట్టుకుంది.

"నువ్వు ఎవితివే నా ఇంటో యేరే కుండ పెట్టుకుని వండుకోటానికి? ఈ ఇంటో రెండో కుండ వుండకూడదు. నీకు మాలో కలిసి వుంటం ఇష్టంలేకపోతే ఎల్లిపో! నా ఇంటో గడియ వుండవాకు!"

"ఏందమ్మో! ఏందో మాట్టాడతన్నావు? నీ ఇల్లేందీ? "

"నా ఇల్లుకాక నీ అమ్మ మొగుడు కట్టించిన ఇల్లా ఏందే ఇది? నా ఇంటో వుండి నాకు ఎదురు తిరిగి మాట్టాడతన్నావ్! ఈ ఇంటోగింటో వుండవాకు! ముందు ఇంటో నించి పో, తరువాత యవారం తరువాత చూద్దాం!"

"ఇంటోనించి పొయ్యేదేంది? నువ్వు సంపాయించిన ఇల్లుకాదు ఇది! ఈ ఇంటో నీకు ఎంత వుందో నాకూ అంతే వుంది! నువ్వు ఎవురివి నన్ను పొమ్మనటానికి? "

"నీకు ఎక్కడ తెచ్చుకుని వుంది ఇల్లు? నువ్వు నీ వూరునించి కట్టకట్టుకుని తెచ్చావేంది? నీగ్గూడా ఇల్లు వుందంటనే, ముందుపో నా ఇంటోంచి"

"నాకు లేక నీకు వుందేంది? ఇల్లు వుందనేగా నన్ను నీ కొడుక్కి ఇచ్చి కట్టబెట్టింది. అప్పుడే ఆ దిక్కుమాలినోడికి ఇల్లూగిల్లూ లేదని చెప్పకపోయావా? మావాళ్ల తంటాలు మావాళ్లు పడేవాళ్లు! ఇల్లు చూసి కాకుండా ఇంకా ఏం చూసి ఇచ్చారేంది నన్ను నీ కొడుక్కి? "

"ఏందే కుంటిది ఏందో వాగుతంది? " అని సింగయ్య అప్పుడే వచ్చాడు, బయటకి వెళ్లినవాడు.

"దీనికి కూడా ఇంటో వాటా వుందంట!"

"ఎక్కడ తెచ్చుకునీ? "

"అసలు ఇది ఎవుతిరా నా ఇంటో వుంటానికి? ముందు దీన్ని బయటకు గెంటు"

"ఏమన్నదేంది అసలు? "

"నీకు ఇల్లు వుందనే ఈ రాణిని నీకు ఇచ్చారంట. లేకపోతే దీని అయ్యా అమ్మా ఏ కలకటేరుకో, గవురునేరుకో దీన్ని ఇచ్చి చేసేవాళ్ళంట. పిల్ల కొద్దిది కానీ ఎంత మదం వుందిరా దీని దగ్గిర! మదం పట్టి కొట్టుకుంటంటే"

"నేను మదం పట్టి కొట్టుకోవటంలా! మీరు పని లేకుండా తిని మదం, ఆము, కొవ్వూ అన్నీ కొట్టుకుంటున్నారు"

"ఏందే వాగుతున్నావు? ఆ రెండోకాలు కూడా ఇరక్కొట్టి మూలన పడేస్తేనే నువ్వు మాట ఇంటావే. లేస్తే తన్నూ, కూర్చుంటే తన్నూ, కదిలాడితే తన్నూ తంతంటేనే నువ్వు మాట ఇంటావు!"

"తన్నూ... అంతకంటే నీకు ఛేతయిందేం వుంది? వూరక కాడి పెరిగినట్టు పెరిగితే ఏం లాభం, బుద్ధి పెరగాలిగానీ"

"నాకు బుద్ధి లేదంటావంటే? "

"నీకు బుద్దే కాదు, సిగ్గూశెరం, చీమూనెత్తురు, రోసం కేసం ఏమీ లేవు. అవి వుంటే పెళ్లాం కూలిచేసకొస్తంటే కూర్చుని తినవు"

"ఏందే నీ...కుంటిదానా మళ్ళీ అనూ..."

"మళ్ళీ ఏందీ, వందసార్లు అంటా! కుంటిదీ కుంటిదీ అంటన్నావు. ఆ కుంటిది చేసుకొచ్చి పడేస్తేనే నీ ముకానికి కూడు. అంతేగానీ నీ అంతట నువ్వు రూపాయి సంపాయించి తీసకొస్తే తెలిసిద్ది నీ మొగో





డితనం!"

అప్పటికే చుట్టుపక్కల జనం చేరారు.

సింగయ్య నీచమైన బూతులు తిట్టడం మొదలు పెట్టాడు. అందుకు తగినట్లే సుశీల కూడా ఏమాత్రం తగ్గకుండా సింగయ్యని తిట్టింది. సింగయ్య ఒకటి తిడితే తను రెండు తిట్టింది.

సింగయ్య సహించలేకపోయాడు.

మగవాడికి వున్న ఆయుధం- పశుబలం! పశుత్వం, రాక్షసత్వం, క్రూరత్వం.

సుశీల తిట్లకి పట్టరాని కోపంతో సింగయ్య రోటి దగ్గర మూలన వున్న రోకలి తీసుకుని తలమీద కొట్టాడు.

సుశీల రోకలికి చేతులు అడ్డం పెట్టింది. అయినా దెబ్బ తగిలింది.

ఆ దెబ్బకి సుశీల 'అమ్మా' అని అరిచి నేలమీద పడిపోయింది.

తగాదాని బయట వుండి వింటున్న జనం సింగయ్య కొట్టిన వెంటనే లోపలికి వచ్చారు.

తల అంతా రక్తం! నేల అంతా రక్తం! శరీరం అంతా రక్తం! బట్టలన్నీ రక్తసిక్తమై పోయాయి.

"తలకాయ పగిలిందిరా! ముగ్గురు బిడ్డల తల్లి! ఆ బిడ్డలు అన్యాయం అయిపోతారు. ఆస్పత్రికి తీసకపోదాం పట్టండ్రా" అని జనం అప్పటికప్పుడే అన్నారు.

"మీరెవుర్రా పెద్ద మొగోళ్ల మాదిరిగా వచ్చారు. ఏం కాదులే, దొంగముండ, దొంగ ఎత్తు ఏస్తంది" అని కోపంతో తిడుతూనే సింగయ్య పూనకం వచ్చినవాడి మాదిరిగా వూగిపోతున్నాడు.

"ఎవుడ్రా నువ్వు మనిషివా, దున్నపోతువా. తలకాయ చూడు ఎంత లావున పగిలిందో. ఎంత నెత్తురు కారిపోతుంది. అట్టంట్రా నువ్వు కొట్టేది. ఆస్పత్రికి తీసక పోదాం కానియ్యండ్రా" అని జనం సింగయ్యని తిట్టి, సుశీలని ఆస్పత్రికి తీసుకుపోయారు.

ఆ ఆస్పత్రిలో వుండే ఆర్‌ఎంపి డాక్టరు ఆ గాయాన్ని శుభ్రం చేసి కుట్లు వేశాడు. తొమ్మిది కుట్లు పడ్డాయి.

కుట్లు వేసిన తరువాత గాయం తగ్గడానికి మందులు రాసి ఇచ్చాడు. మందుల షాపు అక్కడకి దగ్గర్లోనే వుంది. విజయమ్మ వెళ్ళి ఆ మందులు తెచ్చింది.

ఇంజక్షను చేసిన తరువాత ఇంటికి తీసుకుపొమ్మన్నాడు డాక్టరు.

"ఇంటికి పోదాం పద అమ్మాయి" అంది విజయమ్మ.

"వద్దు అక్కాయ్! నేను ఆ ఇంటికి పోను. ఈసారి నన్ను చంపుతారు. నేను మావూరు పోతాను" అంది ఏడుస్తూ సుశీల.

అక్కడ వున్న వాళ్ళకి కూడా సుశీల స్థితి చూసి జాలికలిగింది.

"చేతులు అడ్డం పెట్టబట్టి బిడ్డ బతికిపోయింది కానీ లేకపోతే బిడ్డ చచ్చిపోవాల్సింది. అంత లావు రోకలి తీసుకుని కొడితే బిడ్డ బతకటానికేనా? " అంది ఒకావిడ.

"మొద్దుగాడిదకొడుకు! ఇరం పరం తెలియదు"

"చేతులు అడ్డం పెట్టడంతో దెబ్బ తేలిగ్గా తగిలిందిలే, లేకపోతే తలకాయ రెండు వక్కలు కావాల్సింది కదూ. ఆ బండోడి దెబ్బకి ఎప్పుడో ఈ పిల్ల చచ్చిపోయినా చచ్చిపోయిద్ది" అన్నాడు ఒకాయన.

"అసలు ఆ ఇంటికి పోనంటందిగా. ఏం చేద్దాం? " అంది విజయమ్మ.

"తీసకపోయి వాళ్ళ వూళ్ళో వదిలిపెట్టి వద్దాం. ఏది అయితే అది అయిద్ది" అన్నాడు అంతకుముందు మాట్లాడిన మనిషే.

అందరూ కలిసి మాట్లాడుకున్నారు. సుశీ

లని అడిగారు. సుశీల గట్టిగానే పుట్టింటికి వెళ్తానంది.

"అదే మంచిదమ్మాయి. వీళ్ళ దగ్గర ఎందుకు పడివుంటం. ఊపిరి వుంటే ఉప్పు గల్లు అమ్ముకుని బతకొచ్చుంట. మీ పుట్టింటికి పోవటమే నయం. ఎక్కడైనా నీ కూలి నీకు తప్పదు" అంది విజయమ్మ.

★ ★ ★

విజయమ్మ భర్త ఆరోజు పని మానుకుని సుశీలనీ, పిల్లల్నీ వదిలిపెట్టి రావడానికి బయలుదేరాడు.

నాసరయ్యకీ, నాగార్జునకీ అక్కడ జరిగిన విషయం అంతా చెప్పాడు.

"మా బిడ్డ మాకు ఎక్కువ అయిద్దంటలే" అన్నాడు నాసరయ్య సంకోచిస్తూనే ఏదో మాట్లాడాలి కాబట్టి.

నాగార్జున భార్య రమాదేవి కూడా వుంది. "ఎక్కువ అయ్యేదేంది? మన బిడ్డ మనకి ఎక్కువ కాదని ఇంటో పెట్టుకుంటామా ఏంది? " అంది.

కోడలిని చూస్తే నాగార్జునకీ, నాసరయ్యకి కూడా హడలే!

రమాదేవి ఇద్దరు మనుషుల పెట్టు పని చేస్తుంది. ముగ్గురు మనుషుల పెట్టు తిండి ఒక్కతే తింటుంది. నలుగురు మనుషుల పెట్టు మాట్లాడుతుంది. ఐదుగురు మనుషుల పెట్టు పోట్లాడుతుంది.

తినడం, పనిచేయడం, మాట్లాడటం, పోట్లాడటం వేటికీ వెనుకాడదు.

"అది కాదమ్మాయి..." అని నాసరయ్య సంజాయిషీ ఇవ్వబోతున్నాడు.

ఆయనని పూర్తిగా మాట్లాడనివ్వకుండానే రమాదేవి గయ్‌మని లేచింది. "మొగుడూ పెళ్ళాలూ అన్న తరవాత పోట్లాడుకోకుండా వుంటారా, తిట్టుకోకుండా వుంటారా, కొట్టుకోకుండా వుంటారా? మొగుడు కోపంలో ఒక దెబ్బ వేశాడని అలిగి పుట్టింటికి రావటమేనా? ఎంత నామర్దా యవారం! నాలుగు రోజులు ఇక్కడ వుండి వచ్చిద్దని చెప్పయ్యా!"

రమాదేవి వచ్చిన మనిషికి పోట్లాడినట్లే చెప్పింది.

"నేను పోను వదినా!" అంది సుశీల.

"పోనంటే యట్ట కుదిరిద్ది? పోకపోతే ఎక్కడ వుంటా? నువ్వు ఒక్కదానివే కాదు, ముగ్గురు బిడ్డలు కూడా వున్నారు. ఎవురి ఇంటి దగ్గర వుంటే ఎవురు వప్పుకుంటారు? " రమాదేవి ఇక్కడ వుండటం కుదరదనే విషయాన్ని పరోక్షంగా స్పష్టం చేస్తూ అంది.

"కోపతాపాలు ఎల్లకాలం వుంటయ్యా. నాల్రోజులకి కోపం చల్లారకుండా వుండిద్దీ నాలుగు రోజులు ఆగి అల్లుడ్ని వచ్చి అమ్మాయినీ, బిడ్డల్నీ తీసకపొమ్మని చెప్పయ్యా" అన్నాడు నాసరయ్య.

విజయమ్మ భర్తకి తిండి కూడా పెట్టలేదు. సుశీల మనస్సు చివుక్కుమంది. ఆయన వెళ్ళిపోయాడు.

అక్కడ జరిగిన విషయం విజయమ్మకి తప్ప అతను ఎవరికీ చెప్పలేదు. విజయమ్మ కూడా ఆ మాటలు ఎవరితో అనలేదు.

★ ★ ★

సుశీల పుట్టింటికి వచ్చి పదిరోజులు అవుతున్నది.

మొదటి నాలుగయిదురోజులూ రమాదేవి కొంచెం గౌరవంగానే వుంది. తరువాత నెమ్మది నెమ్మదిగా సుశీలనీ, పిల్లల్ని చీదరించుకుంటోంది. మాటిమాటికీ విదిలించి కొడుతున్నది. ఒక్కోసారి తిడుతున్నది.

సుశీల వదిన దగ్గర అణకువగా వుంటోంది. వదిన చేతికి పనితగలకుండా ఇంట్లో పని అంతా తనే చేస్తున్నది.

సుశీల తల్లి రాగమ్మ వుంటే పరిస్థితి




ఎలా వుండేదో! ఇప్పుడు సుశీల పరాయి ఇంట్లో వున్నట్లు మసలుకుంటోంది.

రమాదేవి వాళ్ళని సహించలేకపోతున్నది. ఎప్పుడెప్పుడు ఇంట్లోనుంచి పంపిద్దామా అని ఆమె ఆలోచిస్తున్నది.

సుశీలని పంపించే విషయంలో నాగార్జునా, నాసరయ్యా మౌనంగా వున్నారు. సుశీల కూడా ఆ ప్రస్తావన తీసుకురావడం లేదు.

"మీ చెల్లెల్ని ఇంక పంపించవా ఏంది? ఇంట్లో పెట్టి ఎన్నిరోజులు సాక్కుంటా?" రమాదేవి అడిగింది నాగార్జునని.

"సాక్కునేదేందే? ఏం మాటలూ! నాలుగురోజులు ఆగితే వాడే కుక్క మాదిరిగా వచ్చి పెళ్లాన్నీ, బిడ్డల్నీ తీసకపోతాడు"

"వాడు రాడయ్యా, వాడు ఎందుకు వస్తాడు?"

"ఎవురి కోసం వస్తాడేంది? వాడి పెళ్ళాం, బిడ్డలకోసం వస్తాడు. ఎందుకు రాడు?"

"వాడి అంతట వాడు పెళ్లాన్ని పంపించాడు ఏంది రావటానికి? ఈమె వాడికి చెప్పి వచ్చిందెట్టా? వాడు వచ్చి నైనంగా పెళ్ళాన్ని తీసకపొయ్యేవాడయితే ఈ గోలంతా ఎందుకు?"

"నాలుగు రోజులు చూద్దాం! వస్తాడా సరే సరి! లేకపోతే అప్పుడు పెద్ద మనుషుల్ని తీసకపోయి తేలుద్దాం" అన్నాడు నాగార్జున.

రమాదేవి ఆ రోజుకి ఏం మాట్లాడకుండా వుంది. రోజురోజుకీ సుశీలమీదా, పిల్లల మీదా అసహనం పెంచుకుంటోంది. తొందరగా పంపించాలని చూస్తున్నది.

తరువాత నాగార్జున మీదకి ఒకసారి లేచింది. "దిక్కుమాలిన సంత... మాయదారి సంత... గుంపు అంతా వచ్చి మన ఎదానపడితే మనం ఎక్కడ తెచ్చిపెడతాం? వాడు వస్తాడంట. ఏందీ వాడు వచ్చేది? నువ్వో, మీ అయ్యో రేపోమాపో పోయి ఈ గుంపుని వదిలిపెట్టిరండి. రోజులు జరిగిన కొద్దీ వాడు బిగిసిపోతాడు. ఏదిపోయి ఎట్ట వచ్చినా మనకే నష్టం"

"రెండు మూడు రోజుల్లో మంచిరోజు చూసి మా అయ్యతోటి పంపిస్తా" అన్నాడు నాగార్జున.

★ ★ ★

తల్లిదండ్రుల్ని చూసి రావడానికి అంజమ్మ పుట్టింటికి వెళ్లి, సింగయ్య వాళ్ళ ఇంటికి కూడా వెళ్ళింది.

"కొడుక్కి మంచి అమ్మాయిని చూసి పెళ్ళి చేశావమ్మా మొత్తానికి! దొరక్క దొరక్క నీకు ఆ కుంటిది ఎక్కడ చిక్కింది. తెలిసి తెలిసీ మేం పోయి గోతిలో పడ్డాం చూడరాదూ!" అంది కాంతమ్మ.

"పెళ్ళయి ఇన్నేళ్లయ్యి, ముగ్గురు బిడ్డలు కలిగిన తరువాత ఏం మాటలు అప్పా అయ్యి. ఏం, పిల్లకి ఏం అయిందేంది?" అంది అంజమ్మ.

"ఏం కావాలి? ఉత్త పెడద్దరపు కొలిమి అయితే! పెడద్దరానికి తోడు వుసూరు ముకాన్ది ఒకపని చేతవ్వా?"

"ఎందుకు చేతకాదు? మనకి నచ్చనప్పుడు నచ్చని మాటలు వస్తంటయ్యి. కానీ పిల్లకి చేతకాని పని వుందాంట?"

"పిల్లలు బాగున్నారా?" అని అప్పుడే వచ్చిన అంకమ్మ అడిగింది.

పిల్లలు అంటే సుశీల పిల్లలు.

"ఏం బాగుంటంలే. ఆ కోడలు రాకాసిది. తల్లి వుంటే ఎట్టుండేదో కానీ ఆ కోడలు ఎందుకు చూసిద్ది వీళ్ళని"

"దాని మదం అణగాల్లే. మంచిగా వుండే వాళ్ళకి రోజులు కాదు ఇయ్యి" అంది సుబ్బమ్మ.

"అది కాదురా. ఒకవేళ ఆ పిల్లే తప్పు



చేసిందనుకో. అయినా దండించేదానికి అద్దు వుండొద్దంట్రా? రోకలి తీసుకొని తల కేసి కొడితే బతకుతారూ! పెద్ద దెబ్బ తగ ల్లేదు. కాబట్టి బతికిపోయావు. కానీ లేక పోతే ఏమయ్యేది. అది చచ్చేదీ, నిన్ను పోలీసులు పట్టుకపోయేవాళ్లు, పిల్లలు బజార్న పడేవాళ్లు"

"నోటికి ఏమాట వస్తే ఆ మాట కూసింది పిన్నాం"

"అయినా అట్ట కొట్టకూడదయ్యా. ఇప్పుడు లోకులు నీదే తప్పంటున్నారు కానీ, ఆ పిల్లది తప్పని అనటం లేదుగా"

"లోకులు అనటానికేంలే!"

"సరే, జరిగిందేదో జరిగిపోయింది. కానీ, వచ్చి పెళ్లాం పిల్లల్ని తెచ్చుకో" సింగయ్యతో అంది అంజమ్మ.

"ఏం... వాడికి చెప్పి పోయిందేంది, వాడు వచ్చి తెచ్చుకోవడానికి? రాదలుచుకుంటే ఎట్టపోయిందో అట్నే వచ్చిద్ది" అంది సుబ్బమ్మ.

"తల్లిలేని బిడ్డ... ఎవురు పట్టించుకుంటారు అప్పా దాన్ని! పాపం అది నలిగిపోతంది అక్కడా... ఇక్కడా..."

"ఏం మాయరోగం నలిగిపోవడానికి? " అంది కాంతమ్మ.

"రాయ్యా! నాతోటి రా పోదాం. పిల్లలు కూడా నానా నానా అని కలవరిస్తున్నారు. వాళ్ళు దిగులుపడిపోయారు. ఎప్పుడూ ఎత్తుకుని తిప్పేవాడివైతివీ!"

"నేను రాను పిన్నాం! వాళ్ళనే రమ్మను" అన్నాడు సింగయ్య.

అంజమ్మ బతిమాలినా సింగయ్య కద ల్లేదు.

అంజమ్మ తిరిగివచ్చిన తరవాత సుశీలకి జరిగిన విషయం అంతా చెప్పింది అందరి సమక్షంలో.

"నేను అప్పుడే చెప్పలా ఆ అబ్బాయి రాడని! రావడానికి ముకం ఎట్ట చెల్లిద్దిలే. రేపు నువ్వు తీసకపోయి వదిలిపెట్టిరా" అంది నాసరయ్యతో కోడలు రమాదేవి ఆజ్ఞాపిస్తున్నట్లుగానే.

సుశీల పరధ్యానంగా దిక్కులు చూస్తూ వుంది.

రమాదేవి నాగార్జునని వత్తిడి చేయడంతో నాసరయ్య మరుసటిరోజు సుశీలనీ, పిల్లల్నీ సింగయ్య వాళ్ళ వూరు తీసుకువచ్చాడు.

"మాకు ఎదురు తిరిగి మాట్లాడేది మా ఇంట్లో ఎందుకు? కుక్క మాదిరిగా పడి వుండే పనయితే ఇక్కడ వుండమను. లేక పోతే నీతోపాటు తీసకపో. మొగుడంటే భయం, భక్తి లేకుండా ఎంతమాట పడితే అంతమాట అంటంటే ఏంది ఇంకా? "

"తెలిసీతెలియని పిల్ల..."

"ఏం తెలియదూ. ముగ్గురు బిడ్డల్ని కన్న మనిషికి తెలియదంటనే. ఊళ్ళో జనానికి వీడు కొట్టిన దెబ్బలే కనపడ్డయిగానీ అది అన్న మాటలు కనపడ్డయ్యా? నోటికి పట్ట రాని మాటలు మాట్టాడిద్దయితే ఏం తెలియని నంగ అంటనే" అంది సుబ్బమ్మ కోపంగా.

వాళ్ళని వదిలి నాసరయ్య తన వూరు వెళ్ళిపోయాడు.

★ ★ ★

రోజులు మామూలుగా దొర్లిపోతున్నాయి.

సుశీలకి పుట్టింట్లో కూడా ఆదరణ లేదని తెలిపోవడంతో సింగయ్య పేట్రేగిపోయాడు.

వారానికీ, పదిరోజులకీ, రోజుమార్చి రోజు సుశీలని కొడుతున్నాడు. కనపడని దెబ్బలు సుశీల శరీరంమీద పడుతున్నాయి.

ఎదురుతిరిగి మాట్లాడితే అదనంగా దెబ్బలు పడుతున్నాయి మినహాయించి మరో ప్రయోజనం లేదు.

'అయ్యో పాపం' అని విచారపడటం తప్ప అంతకుముందు మాదిరిగా విజయమ్మ వాళ్ళు జోక్యం చేసుకోవడంలేదు. 'మనం జోక్యం చేసుకుని ఏం చేయగలం?' అనే నిరాశతో వాళ్ళు పట్టించుకోవడం మానేశారు.

ఒకరోజు ఎవరిదో కర్మ అయితే కాంతమ్మ అక్కడకి వెళ్ళడానికి తయారై, కమ్మలు చూసుకుంది. అవి లేవు.

ఎప్పుడూ వాటిని ఒకచోట దాచిపెడుతుంది. ఆందోళనతో కాంతమ్మ మళ్ళీ మరోసారి వెదికింది. కనపడలేదు.

"అప్పా... కమ్మలు ఏమన్నా తీసా, కనపట్టంలేదు" సుబ్బమ్మని అడిగింది.

"నేను ఎందుకు తీస్తానే? నాకేం పని వాటితో!"

"మరి ఏమైనట్టు?"

"ఏమో... ఎక్కడ పెట్టావో ఎతుకులాడుకో సరిగా" అంది సుబ్బమ్మ.

కాంతమ్మ మళ్ళీ మరోసారి చూసింది. అయినా కనపడలేదు.

"ఎప్పుడూ పెట్టే దగ్గరే పెట్టానప్పా. ఇందాకట్నుంచీ ఎతుకులాడతంటే కనబడకపోతంటే"

అంకమ్మ కూడా ఆందోళనగా వచ్చింది. అందరూ కలిసి చూశారు.

"ఎవురో కాజేశారప్పా లేకపోతే ఏమవుతయ్యి? నేను పదేళ్ళనించీ అక్కడ్నే దాచిపెడతన్నా. కానీ ఇంకోచోట దాచిపెట్టుకోవటంలా? ఎవురో కనిపెట్టి కాజేశారు" అంది కాంతమ్మ ఏడుస్తూ.

కాంతమ్మకి ఉన్న స్థిరాస్థి ఆ కమ్మలే. పదిగ్రాములు వుంటాయి.

విడిగా ఎప్పుడూ పెట్టుకోదు. పెళ్ళిళ్ళకీ, పేరంటాలకీ, అలాంటి అవసరమైన కార్యాలకి పెట్టుకుంటుంది. వచ్చిన వెంటనే తీసి చిన్న మూట కట్టి, ఆ మూటని చిన్న డబ్బాలో పెట్టి, ఆ డబ్బాకి మళ్ళీ మూటకట్టి, మూలలో వున్న చిన్న కుండలో పెట్టి, ఆ కుండమీద రెండు మూడు కుండలు బోర్లించి పెడుతుంది.

అప్పుడప్పుడూ చూసుకుంటుంది. ఎప్పుడూ ఒకకంట కనిపెట్టే వుంటుంది.

"గుర్తు చేసుకోవే, అక్కడే పెట్టావా?" అంది సుబ్బమ్మ.

"అక్కడ పెట్టక ఇంక ఎక్కడ పెడతాను. నా బొందమీద. నాకు బాగా గుర్తే. ఐదా రోజులనాడు కూడా చూసుకున్నా, అప్పుడు వున్నయ్యి"

"ఎవురి పని అయివుండిద్దీ? మన ఇంటికి కొత్తోళ్లు ఎవురు వచ్చారు?"

"మనవాడు పూచికపుల్ల తాకడు. ఇరవై ఏళ్ళనించీ చూస్తన్నాం. గొంతుమీదకు అవసరం వచ్చి, గొంతు తెగిపడినా దొంగతనం చేయడు"

"వాడు తీశాడని ఎవురు అన్నారు?"

"పేకాట ఆడతాడు అనే కానీ దొంగతనం మాట ఎరగడు. మరి ఇంక ఎవురు తీస్తారు?"

అక్కా చెల్లెళ్ళు ముగ్గురూ ఆలోచించారు. తర్జన భర్జన పడ్డారు.

చివరికి సుశీలని దోషిగా నిలబెట్టారు.

సింగయ్య వచ్చాడు. విషయం అతనికి చెప్పారు.

"మన ఇంటో మనం ఎందుకు దొంగతనం చేసుకుంటామే? ఇంకెవురి పని? దానిపనే. అనుమానం లేదు. అది తప్ప ఇంకొకరు తీసివుండరు"

బయట పని చేసుకుంటున్న సుశీలని

పిలిచాడు సింగయ్య..

"ఏమే, నిజం చెప్పు... కమ్మలు ఏం చేశా? ఎక్కడ పెట్టా? "

"నాకేం తెల్సు? నాకెందుకు కమ్మలు? "

"మర్యాదగా చెపతావా, చెప్పు. నువ్వు తప్ప ఎవురూ తీసివుండరు!"

"తీస్తే నేనెక్కడ దాచిపెడతాను? "

"నిజం చెప్పు. ఇయ్యాల నువ్వు నా చేతిలో చచ్చావే"

"నా బిడ్డలమీద ఒట్టు. నాకే పాపం పున్నెం తెలియదయ్యా!"

"దొంగతనం చేసింది కాక బిడ్డల మీద ఒట్టు పెడతావంటే. మామూలుదానివి కాదే నువ్వు. గుండెలు తీసిన బంటువి. నువ్వు ఇట్ట చెప్పవులే" అని సింగయ్య కఱ్ఱ తీసుకున్నాడు.

"నీకు దణ్ణం పెడతా! నన్ను కొట్టవాకు నాయనా. నేనే పాపం పున్నెం ఎరగను దేవుడా" అని సుశీల పెద్దగా ఏడుస్తూ దణ్ణం పెడుతోంది. అయినా సింగయ్య కఱ్ఱ దించలేదు.

సుశీల శరీరంమీద వాతలు పడేలా కొట్టాడు.

ఇటీవల సింగయ్య చేతికి డబ్బు దొరకడంలేదు. చిల్లర బాకీలు ఎక్కువ అయ్యాయి. వాళ్ళు బాగా గొడవ చేస్తున్నారు.

ఊళ్లో వున్న బంకుల్లోనూ, చిల్లర కొట్లలోనూ, బండ్లమీద బజ్జీలు అమ్ముకునే వాళ్ళ దగ్గిరా చాలా అప్పు చేశాడు. కొద్దిగా పరిచయం వున్న ప్రతివాడి దగ్గరా చేబదులు తీసుకున్నాడు. వాళ్లు అందరూ సింగయ్యని బాకీలు చెల్లించమని వత్తిడి చేస్తున్నారు.

డబ్బు వచ్చే మార్గం ఏమీ కానరాక సింగయ్యే అంతకు నాలుగురోజులముందు కమ్మలు తీశాడు.

పెద్దమ్మా, పిన్నమ్మలకి తనమీద అనుమానం రాకుండా సుశీలని కొట్టడం మొదలుపెట్టాడు. సుశీల దెబ్బలు తింటుంటే వాళ్ళకి ఒకరకమైన తృప్తి.

ఒకవైపు కాంతమ్మ ఏడుస్తూ సుశీలని తిడుతోంది. మరోవైపు సుబ్బమ్మ సాధిస్తోంది.

అంకమ్మకి సింగయ్యమీద అనుమానం వున్నా, అక్కలు ఇద్దరూ ఆమె మాటని తోసిపుచ్చడమేగాక ఆమెని ఇంకా బాగా తిట్టారు. పెద్దవాళ్లు ఇద్దరికీ సింగయ్య తీసి వుంటాడని కనీసం అనుమానం కూడా లేదు.

ఒకరోజు కాదు, వరుసగా నాలుగురోజులు. ఉదయం, సాయంత్రం, రాత్రి- వీలున్న ప్రతిసారీ సుశీలని కొడుతూనే వున్నాడు సింగయ్య. సుశీల ఏడవటం, ప్రాధేయపడటం మినహాయించి మరేమీ చేయలేకపోతోంది.

ఐదవరోజు పొద్దున్నే ఇద్దరు బిడ్డల్ని రెండు చంకల్లో వేసుకుని, పెద్ద పిల్లని ఎత్తుకున్న చేత్తోనే బరబరా ఈడ్చుకుంటూ దగ్గరగానే వున్న బస్టాండుకి వెళ్ళింది.

ఇంట్లో ఎవరి పనుల్లో వాళ్లు వున్నారు. బస్సు వచ్చే సమయానికి సుశీల పిల్లలతో బస్టాండుకి మూడు నిముషాల్లో చేరుకుంది.

అదే సమయానికి బస్సు కూడా వచ్చింది. సుశీల ఇంకో ఆలోచన లేకుండా ముగ్గురు పిల్లలతో బస్సు ఎక్కింది.

★ ★ ★

మధ్యాహ్నానికి ఖాళీ కడుపులతో, పిల్లల ఏడుపులతో, చింపిరి తలలతో, చిరిగిన బట్టలతో పుట్టింటికి చేరుకుంది సుశీల.

ఇంటికి తాళంవేసి వుంది. అందరూ పొలం వెళ్ళారు.

పెద్ద పిల్లలు ఇద్దరూ ఆకలికి ఏడుస్తు




న్నారు.

పిల్లల ఏడుపులు విని ఎదురింటి ఆవిడ లోపలనుంచి బయటకు వచ్చింది.

"ఏం సుశీలా... ఇదేనా రావడం? " పలకరించింది.

"ఇప్పుడేను పెద్దమ్మా రావడం"

"మీ అన్నా, వదినా అందరూ పొలం పోయారు. మా ఇంటికిరా. పిల్లలు ఏడుస్తున్నారేంది? "

సుశీల పిల్లలతో వాళ్ళ ఇంటికి వెళ్ళింది.

"ఇదేంది సుశీలా... ఇట్ట వచ్చావేంది? కనీసం చేతిలో సంచి కూడా లేదే. అలిగి వచ్చావా ఏంది? "

"అమ్మా... బువ్వ తింటానే... ఆకలవతందే..." అని పెద్దపిల్ల అడుగుతూ ఏడుస్తోంది.

"పిల్లలు అన్నం కూడా తినలేదా ఏంది? ఉండు, అన్నం పెట్టుకుని వస్తా" అని ఆమె చకచకా ఇంట్లోకి వెళ్ళి, కంచంలో అన్నం పెట్టుకుని తీసుకువచ్చింది.

"ఎప్పుడు తిని వచ్చావో, ఏంపాడో! అసలు తినివచ్చావో, లేదో లేచి నువ్వు కూడా తిను" ఆమె అంది.

"నాకు ఆకలి లేదులే పెద్దమ్మా!"

"ఆకలి వుండేదేంది? లే, లేచి కాళ్లు కడుక్కో!" అని ఆమె సుశీలని బలవంతంగా లేపింది.

సుశీల లేచి కాళ్లు కడుక్కుని ఆవురావురమంటూ అన్నం తిన్నది.

"ఎంత ఆకలిమీద వున్నావమ్మా. ఆకలి లేదూ. ఎన్నిరోజులవతంది నువ్వు అన్నం తిని. నిజం చెప్పు. తగాదా పడిందికదూ. నువ్వు అలిగేవచ్చావు. కనపట్టంలా..."

సుశీల మౌనంగా వుంది.

"ఏందో సుశీలా... నిన్ను చూస్తంటే దిగులు వేస్తందే. ఎట్ట వుండేదానివి ఎట్ట అయ్యావు. చిన్నప్పుడు ఎంత తెలివిగా, చురుగ్గా వుండేదానివి. ఆ తెలివీ, చురుకూ ఏమైపోయాయి? నీకారు పిల్లలకి కొంత మందికి పెళ్ళిళ్ళే కాకపోయా, నీకు ముగ్గురు బిడ్డలు కూడా పుడితిరి" అంది ఆమె.

కడుపునిండా అన్నం తిన్న పిల్లలు ఆడుకుంటున్నారు.

"మన ఆడోళ్ళ జాతకమే ఇంత సుశీలా. మంచి మొగుడు దొరికితే బాగానే వుండిద్ది. సన్నాసోడు దొరికితే వాడి జీవనానికి పడి మనం జీవితాంతం ఏడవాలి. మా చెల్లెలు కూతురు బతుకు కూడా ఇంతే అయింది. దాని మొగుడికి పెద్ద ఉద్యోగం. అయినా ఏం లాభం? దయిద్రపు గుణం. తాగడం, పేకాడ్డం, రోజూ దీన్ని పట్టుకుని చావగొట్టడం. నీలాంటి పిల్లేనమ్మా ఆ అమ్మాయి కూడా. ముత్యంలాంటి పిల్ల" అని ఆమె చాలా విచారపడింది.

ఆమే మళ్ళీ అంది. "నీ పని చూస్తే అక్కడ అట్ట వుంది. ఇక్కడ మీ అమ్మ లేక పోయా. ఇంక ఇక్కడ మాత్రం నిన్ను తాకి తలుచుకునేవాళ్ళు ఎవురున్నారు? మీ అయ్యా, అన్నా వుండి కూడా లాభంలేదు. మీ వదిన్ని చూస్తే బయంతో వణికి చావాల్సిందే. అది గీసిన గీటు దాట్టానికి ఈల్లేదు. మహారాణి అయిపోయిందనుకో మీ వదిన. ఆమె దెబ్బకి నాలుగు వూళ్ళ జనం గెలియలేరు"

సాయంత్రానికి పొలం వెళ్ళిన వాళ్లందరూ వచ్చారు.

సుశీలనీ, పిల్లల్నీ చూడటంతోనే రమాదేవి ముకం చిట్లించుకుని లోపలికి వెళ్ళిపోయింది. నాగార్జున కూడా వచ్చాడు. కానీ చెల్లెల్ని పలకరించలేదు.

నాసరయ్య అడిగాడు. "ఎప్పుడు వచ్చావమ్మా? ఏమైంది? "

సుశీల ఏడుస్తూ జరిగిన విషయం అంతా



చెప్పింది.

"దొంగ లం... కొడుకు! అలాంటివాడికి పిల్లని ఇయ్యడమే పొరపాటు! మీ అత్తలు ఆడయ్యికాదమ్మా, రాచ్చసులు! గొడ్డుబోతు ముండలు... పిల్లాజెల్లా? వాటికేం తెలుసు బాధలు?" అని నాసరయ్యా చాలాసేపు వాళ్ళని తిట్టాడు.

సుశీల కల్పించుకుని మాట్లాడినా రమాదేవి ముక్తసరిగా "ఆ... ఊ..." అంది.

మరుసటి రోజు ఉదయం సుశీలా, పిల్లలూ అన్నాలు తిన్న తరువాత రమాదేవి అంది. "ఒక గిన్నెలో అన్నం బయటపెట్టుకో నీకూ, పిల్లలకీ! నేను ఇంటికి తాళం వేసుకుని పొలం పోవాలి!"

"ఈ పూట తిన్నాంగా! మజ్జెన్నం పిల్లలు తినర్లే! తాళం వేసుకుని పోవదినా!" అంది సుశీల.

ఏమనుకున్నదో రమాదేవి ఒక గిన్నెలో అన్నం పెట్టి, ఆ గిన్నెని బయట గూట్లో పెట్టి, ఇంటికి తాళం వేసుకుని, పొలం వెళ్ళిపోయింది.

సుశీల పిల్లల్ని తీసుకుని ఎదురింటికి వచ్చింది. ఎదురింటి ఆమె పేరు సౌభాగ్యమ్మ. ఆమె ఇంటి దగ్గరే వుంటుంది.

"ఏమందమ్మాయి మీ వదిన?"

"ఏమనిద్ది? ఇంటికి తాళం వేసుకుని పొలం పోయింది పెద్దమ్మా!"

"ఇంట్లో ఏం వజ్రవైడూర్యాలున్నయ్యంట! ఇంటికి తాళం వేసుకుని నిన్నూ, పిల్లల్నీ ఎక్కడ వుండమనీ? రోడ్డుమీద వుంటారూ... చుప్పనాతి మనిషీ, చుప్పనాతి బుద్దులూ! ఇంకొకరి పొడ గిట్టదు! మీ అన్న ఏం అనలా?"

"ఏం మాట్టాడలా!"

"నేను నిన్ననే చెపితినే, ఆ పిల్లకి ఎదురు లేదు!"

సౌభాగ్యమ్మ భర్త పొలంనించి వచ్చి కాళ్ళు కడుక్కున్నాడు. "కందికి ఏం పడినా పడిందే పురుగు! ఎంత మందు పోసినా పురుగు చావటంలేదు. నిన్న మందు యేసామా? ఇయ్యాల చూస్తే అంతా పురుగే! చాలా మంది కూలోళ్ళని పెట్టి ఏరిస్తన్నారు! మనకి కూడా కూలోళ్ళని పెట్టి ఏరిద్దామంటే దొరకలా! ఎట్ట చెయ్యాలో, ఏం పాడో!" అన్నాడు ఆయన.

వాళ్ళది అంతా దగ్గిర పొలమే.

"నేను ఏరతా పెద్దమ్మా పురుగు! నాకు తోడు ఇంకొక మనిషిని చూడండి!"

"ఏరుకో అమ్మాయి, అంతకంటే కావాల్సిందేం వుంది? వంద పురుక్కి రెండ్రూపాయలు! నువ్వు ఎన్ని వందల పురుగు ఏరుకుంటే అన్ని రెళ్ళు! పురుగు మీద కొంతమంది తెగ సంపాయిస్తున్నారు!" అన్నాడు ఆయన.

తరువాత రోజు వుదయమే పిల్లలకి అన్నం పెట్టి వాళ్లని ఎదురింటి దగ్గర వదిలిపెట్టింది సుశీల. "పురుగు ఏరటానికి పోతన్నా పెద్దమ్మా. పిల్లలకి గిన్నెలో అన్నం పెట్టా! ఆకలైతే వాళ్ళే తింటార్లే! మజ్జెన్నం వచ్చి చిన్నదానికి పాలిచ్చిపోతా! కొద్దిగా వాళ్ళని కనిపెట్టి వుండు, ఎటన్నా పోతారేమో!" అని ఆమెకి చెప్పి పొలం వెళ్ళింది.

సాయంత్రానికి సుశీల 45 వందల పురగు ఏరింది. 90 రూపాయలు వచ్చాయి. దాదాపు 2 రోజులు సుశీల నిద్రాహారాలు లేకుండా వాళ్ళ కందిచేలోనే జీవించింది. రోజుకి 50 నించి 100 రూపాయల వరకూ సంపాదించుకుంది.

"నీ వడుపు ఎవురికీ వుండదు సుశీలా! అందరూ 10 రూపాయలకి పురుగు ఏరతంటే నువ్వు 20 రూపాయలకి ఏరతంటివీ! అందరూ 20 రూపాయలకి ఏరితే నువ్వు





40 రూపాయలకి ఏరితివీ!" అని సౌభాగ్యమ్మ సుశీలని చాలాసార్లు మెచ్చుకుంది.

★ ★ ★

రమాదేవి బాగా తిండిపోతు మనిషి. సుశీలా పిల్లలూ వుండటం ఆమెకి అడ్డంగా భావించింది.

సుశీలని భర్త వద్ద వదిలిపెట్టి రమ్మని రోజూ నాగార్జునని గొడవచేస్తున్నది. నాగార్జునకి కూడా చెల్లెలూ, ఆమె పిల్లలూ తన ఇంట్లో వుండటం ఏమీ ఇష్టంలేదు.

"ఏందమ్మాయి సుశీలా... మొన్న మన వూరి వాళ్ళకి మీ ఆయన కనపడి నిన్ను రమ్మని కబురు చేసాడు. ఎన్ని రోజులు వుంటా ఇక్కడ? ప్రయాణం కా... తీసక పోయి వదిలిపెట్టి వస్తా!"

"నేను వెళ్ళను అన్నా ఇంక! అక్కడికి పోయి రోజూ. నేను ఎక్కడ తన్నులు తినేది?

"అదేందమ్మాయి, ఆ మాట అంటావు! ఆ అబ్బాయి దగ్గరకి పోకపోతే ఎక్కడ వుంటా? " అన్నాడు నాసరయ్య.

"అయ్యావి! నువ్వు అనదగ్గ మాటేనా అది? నేను ఇక్కడ వుండక్లే అయ్యా, మీ అందరికీ ఎందుకు బాధ? ఏ చెట్టుకిందో, సత్రవలోనో వుంటాలే! ఇంత వూళ్ళో నాకూ, నా బిడ్డలకీ జానెడు చోటు దొరకదూ!" అంది సుశీల కన్నీళ్ళతో.

భర్త కొట్టిన దెబ్బలకంటే తండ్రి అన్న మాటే సుశీలకి కష్టంగా అనిపించింది.

"సరేసరే... నీ సోలెడు నువ్వు వండుకో తల్లీ! నీకు నేను ఎక్కడ వండిపెట్టేది? " అంది రమాదేవి చిరాకుగా, అసహ్యంగా చీదరించుకుంటూ.

సుశీలకి సౌభాగ్యమ్మ పాతవి రెండు మూడు గిన్నెలు ఇచ్చింది. రెండు వందలు పెట్టి తనకి అవసరమైనవి చిన్నచిన్న వంట పాత్రలు కొనుక్కుంది.

మరోదారిలేక సుశీల ఆ ఇంట్లోనే తనలో తనే కుమిలిపోతూ వేరేగా వండుకుని తింటున్నది.

రమాదేవి ప్రతిరోజు ఉదయం టిఫిన్ చేసుకుని తింటుంది. పిండివంటలు కూడా ఎక్కువగా చేసుకుంటుంది. సుశీల పిల్లలు వచ్చిన తరువాత అవి తగ్గించింది.

తినే నోరు ఊరుకోదు. ఎంత తగ్గించినా అప్పుడపుడూ చేసుకుంటున్నది.

పిల్లలకి పెట్టకపోతే బాగుండదని వాళ్ళు వచ్చిన మొదట్లో తను చేసుకుంటూ వాళ్ళకి కొద్దిగా పెట్టేది.

ఒకటే పొయ్యి! రమాదేవి ఏదైనా చేసుకోవడానికి పొయ్యి దగ్గర కూర్చుంటే పిల్లలు అక్కడ ప్రత్యక్షమయ్యేవాళ్ళు!

"అత్తా... మాకు పెట్టవా... తియ్యి!" అని పెద్దపిల్ల రమాదేవిని అడిగి పెట్టించుకుని తింటుంది. ఆ పిల్ల వెంట రెండోపిల్ల చేయి చాపుతూ.

"మరపటం తెలికే కానీ మాన్పటం కష్టమంట! ఈ గుంపుకి అలవాటు చేస్తే అసలు తనని తిననిస్తారూ!" అనుకునేది రమాదేవి.

అప్పటికీ సుశీల ఆ పిల్లల్ని కొట్టి బయటకి పంపించడమో, తనే వాళ్లని బయటకు తీసుకుపోవడమో చేసేది.

"ఇదేంది పీడాకారపు గుంపు మనకి దాపరించారు! మన ఇంటో మనం సుకంగా తినకుండా ఎన్ని రోజులు నోరు కట్టేసుకుంటాం? లేకి గుంపు మన ఎదాన వచ్చి పడ్డారేందంట!" అని రమాదేవి తిట్టేది.

వాళ్ళని ఇంట్లోనుంచి పంపించమని నాగార్జునకి చెపుతున్నా ఏమీ చేయలేకపోతున్నాడు. వాళ్లని గురించి వీళ్ళకి తగాదా!

"ఛ... వాళ్ళ గురించి తనకి కాపురంలో ఎందుకు తగాదా? వాళ్ళని పంపిస్తే తనకి ఏ గొడవా వుండదు!" అని రమాదేవి గట్టిగా అనుకుంది.

రమాదేవి అరిసెలు చేసుకుంది. అవి ఇంట్లో దాచిపెట్టుకుని తింటున్నది.

నాగార్జున రెండు అరిసెలు తీసుకుని తింటూ, అవి వున్న క్యారేజీకింద పెట్టాడు. అంతలో ఎవరో పిలిస్తే బయటకి వెళ్ళిపోయాడు.

రమాదేవి ఇంటిముందు పళ్ళుతోముకుంటున్నది.

సుశీల పెద్దకూతురు అరిసెలు చూసి, రెండు చేతులనిండా, వడి నిండా తెచ్చుకుని ముక్కలు ముక్కలు చేసి ఆడుకుంటూ తింటున్నది.

బయటవున్న రమాదేవీ, సుశీలా ఒక్కసారే ఇంట్లోకి వచ్చారు.

సుశీల పెద్దకూతురు దగ్గర అరిసెలు చూసిన రమాదేవి స్థాణువైపోయింది. తను దాచిపెట్టుకుని రహస్యంగా తింటున్న అరిసెలు! పట్టరాని కోపం వచ్చింది.

ఒక మూలలో వున్న సుశీల సామాన్లు మొత్తం బయటకు విసిరి కొట్టింది. "మీరెవురే నా ఇంట్లో వుంటానికి? ముందు బైటికి పొండి! పోనియ్యిలే, పోనియ్యిలే అని మంచిగా వుంటంటే నెత్తికెక్కి ఆడతన్నారు! నా గడప తొక్కితే కాళ్ళు యిరక్కొడతా! ముందు బైటికి పొండి!" అని పెద్దపెద్దగా తిట్లకు లేచింది.

నాగార్జునా, నాసరయ్యా కూడా వున్నారు. వాళ్ళు ఏం మాట్లాడలేదు.

"ఒక గుడిసె వెయ్యి అయ్యా! పిల్లల్ని పెట్టుకుని మనిద్దరం యేరుగా వుందాం!" అంది తండ్రితో సుశీల, తండ్రి మనసు మారకపోతుందా అనే ఆశతో.

"ఏరుగా నేను ఎట్ట వుంటానమ్మాయి! కొడుకుని వదిలిపెట్టి నీ దగ్గిర వుండమంటా? నీ దగ్గిర నేను ఎందుకు వుంటాను? లోకులు నోట్లో వూస్తారు! ఎప్పుడైనా నేను వీడి దగ్గర వుండాల్సిందే!" అన్నాడు నాసరయ్య.

"ఎట్ట అయ్యా? "

"నువ్వు మీఆయన దగ్గిరకి పో!"

"నేను పోనుకానీ, నావరకన్నా చిన్న గుడిసె వేసిపెట్టు అయ్యా!"

"గుడిసె వెయ్యాలంటే కప్పు, బొంగులూ ఇప్పుడు ఎక్కడ దొరుకుతయ్యి? నరసమ్మగారి గుడిసె ఖాళీగా వుంది. అందులో వుండండి. వాళ్ళు ఇల్లు కట్టుకున్నారు. ఇంక ఆ గుడిసెతో పని వుండదు. అంతగా అయితే వాళ్ళకి అద్దె ఇద్దువు!"

నరసమ్మని కనుక్కుని, సుశీల తన ముగ్గురు బిడ్డలతో వాళ్ళ వూరిగుడిసెలో వేరుగా వుంటున్నది.

కోడలు తిడుతున్నా, చీదరించుకుంటున్నా నాసరయ్య కొడుకు దగ్గిరే వుంటున్నాడు. ప్రతిరోజూ కూలికి వెళతాడు. ఆ కూలి డబ్బులు తీసుకొచ్చి కొడుక్కో, కోడలికో ఇస్తాడు.

అత్తల్నీ, భర్తనీ వదిలిపెట్టి వాళ్ళకి దూరంగా వుండటమే సుశీలకి ఆనందంగా, సంతృప్తిగా వుంది.

సుశీలకిప్పుడు 20 సంవత్సరాల వయస్సు వుంటుంది!

అప్పుడే ఆ అమ్మాయి జీవితంలో ఎన్ని అనుభవాలు! ఎన్ని అవమానాలు! ఎన్ని పరాభవాలు! ఎన్ని ఎదురు దెబ్బలు ఎన్ని మానసిక, శారీరక గాయాలు! ఎంత చాకిరి!

చివరికి ఈ సుశీల ఏమవుతుంది? ఏమవబోతోంది?

జవాబు చెప్పేదెవరు? ముగింపు రాసేదెప్పుడు?



# ఏరిన ముత్యాలు

☆ జీవితం ఒకనాటకశాల. అతిచెడ్డవారు అత్యంత మంచి స్థానాలను అలంకరించే చోటు.

-విలియంఇన్గి

☆ బాధ మనిషిని ఆలోచనాపరుణ్ణిచేస్తుంది. ఆలోచన మనిషిని వివేకవంతుణ్ణి చేస్తుంది. వివేకం బ్రతుకును దృఢంగా ఉంచుతుంది.

-జాన్ పాట్రిక్

☆ మీకు 30 మిలియన్‌మంది దేవుళ్ళలో నమ్మకం ఉండి, ఆత్మవిశ్వాసం లేనట్లయితే మీకు ముక్తిలేదు.

-స్వామి వివేకానంద

☆ ఎల్లప్పుడు అజ్ఞానమునుంచే భయం వెలికి వస్తుంది.

-ఎమర్సన్

☆ భూమిపైన సాహసానికి గొప్ప పరీక్ష ఏదంటే హృదయ స్థైర్యాన్ని కోల్పోకుండా పరాజయాన్ని భరించగలగటమే.

-ఇన్‌గర్‌సాల్

☆ సరిదిద్దటాన్ని అలక్ష్యంచేసి తగినంత ఆలోచన, సంసిద్ధత లేకుండా వేగిరపడిపోవటం తెలివితక్కువపని.

-నెహ్రూ

☆ న్యాయం గెలుస్తుందన్నమాట నిజమేకాని, గెలిచేదంతా న్యాయం కాదు.

-శ్రీశ్రీ

☆ తమ అజ్ఞానాన్ని తెలుసుకోవడమే నిజమైన జ్ఞానం.

-సర్వేపల్లి రాధాకృష్ణన్

☆ ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలనే కోరిక, దాన్ని మార్చాలన్న కోరిక, ఈ రెండూ మానవ ప్రగతికి ప్రధాన ప్రేరకాలు.

-రస్సెల్

☆ మనుషులను గాయపరచటం ఎంత తప్పో, మనసులను గాయపరచటం కూడా అంతే తప్పు.

-సోక్రటీస్

☆ ఉపయోగపడని శాంతికంటే, ఉపయోగకరమైన సంఘర్షణ మేలు.

-గోర్కి

☆ ఇంటిపైకప్పు సరిగ్గా లేకపోతే వర్షం ఏవిధంగా లోపలికి కురుస్తుందో, వికాసం చెందని బుద్ధిలోకి ఆశా మోహాలు అదేవిధంగా దూరుతాయి.

-గౌతమబుద్ధ

సేకరణ: పట్నం శేషంశెట్టి




# లేఖా సుందరి

అమెరికాలోని 'సిన్సిన్నాటి'లో ఫెడరల్ ఎక్స్‌ప్రెస్ అనే కొరియర్ సర్వీస్‌లో పనిచేసే 25 సంవత్సరాల ఎరికా ఎండర్సన్ అనే ఈమెకు 75 దేశాల్లో 278 పెన్‌ఫ్రెండ్స్ ఉన్నారు. వారికి ఉత్తరాలు రాస్తూ కూర్చోడానికే ఆమెకు రోజుకు ఆరు గంటలు ఖర్చవుతోంది. ఇంతవరకూ నాలుగు టన్నుల బరువుగల 33,800 ఉత్తరాలొచ్చాయి ఆమెకు.

# చతుర ప్రపంచం

## క్రీడాకారిణి కష్టసుఖాలు

ఇండియాలో అతిపొడవైన వాలీబాల్ క్రీడాకారిణి కుమారి శ్రీమతి. ఆమె పొడవు 5 అడుగుల 10 అంగుళాలు. బరువు 70 కిలోలు. ఈమె తరువాత రాధిక అనే అమ్మాయి 5 అడుగుల 8 అంగుళాల పొడవుతో వాలీబాల్ ఆటల్లో రెండవస్థానంలో నిలుస్తుంది. ఆమె బరువు 45 కిలోలు.

ఇద్దరూ మెడ్రాస్ విశ్వవిద్యాలయానికి చెందిన విద్యార్థినులు. మొదట్లో ఇద్దరూ వాలీబాల్ ఆటయందు పెద్దగా ఉత్సాహం చూపేవారు కాదు. కానీ వాళ్ళ గేమ్స్ టీచర్ వసంత వారిని ఆ దిశగా ప్రోత్సహించింది. ప్రఖ్యాత వాలీబాల్ ఆటగాడు గురునాధన్ వద్ద వీరిరువురూ శిక్షణ పొందారు.

శ్రీమతి ఈ ఆటల్లోపడి డిగ్రీ పూర్తిచెయ్యలేకపోయింది. తమిళనాడు స్కూల్ గరల్స్ టీమ్‌కి శ్రీమతి చాలాకాలం కెప్టెన్‌గా వుండేది. ఆమెకు అసిస్టెంట్‌గా రాధిక వుండేది. ఇద్దరూ శాకాహారులే. ఆ శాకాహారమే వాళ్ళు చక్కగా ఆడేందుకు దోహదం చేసిందని వారి నమ్మకం. వాళ్ళలో సీనియర్, జూనియర్ అనే బేధాభిప్రాయాలు లేకుండా కలిసి మెలిసి వుండేవారు. ఇద్దరూ రైల్వే డిపార్ట్‌మెంట్‌లో పనిచేసేవారు. ప్రస్తుతం తమిళనాడు రాష్ట్రంలో ఉమెన్స్ వాలీబాల్ టీమ్‌కు ఇద్దరూ ప్రాతినిధ్యం వహిస్తున్నారు.




8వ క్లాసునుంచే శ్రీమతి వాలీబాల్ ఆడటం ప్రారంభించింది. అప్పటినుంచే ఆమె టీమ్ కెప్టెన్ అయింది. అటుపైన డిస్ట్రిక్ట్ కెప్టెన్ అయింది. ఇండియన్ నేషనల్ ఉమెన్స్ వాలీబాల్ టీమ్‌లో సభ్యురాలైంది. ప్రస్తుతం ఆమె ఈ టీమ్‌కి వైస్‌కెప్టెన్ అయింది

1980లో సియోల్‌లో జరిగిన ఏషియన్ ఉమెన్స్ వాలీబాల్ పోటీలో ఇండియాకి ఇత్తడి కప్పు దొరికినా, శ్రీమతి మాత్రం ఆ ఆటలో అద్భుతంగా ఆడిందని పొగిడారు.

1981 మెక్సికో గేమ్‌లో కూడా శ్రీమతి టీమ్‌లో వుంది. వాలీబాల్ ఆటలోనేకాక



కర్నాటక సంగీతంలో కూడా ప్రావీణ్యం ఉంది. శ్రీమతికి పెయింటింగ్స్ వేయడంలో కూడా అద్భుత ప్రావీణ్యం వుంది. సంగీతంలో, పెయింటింగ్స్‌లో కూడా ఈమె అనేక పతకాలను పొందింది.

అయితే వాలీబాల్ ఆటలో మాత్రం వీటిని అధిగమించిందనే చెప్పాలి. కానీ ఈ ఆటలు ఆమె చదువుకు మాత్రం అంతరాయం కలిగించాయి. తమిళనాడు రాష్ట్రంలో వాలీబాల్ ఆటను ఎంతో అభివృద్ధిలోకి తీసుకువచ్చిన శ్రీమతికి ఆ రాష్ట్రంలోని కాలేజీ అధికారులు ఆమెకి బి.కాం. డిగ్రీ ప్రదానం చెయ్యడంలో అలక్ష్యాన్ని చూపించారు. క్రీడాకారులకు ఇవ్వవలసిన వెసులుబాటును, సౌకర్యాన్ని కాలేజీనుంచి పొందలేక డిగ్రీ సర్టిఫికెట్ తీసుకోలేకపోయింది.

ఈ వాలీబాల్ ఆట ఆమె వివాహానికి కూడా అడ్డంకే అయింది. మగపెళ్లివారు ఆమె వాలీబాల్ ప్రావీణ్యాన్ని ఏమాత్రం పట్టించుకోలేదు సరికదా డిగ్రీ ఎందుకు పూర్తి చెయ్యలేదని ప్రశ్నించారు. ఏదయినా ఆమెలో క్రీడానైపుణ్యానికి పాక్షిక కీర్తి మాత్రమే దక్కింది.

శ్రీమతికి తరువాతి స్థానంలో వున్న రాధిక దిగువ మధ్యతరగతి కుటుంబంనుంచి వచ్చింది. చిన్నప్పుడే తండ్రిని పోగొట్టుకుంది. స్కూలురోజులనుంచే కబడీలాంటి ఎన్నో ఆటలు ఆడేది. చివరగా వాలీబాల్ ఆటయందు మక్కువతో ఇంటర్ కూడా పూర్తి చెయ్యలేకపోయింది ఆ అమ్మాయి.

---

## కాలయంత్రం

ప్రకృతికి సంబంధించిన ఎన్నో రహస్యాలను మనిషి తన మేధోశక్తితో తెలుసుకుంటూనే వున్నాడు. అయితే కాలాన్ని గణించడం విషయంలో మాత్రం కృతకృత్యుడు కాలేదంటున్నారు కొందరు.

అసలు టైము గురించి చెప్పాలంటే చాలామందికి ఎవరితోనైనా మంచి ఖబుర్లు చెప్పేటప్పుడు, లేదా ఏ పేకముక్కలు ఆడేటప్పుడో, సినిమాలు చూస్తున్నప్పుడో మనకి తెలియకుండానే టైము గడిచిపోయినట్టు అనిపిస్తుంది. అదే ఏ రైలు కోసమో, ఇంటర్వ్యూకోసమో ఎదురు చూస్తున్నప్పుడు టైమే గడవనట్లనిపిస్తుంది. దీన్నిబట్టి చూస్తే కాలం మనల్ని తన గుప్పెట్లో పెట్టుకుందనిపిస్తుంది.

కాలానికి నిర్వచనం చెప్పడం చాలా కష్టం. అయితే అదొక నిరంతర ప్రవాహంలాంటిదని పోల్చగలమంతే. కాలాన్ని సరిగ్గా కొలవడమనేది అసాధ్యం అంటారు శాస్త్రవేత్తలు. కాలానికి సంబంధించి ఆధునికుల అభిప్రాయమేమిటి? అని ప్రశ్నించుకుంటే... ముందు అసలు కాలంయొక్క చరిత్రను తెలుసుకోవడం అత్యంత ఆవశ్యకం. పూర్వం టైము తెలుసుకుందుకు సన్‌క్లాక్స్, వాటర్ క్లాక్స్, వ్యాక్స్‌క్లాక్స్... ఇలా ఎన్నో గడియారాలు వేరువేరు మ్యూజియంలలో అమర్చబడ్డాయి. ఇవి మనకి ఆనాటి టైమును లెక్కించే పద్ధతిని తెలియజేస్తున్నాయి. పూర్వకాలపు శాస్త్రజ్ఞులు కాలాన్ని సరిగ్గా లెక్కించడం విషయంలో ఎంతో కృషి చేశారు. దానికి ఢిల్లీలోని జంతర్ మంతర్, రోము, ఈజిప్టు, బాబిలన్‌లలోని సూర్యదేవాలయాలు ఉదాహరణలుగా నిలుస్తాయి.

ఆరోజుల్లో చర్చిలో మోగే గంటలనుబట్టి టైము తెలుసుకునేవారు సామాన్య ప్రజలు. పల్లెల్లో అయితే కోడి కూతనుబట్టి, సూర్యుని నీడనిబట్టి సమయాన్ని అంచనా వేసేవారు. 1675లో ఆంగ్లేయులు మొట్టమొదటిసారిగా సమయాన్ని సరిగ్గా గణనచేయడంలో సమర్థులుగా నిరూపించబడ్డారు. శక్తివంతమైన కెమేరాలనుపయోగించి ఒకసారి భూమి సూర్యునిచుట్టూ తిరగడానికి 365, 24219879 రోజులు పడుతుందని అంచనా వేశారు.








టైమును లెక్కించడంలో ప్రాథమిక కొలమానం సెకను. యాటమిక్‌క్లాక్‌లో చూపించే టైము సరిఅయినదే అయినా లక్షా అరవైవేల సంవత్సరాలకొకసారి ఒక సెకను తప్పు చూపిస్తోందని తెలుస్తోంది. ఏది ఏమయినా ఈ గడియారమే ప్రస్తుతం ఖచ్చితంగా టైమును తెలియజెప్పే సాధన.

సరిగ్గా సమయం ఎంతయిందీ, అది గ్యారంటీ యేనా అనే విషయాన్ని నిర్దిష్టపరచేందుకు పారిస్‌లో ఒక ఇంటర్నేషనల్ కాన్స్‌టలేషన్ యూనియన్ వుంది. ఇది ప్రపంచ నలుమూలలనుంచీ ప్రసిద్ధి చెందిన ప్రయోగశాలలనుంచి టైమును తెలుసుకుంటుంది. ఇవన్నీ ఒకేలావుండవు. అప్పుడు ఈ టైమ్ బ్యూరో ఆ సమయాలనన్నిటినీ కలిపి యావరేజ్‌ని లెక్కించి అసలు టైమును ప్రకటిస్తుంది.

దీని ప్రకారం చూస్తే సమయాన్ని గణించడానికి రెండే పద్ధతులున్నాయి. 1. అణుగడియారం 2. భూమి తన కక్ష్యలో తిరుగుతున్న వేగాన్నిబట్టి తెలుసుకోవడం.

అయితే రెండవది మొదటిదానంత ఖచ్చితంగా తెలియజేస్తుందన్నది సందేహమే. ఎందుకంటే అనంత కాలగమనంలో భూమి తిరగడాన్ని పరిశీలిస్తే దాని గమనవేగం క్రమేణా తగ్గుతూ వస్తున్నట్టు తెలుస్తోంది. 1972 నాటికి భూమి 23 సెకండ్లదాకా కోల్పోయి తక్కువ సమయాన్ని సూచిస్తోంది.

అణుగడియారంలో అణువుల ప్రకంపనలు 9192631770 వుంటే అది ఒక సెకనుగా లెక్కిస్తారు. అయితే అదే ఖచ్చితమనీ, అలాగే అది ఎప్పటికీ పాడవకుండా పనిచేస్తుందనీ నమ్మకం లేదంటున్నారు కొందరు. దాన్ని తెలుసుకోడానికి శాటలైట్‌పై ఆధారపడ్డారు.

ప్రస్తుతం నేషనల్ ఫిజిక్స్ లేబరేటరీ మనకు ఖచ్చితమైన టైమును తెలియజేస్తోంది. ఇందులో అల్ట్రామోడరన్ యాటమిక్ క్లాక్స్ ఇప్పటికీ ఖచ్చితమైన కాలగణనను చేస్తున్నాయి.

టైముకు సంబంధించిన ఆధునిక మార్పులను ఈ ప్రయోగశాల ఎప్పటికప్పుడు గమనిస్తూ వుంటుంది.

# మట్టిలో మాణిక్యం

తేనెలు జాలువారేట్లు జానపదగీతాలను ఆలాపించగల అతడు ఓ కట్టుబానిస. ఆధునికతకు దూరంగా, కష్టించి పనిచేసి తన సంసారాన్నే గడపలేని స్థితిలో ఉన్నాకూడా అతనికి రోజు మొత్తానికి స్వర్గసుఖాన్ని అందించే సమయం అతను పాడుకునే సమయమే. పరిసరాలను మరచి అద్భుత గాన రసాస్వాదనలో మునిగే అతడిని బయట ప్రపంచం చాలాకాలం గుర్తించలేదు. పొట్టిగా, అమాయకమైన ముఖంతో, ఏమాత్రం ప్రత్యేకత కనిపించని అతడు గాన సరస్వతి యొక్క పుం రూపమంటే ఎవరూ నమ్మరు. ఇతని పేరు నింగదహళ్లి మారప్ప. అడి-కర్నాటక కులంలో అత్యంత వెనుకబడిన కులంలో పుట్టాడు మారప్ప. ఇతని జన్మస్థలం చిత్రదుర్గ తాలుకాలోని నింగదహళ్లి.

ఒక చిన్న గడ్డి గుడిసెలో ముగ్గురు కొడుకులు, కూతురితో దుర్భర దారిద్ర్యంలో మగ్గుతున్నా అతడెప్పుడూ "భగవంతుడే నాకు రక్షణనిస్తాడు'' అంటూ వుండేవాడు. వెనుకబడిన జాతుల కులాల వారికి ప్రభుత్వం కల్పించిన సౌకర్యాల గురించి కూడా ఇతనికి ఏమాత్రం తెలియదు. ఎప్పటికయినా తను ఒక మంచి కట్టుదిట్టమైన ఇల్లు కట్టుకోవాలని అనుకునే వాడు.

అయితే ఒక రోజు అదృష్టం అతని తలుపు తట్టింది. మీరసబిహళ్లి శివన్న అనే వ్యక్తి అతని గాన మాధుర్యంలోని ప్రజ్ఞను గుర్తించాడు. అనేక రకాల పురాణ గాథల్ని గాన రూపంలో అత్యంత మధురగాత్రంతో ఇరుగుపొరుగులకు వినిపించేవాడు మారప్ప. చివరకి అతని అదృష్టం తిరగబడి అతని కళ ప్రపంచపు వెలుగు చూసింది. 1985లో 'ఫోక్‌సాంగ్స్ అండ్ యక్షగాన ఎకాడమీ' వాళ్లు మారప్పని సన్మానించి అవార్డు ఇచ్చారు. వెనుకబడిన జాతులలోని ఓ కట్టుబానిస ఇలా అవార్డు తీసుకోవడం చరిత్రలో ఇది మొదటిసారి అన్నారు చాలామంది.




అవార్డుతోపాటు 2,000 రూపాయల నగదు బహుమతి కూడా లభించింది మారప్పకు. ఆ డబ్బుతో నువ్వేం చేయదల్చుకున్నావని కొందరడిగితే, నా కొడుక్కి వైభవంగా పెళ్లిచేసి, కొన్ని మేకలను కొనుక్కొని జీవనాన్ని వెళ్లబోసుకుంటానన్నాడతడు. అయితే ఒక అవార్డ్‌తోనే సరిపెట్టిన ఆ సంస్థగానీ, ప్రభుత్వంగానీ మట్టిలో మాణిక్యంలా వున్న ఆ అద్భుత కళాకారుణ్ణి వెలికి తీసి మరేలాంటి సాయం చేయలేకపోయాయి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 318181, 399444; Madras: 8270434, 8251044;Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216: Suryapet: 21146; Guntur; 353942.

CHATURA Telugu Monthly Hyderabad - 500 482 Regd. No. H/HD/402

# కొందరికి పులుపంటే ప్రేమ ఎక్కువ!!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.










**Pickles**
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసి

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,(ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482